# గోథే

అనువాదము

వి. యస్. శర్మ

సాహిత్య అకాడెమి పక్షమున

ప్రతిభా బుక్స్

మద్రాసు-7



Goethe's *Faust* (Part I) Translated From German into Telugu by V N Sharma Published by Protima Books, Madras - 7 on behalf of Sahitya Akademi, New Delhi, 1962 Price Rs 5



ప్రకాశకులు
సాహిత్య అకాడెమీ పక్షమున
ప్రతిమా బుక్స్, మద్రాసు - 7

Also available at
Sahitya Akademi New Delhi 1

ముద్రాపకులు
భారతమాతా ప్రెస్, మద్రాసు - 1

మూల్యము
అయిదు రూపాయలు

# మున్నుడి

## ఎరిచ్ ట్రూయన్జ్

గొథే మహాకవి రచించిన 'ఫౌస్ట్' రూపకమును అర్థం చేసుకోవడం సులభమైనపని కాకపోయినా, ఇంచుమించు పాశ్చాత్యభాష లన్నిటిలోకి అని తర్జుమాఅయింది. 'ఫౌస్'రచనను అర్థంచేసుకోడానికి ఆకాలం నాటి పాశ్చాత్య సంస్కృతి, ముఖ్యంగా అప్పటి జర్మన్ సంస్కృతి మనకు తెలిసివుండటం ఎంతో అవసరం ఈ నాటక పాత్రలలో ఒక విశిష్టత వున్నది. అందలి రంగాలు తేజోవంతమైనవి. కథా శిల్పంలోని లాలిత్యం చెప్ప నవసరంలేదు ముఖ్య పాత్ర మానవ మాత్రుడు ఎన్నెన్నో తప్పులు చేయవలసి వచ్చింది మానవుడు కావడం మూలాన అయినప్పటికీ ఈ నాటకం ఎంతోమందిని ఆకర్షిస్తూనే వుంది.

గోథె రచనల్లో 'ఫౌస్ట్'కు ఒక విశిష్టస్థానం వున్నది ఈ రచయిత ఒక్క కవే కాగు, గొప్ప ప్రకృతిశాస్త్రవేత్త అధికారవర్గంలో పేరూ ప్రఖ్యాతీ కాంచిన ఉద్యోగి 1800 ప్రారంభంనాటి ఐరోపా ఖండ సంస్కృతిక ఆయన ఒకవిధంగా ప్రతినిధి. ఆ సంగతి ఆయనజీవితమే మనకు వేనోళ్ళ చాటుతూవుంది.

వర్తక వ్యాపారాలకు సుప్రసిద్ధమైన ఫ్రాంక్‌ఫర్ట్ నగరంలో గోథ 1749 సం॥ ఆగష్టు నెల 28 తేదీన జన్మించాడు. తండ్రిగారి శిక్షణలో చగువు ప్రారంభించి, లైప్ చిగ్, స్ట్రాస్‌బుర్గ విశ్వవిద్యాలయాల్లో న్యాయశాస్త్రం చదివి పట్టభద్రుడయ్యాడు. అలా ఉన్నత విద్యలో నిమగ్నుడైవున్నా, ప్రకృతి శాస్త్రం పట్ల, సాహిత్య మత తత్వముల పట్ల ఎంతో అభిమానం వుత్సాహం చూపెడుతూండేవాడు.

నాటక ప్రారంభంలో అన్ని కళలను క్షుణ్ణంగా తెలిసికొనటానికి అవసరమైన శిక్షణాసంపత్తి సేకరించడానికి, ఫౌస్ట్ చేసిన ప్రయత్నములు చాలావరకు గోధే యౌవనదినాలని ప్రతిబింబిస్తూవున్నవని అనవచ్చు.

గోధే జీవితం 19 వ శతాబ్దం ప్రారంభంనాటి ఆధునిక ప్రకృతి శాస్త్ర పరిశోధనకు, తద్వారా కార్యరంగంలోకి వచ్చిన సాంకేతిక శాస్త్ర సాధనకు, ఇంచుమించుగ సమకాలికమైనదనే అనవచ్చు ఆ రోజుల్లో ప్రకృతి రహస్యం అవగాహన చేసుకొనడానికి మానవుడు చేసిన ప్రయత్నం అపారం కాని దానిని వుపయోగించుకోటంలో మానవుడు ప్రకృతి సంపూర్ణత్వాన్ని మాత్రం అర్థంచేసుకోలేక పోయాడు. ఈలోటు తీరుస్తూ ప్రకృతి సంపూర్ణత్వం అర్థం చేసుకోవడమే గోధే తన దృక్పథంగా ఉంచుకొన్నాడు

గోధే మొట్టమొదటి రోజుల్లో సృష్టించిన శిల్పకళల్లో, ఆయన భావనా ప్రపంచాన్ని స్పష్టంగా చూడవచ్చు. ఆ రోజుల్లో ఆయన వ్రాసిన నాటకం 'బెర్లి చింగ్ నే గొట్చ్', ఆయన సృష్టించిన కథా శిల్పం 'యువకుడైన వేర్తర్ బాధాపరంపరలు' ఈ రెండూ సాహిత్యరంగంలో ఆయన పేరు ప్రతిష్ఠలు నిలువపెట్టడానికి దోహదమిచ్చాయి. సామాన్య సంస్థానాధీశులలో ఒకరయిన వైమార్ రాజు గోధ కవిని 1775 సం॥లో తన సంస్థానానికి ఆహ్వానించాడు. అప్పటినుంచీ జీవితాంతంవరకు ఈ మహాకవి ఆ వైమార్ సంస్థానంలోనే వుండిపోయాడు అక్కడ వున్న రోజుల్లో ఆ ప్రాంతం ఖనిజ శాఖను కట్టుదిట్టంలోకి తీసుకొని రావడానికీ, రహదారులు నిర్మించడానికీ, గ్రంథాలయాలు స్థాపించడానికీ, కళామందిరాలు నిలువబెట్టడానికీ, 11 సంవత్సరాలు మంత్రిగా పనిచేశాడు. ఈ మంత్రి పదవినుంచి విరమించుకొని రెండు సంవత్సరాలు ఇటలీ దేశంలో సంచారం చేశాడు అక్కడి నుంచి తిరిగి రాజధాని నగరం చేరుకోవడంతో, ఆ సంస్థానంయొక్క సంస్కృతీసంస్థల (నాటకరంగం, చిత్రకళాశాల, గ్రంథాలయాలు, చిత్రప్రదర్శనశాలలు) - వీటి పరిపాలనాధికారం ఆయనపై పడింది.

ఆ కాలంలోనే ఆయనకు సాహిత్యరంగంలో ఎక్కువ పరిశ్రమ చేయడానికి అవకాశం లభించింది.

వార్ధకం నాటికి గోథే పేరు ఐరోపా ఖండమంతటా అన్ని ప్రాంతాలలోనూ బాగా తెలిసింది. అయన్ను చూడడానికి ఎన్నెన్నో దేశాలనుంచి అభిమానులు రాసాగారు. అలా వచ్చినవారిలో కొంతమంది ఆయనతో జరిపిన సంభాషణలు గ్రంథస్థం చేయ ప్రారంభించారు. 1827-1830 సం॥ల మధ్యకాలంలో ఆయన రచనలు నలభై సంపుటాల్లో ప్రచురింపబడ్డాయి. ఆయన మరణించిన తర్వాత, గోథే చనిపోయింది, 1832 సం। మార్చి 22 తేదీన — అముద్రిత గ్రంథాలు మరెన్నో ఆయన రికార్డు కాగితాలలో కనబడ్డవి.

గోథే సాహిత్య రచనలకోసం తొందరపడేవాడు కాదు. తనకు ఇష్టం వచ్చినంత కాలాన్ని దీనికోసం తాపీగా ఉపయోగించుకొన్నాడు. రచన ఒక శిల్పం. దానంతట అది పెరగాలి — అని ఆయన చెప్తుండేవాడు. ఫౌస్ట్ నాటకం మొదటి భాగంలో అనేక ఘట్టాలను 1776 సం॥ నాటికే వ్రాసివుంచినా, గ్రంథమంతా 1808 సం॥ నాటికి గాని పూర్తి అయిందికాదు. నాటకం రెండో భాగాన్ని 1831 సం॥ నాటికి ముగించాడు. అయినా తాను చనిపోయిన తరువాతనే దాన్ని ప్రచురించాలని తగు ఏర్పాట్లు చేశాడు.

గోథే బహుముఖ మేధావి. అనుకొన్న ఏ సమస్యనుగాని అంతు తెలుసుకోనిదాని ప్రకృతి ఆయనకు శక్తిసంపదలు ప్రసాదించింది. శాస్త్ర పద్ధతులు ఆయన సాధనకు ఎంతో వన్నె పెట్టాయి. అందుచేతనే ఆయన జీవితమంతా ఇటు ప్రకృతి శాస్త్రంలో అపార పాండిత్యాన్ని గడించడానికి, అటు సాహిత్య రచనా సాధనని నిర్విఘ్నంగా కొనసాగించటానికి వినియోగించుకొన్నాడు. ఈ సాధన సంపత్తితో పాటు ఎన్నెన్ని కోవలకో సంబంధించిన చారిత్రక పరిశోధనలు నిర్విఘ్నంగా కొనసాగించాడు.

జర్మను సంస్కృతి ఏయే కోవల్లోనుంచి విశిష్టస్థానానికి రాగలిగిందో ఆయనకు బాగా తెలుసు. ఈ సందర్భంలో ఈ జ్ఞాన భాండా

నికి ఆధునికయుగంలో కళాకాంతులు దిద్దటానికి ఒకవైపున గ్రీకులు,
ఇంకోవైపున రోమనులు చేసిన కృషిని గుర్తించి చూపాడు ఇలాంటి
కృషి ఒక పద్యసాహిత్యంలోనే కాదు. లలితకళలలో కూడా ఆయన
చేసినసేవ అనంతమని విజ్ఞుల అభిప్రాయం అందు మూలాన్నే ఫౌస్ట్
రెండో భాగంలో ప్రాచీనగ్రీకు ప్రపంచం కన్నులకు గట్టినట్లు మనకు
కనబడుతూ వుంటుంది అంతేకాదు, క్రైస్తవమత సిద్ధాంతాలు, వాటి
చారిత్రక మార్గాలు ఆయనకు కరతలామలకమనే చెప్పవచ్చు కథా
నాయిక మార్గరెట్ లక్ష్యం క్రైస్తవాశయాల ననుసరించి, ఆన జీవిత
రథాన్ని నడుపుకోవాలని! దీన్ని మనం మొదటిభాగంలో కారాగృహా
రంగంలో చూడవచ్చు

గోథే మహాకవి భావనాప్రపంచం ఒక్క జర్మను సంప్రదాయా
లతో, ప్రాచీన గ్రీకు సంస్కృతీమార్గాలతో, క్రైస్తవ మతాశయాలతో,
తృప్తిపడింది కాదు ఆయన జీవించిన కాలంకూడా యిలాంటి విషయా
లకు ఒక విశిష్టత కలిగినది. ఐరోపా ఖండవాసుల దృష్టి ముఖ్యంగా
జర్మనుదేశీయుల ధ్యాస దూరదేశాల వారి సాహిత్యవీధులను పరిశీలించా
లని వాటిని తమదేశభాషల్లోకి అనువదించుకోవాలని గోథేకవే అన్నారు
ఆన కాలం' ప్రపంచ సాహిత్యానికి పునాదులు వేస్తున్నదనీ, ప్రపంచ
వాసులందరూ సాహిత్యరంగం ద్వారా ఒకరికొకరు సన్నిహితులు కావ
డానిక మంచి అవకాశం కలుగుతుందనీ ఆయన అన్నాడు హారకంలో
పారసీక సాహిత్యం, ముఖ్యంగా 'హాఫీస్' కవితను అవగాహన చేసుకో
డానికి ఎంతో కృషి చేశాడు దీనిఫలితమే 1819 సం॥ లో ఆయన
సృష్టించిన 'ప్రాక్ ప్రేమ సాహిత్య సమ్మేళన' (వెస్ట్-ఈస్టరన్ దివాన్)
పారసీకభావనా ప్రపంచాన్ని జర్మన్ దేశీయులకు అందజేసే గేయ
కావ్యం యీ రచన భారతదేశాన్నించి కూడా ఆయన ఆ దేశం చుట్టి
వచ్చిన యాత్రికులమూలాన్న ఎంతో తెలుసుకున్నాడు. 1791 సం॥ లో
కాళిదాసు మహాకవి రచించిన శకుంతలనాటకం జర్మను భాషలోకి
జార్జిఫారెస్టర్ అనువాదం చేశాడు. ఈ నాటకం గోథేని ఎంతో ఆక
ర్షించింది దీనిఫలితమే గోథే తనఫౌస్ట్‌కి వ్రాసిన నాందీ ప్రస్తావన. అంత
వరకు జర్మను నాటకాలకు ఇలాంటి నాందీప్రస్తావనలు లేవు. అప్పటినుంచీ

భారతసాహిత్యం నుంచి అనువాదం చేయబడ్డరచనలపట్ల ఎంతో వుత్సాహం చూపుతూ వాటిని తప్పనిసరిగా చదువుతూండేవాడు 1810 సం॥ లగాయతు జర్మను పండితులు భారతసాహిత్యం పట్ల అభిమానం చూపెడుతూ, దానిని తమ దేశీయులకు పరిచయం చేయడానికి ప్రారంభించారు. ఈ సందర్భంలో ఎక్కువ పరిశ్రమచేసిన అగస్టు విలియమ్ ష్లేగల్, ఫ్రెడరిక్ రూక్కరేట్ పండితుల నిద్దరినీ ప్రత్యేకంగా పేర్కొనాలి అంతటితో గోథే తృప్తిపడలేదు. యూరోపియన్ భాషలలోకి తర్జుమా చేయబడ్డ చీనాదేశపు సాహిత్యగ్రంధాలని చదవడానికి ఎంతో వుత్సాహం చూపాడు. అందుచేతనే అప్పటినుంచి తన జీవితాన్ని 'ప్రపంచ సాహిత్యం' కోసం అంకితం చేశాడు. ప్రతిదేశంవారు వారి వారి జాత్యభ్యుదయాన్ని చిరస్థాయిగా నిలువబెట్టుకోవడానికి అమర కావ్యాలను రచించివుండాలి ఈ కావ్యాలే ఒకరినొకరు అర్థం చేసుకోనడానికి పునాదులు వేస్తాయి వీటిద్వారా ఒకరినొకరు తెలుసుకోనడానిక శాయశక్తులా ప్రయత్నిస్తే, ప్రపంచప్రజ సుసుఖభావంతో మెలుగుతూ కలిసిమెలిసి వుండటానికి అవకాశం కలదనే భావం గోథే మహాకవిలో దృఢంగా నాటుకొనిపోయింది

## మొదటి భాగం

ఫౌస్ట్ నాటకానికి కథావస్తువు 16వ శతాబ్దంలో ప్రచారంలో నున్న ఒక జానపద గాథ ఆ కాలంలో జర్మను దేశంలో ఫౌస్ట్ అనే వ్యక్తి వుండేవాడు. పలు ప్రాంతాల సంచారంచేస్తూ, వింత వింత గారడీలు చేస్తూ వుండేవాడు. అందుచేత అతనిని పెద్ద పండితుడని అందరూ అనుకొంటూ వుండేవారు. ఆయన్ను గురించి మనకు అందుబాటులో వున్న ఆధారాలు బహు కొద్ది ఆ ఫౌస్ట్ చనిపోవడంతో ఎన్నెన్నో కథలు, గాథలు ఆయన జీవితంలో అంకెపడ్డవి. ముఖ్యంగా భూతాలతో సంధి చేసుకొనేమంత్రగాని కథలు ఇందులో బహుళ ప్రచారంలోకి వచ్చాయి. ఈ సందర్భంలో ఎన్నెన్నో రచనలు పైకి వచ్చాయి. అంతేకాదు, బొమ్మలాటకు అనుగుణంగా వుండే చిన్న

చిన్న నాటకాలు కూడా రచింపబడ్డాయి. ఫౌస్ట్ మొదటి భాగంలో ఈ ప్రాచీన కథావస్తువుకే దోహదమిస్తూ గోథే తన రచనను నడిపాడు.

తన శిష్యుల్లో ప్రధానుడైన వాగ్నర్‌ని వెంటబెట్టుకొని ఫౌస్ట్ ఈస్టరు పండుగ రోజున ఊరిబయట షికారుకు బయలుదేరుతాడు. ఊరు ద్వారం ముందు పండగలో పాలుగొనడానికి వెళ్లుతూవుండేవారిని కలుసుకొంటాడు కొంతదూరం వెళ్ళాక సూర్యాస్తమయం కేసి తదేకంగా చూస్తూవుంటాడు ఆయన యింతవరకూ జనంలో చూస్తున్న ఉత్సాహం, ఆనందం మాయమవుతాయి. తత్వ విచారణలో మునిగి తేలుతూ వుంటాడు 'ఆ రెండు ఆత్మలు నా హృదయ పీఠంలో తిష్ఠ వేసుకొని వున్నాయి ఆ రెండు ఒకదానినుంచి మరొకటి విడిపోవాలని ఎత్తులు వేస్తున్నాయి' అనుకొంటూ ఆ సమస్యను తేల్చుకోలేక ఉక్కిరి బిక్కిరవుతూ ఉంటాడు ఆ సమయానే ఒక కుక్కపిల్ల ఆయన దగ్గిర ప్రత్యక్షమవుతుంది దాన్నికూడా వెంటబెట్టుకొని కొంతసేపటికి తన మందిరం చేరుకొంటాడు. ఆ సమయంలో ఏం తట్టిందో బైబిలులో - జాన్ సువార్తను వాళ్ల భాషలోకి తర్జుమా చేయడానికి ప్రారంభిస్తాడు ఈ పని, కుక్కకు ఏమాత్రం నచ్చలేదు కాబోలు అరవడం మొదలుపెట్టుతుంది. దాన్లోనుంచి తటాలున మెఫిస్టోఫిలిస్, విద్యార్థి రూపంలో ప్రత్యక్షమవుతాడు. అతడు 'విశ్వశక్తిలో నేనొక భాగాన్ని. అయినా నా పని అన్నిటినీ ప్రతిఘటించటమే అంతా బాగుగా సాగాలని ఆ విశ్వకర్మ కోరిక. అయితే ఆ మంచికికూడా అడ్డు పుల్లలు వేస్తూ పనులు చెడగొట్టడం నాకు ఎంతో సరదా' అంటాడు ఫౌస్ట్ అతనితో ఒక విధమైన రాజీకి వస్తాడు, దాని ప్రకారం మెఫిస్టోఫిలిస్ తన మంత్ర తంత్రాలతో ఫౌస్టుకి సేవచేస్తూ వుండాలి. దానికి ప్రతిఫలంగా 'ఆ ఇతరలోకంలో' మెఫిస్టోఫిలిస్‌కి దాసానుదాసుడుగా వుండాలి.

ఈ కొత్తజీవితం ఫౌస్ట్‌ను లైప్‌జిక్ నగరంలో ఆవర్ బాక్ హోటల్లోకి నడిపించుకొని వెళ్ళుతుంది. అక్కడ తారసిల్లే విద్యార్థులు తప్ప త్రాగడం, అసభ్యమైన మాటలతో తందనాలు త్రొక్కడం

చూస్తాడు పిమ్మట మెఫిస్టోఫీలిస్ ఫౌస్ట్‌ని మంత్రకత్తె యింటికి తీసుకొని వెళ్ళుతాడు. అక్కడ ఆడకోతులు మగకోతులు చేస్తూవున్న అల్లరి సద్దటానికి ప్రయత్నించే సమయంలో, ఫౌస్ట్‌కు అక్కడవున్న అద్దంలో అత్యంత సౌందర్యవతియైన స్త్రీమూర్తి కనబడుతుంది ఆ దృశ్యం ఆయనలో ఎన్నో వాంఛలు రేకెత్తిస్తుంది పునర్యౌవనం కలిగించడానికి మంత్రకత్తె మందు తయారుచేసి యిస్తుంది దాంతో ముసలి ఫౌస్ట్ నవయువకుడుగా మారిపోతాడు. ఈ యౌవనోద్రేకంలో ఫౌస్ట్ ప్రథమంలో కలుసుకొన్న యువతి మార్గరెట్ ఆ యువతి తనకు కావాలని తహతహ పడుతూవుంటాడు వారిద్దరూ పదేపదే కలుసుకోవడానికి మెఫిస్టోఫిలిస్ ఎన్నెన్నో అవకాశాలు కల్పిస్తాడు. మార్గరెట్ యింటిపక్కనే నివసిస్తూ వుండే మార్తాతో మంతనాలు ప్రారంభించి, ఇటలీలో మరణించిన భర్త సంగతి ఆవిడకు చెప్పుతాడు. ఆ సమయంలో అక్కడేవున్న మార్గరెట్‌తో ఫౌస్టుకు బాగా పరిచయమవుతుంది. మార్గరెట్ ఆయన్ను తనయింటికి పిలుచుకొని వెళ్ళుతుంది, ఇద్దరూ ౧ంటల పర్యంతం కాలక్షేపం చేస్తూ వుంటారు ఫౌస్ట్ యిచ్చిన మత్తుమందువలన మార్గరెట్ తల్లి గాఢనిద్రలో కండ్లుమూసుకొంటుంది. తల్లి మరణ వార్త తెలుసుకొన్న మార్గరెట్ సోదరుడు వెంటనే, అక్కడికి వస్తాడు. తల్లి మరణానికి కారణభూతుడు ఫౌస్టు అంటూ ఆయనమీద చెయ్యి చేసుకోబోతాడు వాలంటీన్ ఆ సమయంలో మెఫిస్టోఫిలిస్ కలుగ చేసుకొంటాడు. వాలంటీన్ అకాల మరణానికి గురికావలసివస్తుంది. మార్గరెట్ గర్భవతి అవుతుంది. దానితో ఆమెకు అశాంతి ఎక్కువవుతుంది. ఇటు ఆ యువతి చేసే ప్రార్థనలు కాని, అటు చర్చిగాని ఆమెకు శాంతిని ఇవ్వడానికి దోహదమివ్వవు. ఇక్కడ యిలా అశాంతి రేకెత్తుతూ వున్న కాలంలోనే మెఫిస్టోఫిలిస్ ఫౌస్ట్‌ను మంత్రకత్తెలు జరుపుకుంటూ వున్న వాల్ పర్గిస్ పండుగకు తీసుకొని వెళ్ళుతాడు. భూతపిశాచాలకు ముఖ్యమైన పండుగ యీ వాల్ పర్ గీస్ రాత్రి. ఇక్కడ తారట్లాడుతూ వున్న సమయాన మార్గరెట్ చిత్రాన్నే చూశానని ఫౌస్ట్ భ్రమపడి తాడు ఇంతలో మార్గరెట్ కారాగృహంలో పడవలసి వచ్చింది పుట్టినబిడ్డను హత్య చేసిందనే నేరారోపణమీద ఆమె అన్నను పోగొట్టు

కొన్నది. చేతులారా మత్తుమందు పెట్టి తల్లిని చంపుకొన్నది ఉన్మాదావస్థలో వున్న మార్గరెట్‌ను ఫౌస్ట్ జెయిలులో కలుసుకొంటాడు ఆమెకు కొంతసేపటికి స్మారకం వస్తుంది. ఈపాపకూపంనుంచి తనను గట్టెక్కించమని భగవంతుని ప్రార్థిస్తుంది అశరీరవాణివల్ల ఆమెకు తరుణోపాయం లభించింది, అని స్వస్తివాక్యం చెప్పుతుంది

ఆరోజుల్లో ప్రచారంలో ఉన్న జానపదగాథలు, ముఖ్యంగా బొమ్మలాటల కోసం తయారుచేయబడ్డ నాటకాల్లోని కథావస్తువును మెరుగు చేయడానికి గోథే ఎంతో కృషిచేశాడు అలాటిదానిలో మణిపూస 'దేవలోకం' రంగం అనవచ్చు అదే నాటకరంగాలకు ఆధ్యాత్మిక రూపాన్నిస్తూ అందులో మెఫిస్టోఫిలిస్ స్థానమేమిటో ఇదమిత్థమని ధ్వనిస్తుంది, మెఫిస్టోఫిలిస్‌తో సంభాషణలో ప్రభువే అంటాడు ఫౌస్ట్‌ని ఆదిశక్తినుంచి లేవతీస్తూ, అతన్ని చిందరవందర చేయడానికి భూతానికి స్వాతంత్ర్యం యిస్తూవున్నానని. అదంతా ఫౌస్ట్ యీ భూమిమీద వున్న కాలంలోనే జరగాలంటాడు ప్రభువు దృష్టిలో మెఫిస్టోఫిలిస్ ఒకదొంగ గోథే భాషలో 'దొంగ' అంటే కనబడ్డదంతా ప్రతిఘటిస్తూ వుండే తమాషామనిషి, విదూషకుడు అని భావము నాటకంలో ఆదినుంచి, అంతంవరకూ మెఫిస్టోఫిలిస్ పాత్ర యిదే ఈ పాత్రనే యథాతథంగా నిర్వహించటానికి 'పందెము' కాస్తూవున్నానని అంటాడు ఇలాటి సవాలు నీచపాత్రల మూలాన నడిపించడం ప్రభువుకు యిష్టము లేదు మెఫిస్టోఫిలిస్ ఏమిటో ప్రభువుకు తుణ్ణంగా తెలుసు.

మెఫిస్టోఫిలిస్ ఫౌస్ట్‌ని నదురూ బెదురూ లేకుండా చివరివరకూ లాక్కొని వెడతాడు. మార్గరెట్ తల్లికి ఏదైనా మందు యివ్వాలనుకోటంలో ఫౌస్ట్ ఉద్దేశం ఆవిడ హాయిగా నిద్రపోవాలని. మెఫిస్టోఫిలిస్ చేసిన పని, ఆ మందులో మత్తుతో నిండిపోయిన విషాన్ని కలిపి యివ్వడం. ఫౌస్ట్ వాలెంటిన్‌తో తగవులాడుతున్నప్పుడు మెఫిస్టోఫిలిస్ చేసింది అతన్ని హత్య చేయడం. మెఫిస్టోఫిలిస్ ఎత్తులు బాగా సాగటంతో ఫౌస్ట్ చెడ్డపనులకు తల వొగ్గవలసి వస్తుంది. మెఫిస్టోఫిలిస్ కోరిక ఫౌస్ట్‌తో ఒక విధమైన ఒడంబడికకు రావాలని॥ అలాటి ఒడం

బడికమూలాన ఫౌస్ట్ జీవిత సుఖాలను అనుభవిస్తూ మైమరచిపోవచ్చు అని అతని ఆశ. కాని దానితో ఫౌస్ట్‌కు తన సంగతి బాగా స్మరణకు వస్తుంది తాను యిక్కడ సాధించవలసింది, జీవిత అంతరార్థం తెలుసుకోటానికి! ఇది మెఫిస్టోఫిలిస్‌కి ఏ మాత్రమూ నచ్చదు అలాటి సాధన చెడగొట్టటానికి పశువాంఛను ఫౌస్ట్‌లో రేకెత్తిస్తాడు ఇది ఫౌస్ట్‌లో ప్రేమగా మారిపోతుంది. ఇలా మెఫిస్టోఫిలిస్, ఫౌస్ట్ ఎత్తులకు పైఎత్తులు వేస్తూవుంటాడు ఈ ఎత్తు పై ఎత్తుల బలాబలాలే నాటకమంతా మనం చూడవచ్చు.

మెఫిస్టోఫిలిస్‌ది ఏదో ఒక చెడ్డ శక్తి కాదు అతనిలో ఒక విధమైన వ్యక్తిత్వం వుంది ఆ వ్యక్తిత్వాన్ని యదాతథంగా నిలువబెట్టుకోగడానికి కావలసిన బల సంపదలు అతనికి వున్నాయి. ఫౌస్ట్‌ది తత్వజ్ఞానం. ప్రభువు అన్నట్లు దాన్ని చేతజిక్కించుకోటం అతనికి మించిన పని. అందుచేతనే ఫౌస్ట్ అంటాడు మానవ హృదయాల్లో రేకెత్తుతూ వుండే జిజ్ఞాసాపరంపరలు ఇదమిద్ధమని అవగాహన చేసుకోవడం - నీవంటి వ్యక్తులకు ఎప్పుడయినా సాధ్యమవుతుందనుకొన్నావా?' ఈ రహస్యాన్ని తేల్చుకోటానికే వాళ్ళిద్దరూ ఒక రాజీకి వస్తారు. ఫౌస్ట్ దృష్టిలో యీ సమస్యే అతి ముఖ్యమైనది

ఫౌస్ట్‌కు తరువాతి తారసిల్లేది వాగ్నర్. హేతువాదంలో బాగా ఆరితేరినవాడు ఈ వాగ్నర్. ఎంతవరకూ సాధ్యమవుతుందో అంతవరకూ పుస్తకాలలోవున్న అన్ని సంగతులు తెలుసుకోవాలనుకొనే విద్వాంసుడు కాని అతనిలో రెండవ వ్యక్తిత్వం కూడా ఉంది. ఆ రెండవ వ్యక్తి అంత తెలివి తేటలు కలవాడుకాదు. అతనికి కావలసింది జీవితాన్ని చవి చూడటం. దీనికోసం జీవితాన్ని శాస్త్రజ్ఞానంతో ఐక్యం చేయుడానికి కావలసిన శక్తి సంపద అంతగ లేదు. ఇంక ఫౌస్ట్ ధ్యాస మానవ జీవితంలోని అన్ని విషయాలూ వాటి వాటి అంతస్సులనుంచే చవి చూడాలని. అందుచేత యీ నాటక నిర్మాణంలో ద్వంద్వత్వం మనకు కనబడుతుంది. ప్రథమంలో ఫౌస్ట్ సాధన విజ్ఞాన శాస్త్రం వైపు వెడుతుంది. దీనికోసం తన విజ్ఞాన అవధులకు

అంతుచిక్కే జ్ఞానాన్ని సాధించాలని ఉబలాటపడుతూ వుంటాడు. ఆయన సాధనలో మరో మెట్టు, ప్రేమ అంటే ఏమో తెలుసుకోవాలని. మనసార ప్రేమించడంతో అది ప్రారంభమయి, తుదకు నేరస్థుణ్ణిగా కట్టివేస్తుంది. దీనికంతా కారణం ఆయన తన ఉత్సాహం ఉద్రేకం మితిమించి చూపడమే అదే అతన్ని తప్పు దోవల్లోకి తీసుకొని వస్తూ వుంటుంది

ఈ విషయాల్లో ఫౌస్ట్ నాటకం రెండోభాగం మొదటిభాగ వాతావరణానికి అనుగుణంగానే నడుస్తూవుంటుంది. ఈ భాగంలోకూడా ముఖ్య పాత్రలు ఫౌస్ట్ మెఫిస్టోఫిలిస్‌లవే! రెండవభాగంలో ఫౌస్ట్‌కోరిక తిరిగి జీవించాలని తనలో రేకెత్తుతూవున్న ఆశయాలు ఆచరణలో పెట్టి, తగినంత అనుభవం సంపాదించాలని! దీనికోసం ఋణబాధలతో వుక్కిరి బిక్కిరై పోతూన్న చక్రవర్తికి చేదోడువాదోడుగా వుంటూ, మెఫిస్టోఫిలిస్ సహాయంతో కాగితపు ధనం కావలసినంతా సృష్టించాలని నిశ్చయించుకొంటాడు. చక్రవర్తి దర్బారులోకి ప్రాచీన గ్రీకు సౌందర్యవతులలో ప్రసిద్ధిగాంచిన హెలీనాని మెఫిస్టోఫిలిస్ తీసుకొనివస్తాడు ఫౌస్ట్ హెలీనా అందానికి పరవశుడవుతూ ఆమెను వాంఛిస్తాడు.

హెలీనా ఫౌస్ట్‌లకు ఒక కొడుకు పుడుతాడు. ఆ బాలుని పేరు పోరోరియన్. ఈ పోరోరియన్ సత్యాన్వేషకుడై ప్రాణాలు కోల్పోవలసి వస్తుంది. కొడుకు ననుసరిస్తూ హెలీనా అధోలోకానికి వెళ్ళిపోతుంది

ఫౌస్ట్ ఆశలకు అంతూ పంతూ లేకపోతుంది. చక్రవర్తి సముద్ర తీరాన్ని ఫౌస్ట్‌కు వొప్పగిస్తాడు. అక్కడ కట్టలుకడుతూ నీటిమయమై పోయివున్న నేలనంతా సస్యశ్యామలం చేయాలనుకొంటాడు. అనుకొన్న పని చకచక సాగలేదు. దీనికోసం మెఫిస్టోఫిలిస్ సహాయం కోరుతాడు. సహాయం చేయడానికి వచ్చిన మెఫిస్టో అక్కడిపనినంతా తారుమారుచేస్తాడు దోపిళ్ళు ఎక్కువవుతాయి. వృద్ధుల నిద్దరిని అక్కడినుంచి మరొకచోటికి తరలించడానికి బదులు చంపివేస్తాడు మెఫిస్టో. ఈ హత్యతో ఫౌస్ట్‌కి మెఫిస్టోమీద గురి తగ్గిపోతుంది. మంత్రతంత్రాలనే పూర్తిగా

విస్మరించి, ఎలాటి సహాయం మెఫిస్టోనుంచి కోరకుండానే, ఇక తనపని తాను చేసుకొంటూ పోవాలని నిశ్చయించుకొంటాడు. ఆయనకు అంత్య దినాలు సమీపిస్తాయి. ఆలాటి తుదిగడియల్లో కూడా తన పనులు యథాతథంగా చేసుకోవాలని పట్టు పడుతాడు.

దివ్యశక్తుల ప్రపంచంలోకి ఫౌస్ట్ ప్రవేశించడం మనం తుదిరంగంలో చూస్తాము. అప్పుడేమీ మాట్లాడడు అంతవరకు తనకు అంతా తెలుసునని గర్వపడుతూవుండే ఫౌస్ట్ మౌనదీక్షకు పూనుకొంటాడు. కొత్త కొత్త విషయాలు తెలుసుకోవాలని జిజ్ఞాస హెచ్చు అయిపోతున్నది దేవదూతలు ఆయనకు సుస్వాగతం ఇస్తూ పై లోకానికి తీసుకొని వెడుతారు కొంచెం దూరం అటుకేసి వెడుతున్న సమయంలో ఏసు ప్రభువు తల్లి మేరీమాత ఆయనకు కనబడుతుంది. ఆ తల్లి చుట్టూ మూగివున్న భక్తులు మార్గరెట్‌ని కటాక్షించమని ప్రార్థేయపడుతూంటారు ఆ దేవతామూర్తిని, వారిమధ్యనే వున్న మార్గరెట్, ఫౌస్ట్ ఆత్మశాంతి కోసం ఆ తల్లిని ప్రార్థిస్తూవుంటుంది ఇక్కడిలోకం సామాన్యమైనది కాదు. ఇక్కడివారు స్వలాభం ఆపేక్షించక ఇతరులకోసం ప్రార్థించడం, ఒకరికొకరు సహాయపడటం చూస్తూ విస్తుపోతాడు. తానూ తన అహంకారానికి పూర్తిగా స్వస్తిచెప్పి ఇంకా ఏమేమో ఎంతెంతో తెలుసుకొంటూ, తన జీవితమార్గాన్నే పూర్తిగా మార్చుకోవాలని తాపత్రయ పడుతాడు. ఎవరు యిలా మారిపోతారో, ఎవరు దైవాన్ని భక్తి ప్రేమలతో పూజిస్తారో అలాటివారిని ఆ దైవశక్తి అత్యున్నత శిఖరాలకు తీసుకొని పోగలదు. ఈ రంగంలో ఫౌస్ట్ యీ దివ్యరహస్యమంతా అవగాహన చేసుకొంటాడు ఇక్కడ జరిగే కార్యకలాపం నెమ్మదిగా జరిగిపోతుంది. అంతా భక్తిశ్రద్ధలకు దోహదమిస్తూవుంటుంది. ఇక్కడ వాతావరణం ఒకఎత్తూ, తాను భూలోకంలో ఎదుర్కొన్న అశాంతియుత జీవిత మొక ఎత్తు అనే దైవరహస్యం ఆయనకు ఇప్పుడు కరతలామలకమవుతుంది.

సమీక్ష

ఫౌస్ట్ తన సాధనలో ఎలాటి మార్గము అనుసరిస్తూ వున్నా - తన ఆదర్శాలు నిలుపబెట్టుకోటానికి తన సర్వస్వం ధారపోశాడు.

వైపు పండితుడిగా మరోవైపు ప్రేమికునిగా ఆయన చూపెట్టుతూవున్న పట్టుదల ఫౌస్ట్ మొదటి భాగం మనకు వ్యక్తపరుస్తుంది రెండో భాగం అనాదినుంచీ వస్తున్న సౌందర్యం పట్ల మానవుడికి వున్న భక్తి శ్రద్ధలు, దానిని కైవసం చేసుకోవాలనే ఆశ, ఇతరుల మీద అధికారం చెలాయించాలనే కోరిక – మొదలైనవాటిని మనకు స్పష్టంగా తెలుపుతుంది.

ఈ నాటకంలో ఫౌస్ట్ అంత సుప్రసిద్ధమయిన వ్యక్తిగా చిత్రింపబడ్డా, ఆయన ఏకాకియే! నిరంతరాన్వేషకుడగు బాటసారి.

మానవుని కష్టసుఖాలు తనవిగా చూసుకొని – మోయటానికి సిద్ధంగా వున్నాడు ఫౌస్ట్. కాని ఎలాటి కష్టపరంపరలు అతనికి వచ్చాయో! ఆయన కోరిక బ్రహ్మాండమైనది. భూమిమీద అందుబాటులో ఉండే సాధనాలతో దానిని పొందలేక తికమక పడతాడు.

అలాటి వ్యక్తిని కలుసుకోటానికి దేవలోకాధిపతి సమ్మతం మీదనే మెఫిస్టోఫిలిస్ తారసిల్లుతాడు. 'స్వర్గలోక' రంగమే ఈ నాటకంలో అతనికి వున్న విశిష్టస్థానాన్ని యధాతథంగా నిర్ణయిస్తుంది. లయశక్తికి పూతనిచ్చే వామమార్గానికి చెందినవాడు మెఫిస్టోఫిలిస్. అంటే మంచితనాన్ని ఎంతో చులకనగా చూసే చీకటి మార్గమే – అతని నివాసభూమి. సృష్టినే ఎదిరించే శక్తి అతనిది. మూలశక్తినే ప్రతిఘటించగల వ్యక్తి ఈ మెఫిస్టోఫిలిస్ మానవుని జీవితం రాత్రింబగళ్ళకు మధ్య, చీకటి వెలుగుల మధ్య ఊగిసలాడుతూవుంటుంది. అలాటి జీవన శక్తులనే పటాపంచలు చేయటానికి అతడు ఎప్పుడూ తయారు. ఈ లోకాన్ని పాలించేది దేవలోక ప్రభువు అయినా, ఈ రాక్షస శక్తిని కూడా లోకానికి తప్పని సరి. ఫౌస్ట్ మార్గరెట్ పట్ల చేసిన అత్యాచారం, దాని ప్రేరేపణ మెఫిస్టోది గనక ఆ కన్యను సర్వనాశనం చేస్తుంది. అయినా ఆత్మ శుద్ధి, దేవతా కరుణాకటాక్షానికి దోహదాన్నిస్తూవుందన్న సంగతి విస్మరించకూడదు.

మానవుని సంకుచితస్థానాన్ని ఫౌస్ట్ అవగాహనం చేసుకోలేక పోతున్నాడు. భూతంతో కలిసి మెలిసి వుండవలసివచ్చిన ఈ మనిషికి సామాన్య జీవితంతో తృప్తిపడుతూవుండే యితర పాత్రలతో సరిపోల్చి చూస్తే ఎంతో తేడా కనబడుతూ వుంటుంది.

జీవితంలోని వివిధ మార్గాలను చిత్రవిచిత్రంగా ఈ నాటకం మనకు పరిచయం చేస్తుంది. సామాన్య వ్యక్తుల్లోనుంచి వచ్చినా మార్గరెట్ మాత్రం వేరు ఇతర యువతులను పోలినది అయినా మార్గరెట్‌కు లోతైన ఆధ్యాత్మిక దృష్టి వుంది ఫౌస్ట్‌ని గాఢంగా ప్రేమించినా ఆ ప్రేమకంటె దివ్యతరమగునది ప్రభువుపట్లగల ప్రేమ అని గుర్తించింది కారాగృహ రంగంలో భగవానుని తీర్పుకు తలవొగ్గుతూ ఫౌస్ట్ మెఫిస్టోలకి దూరమై పోతుంది అంటే మనుష్యులనుంచి వేరుపడి పోతున్నదన్న మాట తన ధార్మిక ధర్మము – అది ఎంత కష్టభూయిష్టమయినదో ఆమెకు స్పష్టంగా తెలుసు దానినే అనుసరించాలని నిశ్చయం చేసుకొంటుంది ఆధ్యాత్మికానికి అవినాభావ సంబంధం వుంటేనే గాని మానవుడు యిలా ఒక నిశ్చయానికిరాలేడు. అందుచేతనే నాటకం తుది రంగంలో మార్గరెట్ ఎలా మారిపోయిందో అర్థం చేసుకోవచ్చు

ప్రారంభంలో ఫౌస్ట్ తనముందు కనబడటంతో ఆయన ఎవరో మహనీయుడని అనుకుంటూ, ఆయన కేసి పూజ్యభావంతో చూస్తుంది మార్గరెట్. తుదిరంగంలో అలాటి పూజ్య భావంతో మార్గరెట్‌ని చూసేది ఫౌస్ట్ అంటే మార్గరెట్ తనకన్నా మహోన్నతమైనదని ఫౌస్ట్‌కి బాగ తెలుసునన్న మాట ప్రారంభంలో ఆమెకన్న తనకు దైవచింతన ఎక్కువగా వున్నదని అనుకుంటూ వుండేవాడు ఫౌస్ట్ ఇప్పటిదో తనకన్నా ఆమెకే ఎక్కువ తెలుసునని అర్థం చేసుకొన్నాడు అన్ని కోవలలో వారిద్దరికీ ఎంత బాంధవ్యం వున్నదన్న సంగతి మనం గుర్తించవచ్చు. ఒకరు పురుషుడు–మరొకరు స్త్రీ. ఒకరికి తాను విద్యావంతుడని తెలుసు ఒకరికి తానుయింకా అజ్ఞానినని భావన ఒకరికి తాను ఏకాకినని తెలుసు. మరొకరికి తను సంఘ కట్టుబాట్లకు బంధితురాలనని తెలుసు. ఒకరు యెంతో అనుభవశాలి రెండోవారు ఎంతో అమాయకులు. ఒకరు భూతానికి నేస్తమైతే, మరొకరు వినయసంపత్తికి చిహ్నం.

## ఆధునిక జర్మను సాహిత్యంలో

ఆధునిక విమర్శకులంటారు గోథేకు తన నాటకం ద్వారా ఏదేదో చెప్పి పాఠకులను ఒకమార్గాన నడపాలనే వుద్దేశం, ఆయనకు

లేదనీ, అయినా ఫౌస్ట్ పాత్ర ఎంతో విశిష్టమయిందనీ. ఆయన ఉదాత్తుడైన ఏకాకి 'అని పాఠకులకు సూచిస్తున్నాడని' ఈ విషయం ఆధునికవిమర్శకులు తప్పనిసరిగా ఒప్పుకొంటూనే వుంటారు. అలాటివారిలో కొంతమంది దృష్టిలో ఫౌస్ట్‌పాత్రలో అంత అశాంతీ తొందరతనం చూపెట్టడం ఆధునిక పాశ్చాత్యఖండవాసిలో వున్న జీవితాశయాలు, ముఖ్యంగా అలాటివాటిపట్ల ఎలా విముఖత్వం చూపబడుతూ వుంటుందో దానిని యావత్తూ చిత్రించాడని అంటారు. అందుచేతనే కాబోలు తత్త్వవేత్తలకు 'ఫౌస్ట్' అంటే అంతఇష్టము. జర్మన్ సంస్కృతిలో ప్రత్యేకతను సమర్థిస్తూవున్న 'ఆస్‌వాల్డు స్పెన్‌గ్లర్' అనేది ఆధునిక పాశ్చాత్యతత్త్వంలో ఫౌస్ట్ ఎంతో చిత్రంగా ప్రతిఫలిస్తూ వున్నాడని, అమెరికన్ సుప్రసిద్ధ తత్త్వవేత్త జార్జి సాంతాయన తన "మూడు తాత్విక గేయకావ్యాలు" అనేగ్రంథంలో గోథె సృష్టించిన ఫౌస్ట్‌ని విమర్శిస్తూ, లూక్రెటియస్ ప్రాచీన సంస్కృతి వెలిబుస్తూవున్నట్లు, డాంటేరచనమధ్యయుగాల నాటి జీవిత తత్త్వం సూచిస్తున్నట్లూ, ఫౌస్ట్ ఆధునిక సంస్కృతీ విసులను మనకు స్పష్టంగా పరిచయం చేసే మహాకావ్యమని అన్నాడు

అటు ఈ కావ్యంలోని ఆధ్యాత్మిక తత్త్వం తత్త్వవేత్తలను ఆకర్షించినట్లే, నాటకంలో సృష్టించిన రంగాలు కళాకారులను ఎంతో దగ్గరకు తీసుకొని, నాటకానికి కావలసిన చిత్రాలను చిత్రించడానికి వారికి అపరిమితమైన ప్రోత్సాహాన్ని కలుగచేశాయి. ఈ సందర్భంలో ప్రత్యేకంగా పేర్కొనవలసిన ఫ్రెంచి చిత్రకారుడు 'యుగోన్ డెలక్రాస్' తయారుచేసిన చిత్రాలు ఫ్రెంచి సంగీతవిద్వాంసుడు చార్లెస్ గూనో మార్గరెట్‌కి ఫౌస్ట్ గాథలో ప్రధానస్థానమిస్తూ 'మార్గరెటా' అనే పేరుతో సృష్టించాడు ఒక సంగీతనాటకం. ఫౌస్ట్ కథాశిల్పాన్నే వుపయోగిస్తూ మరి కొంతమంది ఫ్రెంచి రచయితలు తమ రచనలను కొనసాగించారు ఫ్రెంచికవి పాల్ వెలెర్, ఫౌస్ట్‌ను ఆధునికయుగంలో పుట్టి పెరిగిన మనిషిగా మార్చివేశాడు. ఈ ఆధునికకాలం ఫౌస్ట్ తనకున్న ఆధ్యాత్మిక సాధనలో తృప్తిపడుతూ, భూతాన్నే తన చెప్పుచేతల్లో వుంచుకోగలిగాడు. రష్యనుకవి అనటోలి టూనాటోష్కర్స్కి, ఫౌస్ట్ రెండోభాగంలోని కథాభాగాన్ని వుపయోగిస్తూ 'ఫౌస్ట్‌వున్న పట్టణము'

అను పేరుతో ఒక నాటకాన్ని రచించాడు. సముద్రజల పరిసరాలను సస్యశ్యామలమైన భూమిగా మార్చివేయడానికి ఫౌస్ట్ తలపెట్టిన ప్రణాళిక ముఖ్యంగా ఫౌస్ట్ పాటకజనంతో కలిసిమెలిసి వుండటం, సాంఘిక పద్ధతులను సమర్థిస్తూ వున్నదనే అనవచ్చు అని ఈయన భావము. థామస్ మాన్ వ్రాసిన 'డాక్టర్ ఫౌస్టస్' అనేనవల ఆధునికి గాయకుని జీవితం చిత్రిస్తూవుంది. ఆ గాయకుడు తన విద్యను కైవసం చేసుకోవాలని ఎంతో సాధన చేస్తూవుంటాడు. జబ్బు పడతాడు. అప్పుడే మానవాతీతమైన శక్తికి తలవొగ్గాలని వస్తుంది అదే అతనిని భూతశక్తికి దాసానుదాసుణ్ణి చేస్తుంది. దీనిమూలాన దరీదాపూ ఏమీ తెలియక వుక్కిరిబిక్కిరై పోవలసివస్తుంది - ఈ మహాపండితుడు, గాయకుడు డాక్టర్ ఫౌస్ట్. ఇలా అనేకులు ఫౌస్ట్‌కి తమ నివాళులు అర్పించారు

---

# అంకితం

వివిధ రూపాలలో వివిధానేక వదనాలలో జీవన వసంతంలో, నాచుట్టూ తిరిగిన మధురమూర్తులు, నన్ను వేదనా సముద్రములో ముంచివేయ జూస్తున్నారు. కాల దేవత సన్నింకా ఆ జ్ఞాపకాల బరువు నుంచి వదిలించడం లేదు. ఆ కనిపించని ఆకారాలు మీద మీద వచ్చి, తమ శక్తిని నాపై ప్రయోగిస్తూ తమ స్వస్థానాలు ఆక్రమించి, పొగమంచు చాటున వున్న అదృశ్యశక్తుల వలె నేను చేయవలసిన పనులు నిర్దేశిస్తున్నవి. దీన హృదయం ద్రవీభూతమై గాఢనిద్రనుంచి మేల్కొని నట్లు చైతన్య స్రవంతిని తాకుతున్నది.

అదృశ్యమూర్తులారా! మీరు మంత్రించిన మెరుపు తునక నన్ను ముందుకు నడుపుతున్నది. స్మృతి కన్యలారా, మీ నీడల చాటున కాలము ఎంతో సంతోష ప్రదంగా గడిచిపోయింది. హృదయ మంతా మధురసమయమై పోయిందే! ఏదో ప్రాకృత గ్రంథంలోని ప్రతిధ్వనివలె ప్రథమ ప్రేమా, ఆ నాటిస్నేహకాంతీ, నా కనుల ముందు నాట్యమాడుతున్నవి. గతించిన శోక జలధి తిరిగి ఆక్రోశిస్తున్నది. మానిపోయినవనుకున్న గాయాలు తిరిగీ బాధిస్తున్నవి. జీవిత సంధ్యారాగం కడపటి వెలుగులను చిమ్ము

తున్నది. అదృష్ట దేవతవల్ల మోసగింపబడ్డ హితులూ, ప్రేమకూ వెలుగుకూ దూరమై భంగపడిన మిత్రులూ, ఆ సంధ్యారాగములో మసక మసకగా కనిపిస్తున్నారు.

ఎంతో కాలాతీతంగా పలికిస్తున్న ఈ రాగధ్వనులు వారి చెవిచెంతకు పోవు, వారికి వినిపించవు. ప్రేమ ప్రపూర్ణమైన ఆ బాంధవ్యలత వాడిపోయినది. ఈ వేదనా పూరిత గాథను నా సన్నిహిత బృందమే గాక, అపరిచితులుకూడా వినవలెనని విధినిర్ణయమై వుండవచ్చు. అపరిచితుల మెప్పుల వలెనె వారి హర్ష ధ్వనులు కూడా నన్ను కొంచెం కలవర పెడుతున్నవి. నా పాటల పల్లవిలోని మాధుర్యాన్ని గానరస వాహినిలోని మకరంద బిందువులను, ప్రపంచంలో చల్లు తాను. అవి, నా ఆప్తులు వినలేక పోయారనే బాధ నా కెప్పటికీ ఉంటుంది.

మడతల అడుగున మూతపడిన జ్ఞాపకమూ, ఇన్నాళ్ళ బట్టి దూరమైన స్వప్నమూ నేడు సన్నిహిత మవుతున్నవి. నా కంఠ నాళంలోకి మాటలు వణుకుతూ వస్తున్నవి. మరిచిపోయిన పాటను కంఠం తిరిగి పలక బోతున్నది. వీణా తంత్రులపై మెల్లనవీచే చిరుగాలివలె, నా కఠిన హృదయం మెత్తబడి, అహంభావం సన్నగిలు తున్నది. ఒళ్ళు జలదరించి, కన్నీరు నిలిచిపోయినట్లు వు తున్నది 'నాది' అనుకున్నదంతా నాకు దూరంగా ఉంది. వేగుచుక్క రాలిపోయింది. నేను పోగొట్టుకొన్నది శూన్యమా? కాదు, సర్వస్వం!

# నాందీ ప్రస్తావన

(ప్రవేశము దర్శకుడు, కవి, హాస్యగాడు)

దర్శకుడు

బాబూ! మీరిద్దరూ నాతో చాలాకాలము నుంచీ ప్రయాణం చేస్తున్నారు. అనేక తుపానులలో నన్ను ఒడ్డెక్కించారు నేటి రంగస్థలానికి ఏలాటి ప్రదర్శన కావాలె? ఎటువంటిది జయప్రదమవుతుంది? నా దృష్టిలో జనరంజకతగలదే ఉత్తమ ప్రదర్శన. వాళ్లూ సుఖంగా వుండాలె, మనమూ సుఖంగా వుండాలె. పందిలి వేశాం. ప్రజలను కూచోబెట్టాము. వారు మనం చూపే ప్రదర్శన ఎంతో శ్రద్ధగా పరికిస్తారు వీరికెప్పుడూ సరి కొత్తది కావాలె. అది మళ్ళీ సెభాసనిపించేదిగా వుండాలె. మనలో మనం ఎలా తిప్పలుపడ్డా, అది మహాగొప్పది సుమా అనే భావం వారికి కలిగించాలె. మన ప్రేక్షకుల సంగతి నాకు బాగా తెలుసు. వాళ్ళకేది నచ్చుతుందో ముఖాలను బట్టి చూచి చెప్పగలను. ఒకటోరకం నాటకం ప్రదర్శించామనుకోండి, అది విద్యావంతులకే నచ్చుతుంది, సామాన్యులు పెదవి విరుస్తారు. అందుచేత విద్యావంతులను ఒక్కరినే తృప్తిపరచడంకాదు మన లక్ష్యం! నన్నడిగితే గొప్ప నాటకమెప్పుడూ ఎక్కువమంది చూచేదే

ప్రేక్షక సంఖ్యనుబట్టిగాక గొప్పతనాన్ని ఎలా కొలవగలం? గుంపులు గుంపులుగా, కెరటంమీద కెరటం వచ్చిపడ్డట్టు సాయంత్రం నాలుగు గంటలనుంచీ ప్రజలు టిక్కెట్లకోసం కొట్టుకోవాలె. ఒకరి నొకరు తోసుకొంటూ, 'ఒక్క టిక్కెట్టు, ఒక్క టిక్కెట్టు' అంటూ అన్నార్తులవలె ప్రజలు ఎంత హైరానపడితే ప్రదర్శన అంత చక్కగా రాణించినట్లు. అటువంటి ఆశాజనితపరిస్థితి సృష్టించి ప్రేక్షక హృదయాలను ఒక పూలతావిగా చేయగల సమర్థుడు కవి తప్ప ఇంకెవరుగలరు కవిపుంగవా!

కవి

జనసందోహం సంగతి నాకు చెప్పకు. ఆ మూర్ఖ చిత్తుల ముఖాలు చూస్తేనే, నాలోగల కవితాధార ఇంకి పోతుంది. వారి అసభ్య వినోద విలాసాలనుంచి నన్ను కాపాడండి. లేకపోతే నేను మీకు కాకుండాపోతాను. పుష్పలతాగుచ్ఛాలు, నిశ్శబ్దగానమంజులరవాలు, ప్రేమ గర్భిత స్నేహాలు కవి హృదయానికి జీవమిచ్చి అతనిని దేవతా పీఠంమీద కూచోపెడుతున్నవి. ఔన్నత్యము నిచ్చేవి ఏవైనా వుంటే చెప్పు. అవి కవి హృదయాన్ని కదుపు తాయి, కాని, సామాన్యజనుల పెదవులమీద ఆడే ఉల్లాస వాక్యాలు కవితాఝరిలో కొట్టిపడవలవంటివి. ఒకటి రెండు ప్రదేశాలు కవితా గానాన్ని అంకురింపచేయవు. ఎన్నో సంవత్సరాల మిలనంలో గాని గాథాను రక్తి కళగా మారుతూ విశిష్టతను పొందదు. రూపలావణ్యం

ప్రధానంగాగల కవిత్వం ప్రాతఃకాలపు మంచు ముత్యం లాగా జలజలా మెరిసి ఆరిపోతుంది. సత్యాన్వేషణ ప్రధానంగాగల కవిత్వం మాత్రం ముందుతరాలవారికి మార్గ జ్యోతియై నిలుస్తుంది

హాస్యగాడు

ఈ రోజులలో ప్రతివానికీ ముందుతరాల గొడవ ఒకటి! మనను గురించి మనం మాట్లాడుకోక ముందుతరాల గొడవ ఎందుకు అంటాను? మనకు సంతోష ప్రదంగా ఉండేవి ఆలోచించండి నాయనా! అది చాలు నేనెప్పుడూ వర్తమాన కాలంలోనే జీవిస్తాను. అదే హాయి నా ప్రాణానికి. యువకులు కులాసాగా కాలం గడుపుతున్నారని ఏడవడ మెందుకు? అది వారి వయో ధర్మం. పెడదారిని అధికారాలు సంపాదించి తాము నిజంగా గొప్పవారమనుకొంటున్నారు పెద్దలు అసలీ ప్రజా శాహుళ్యపు ఉద్రేకాలతో ఆటలాడేవారు తాము పల్టీ కొట్టినప్పుడు నాపోయి లాభం లేదు. పల్టీలు కొట్టడం ప్రజానాయకుల ధర్మం. అందుచేత మహాశయులారా, మనసు గుఱ్ఱము వంటిది, దానిని విచ్చలవిడిగా పరుగెత్తించనీయకండి. అశ్వరాజానికి ఖరీదైన జీనుతోపాటు కొంచెం వివేక సంపదకూడా పొందుపరచండి. పాను భూతితోనూ, దయాంతఃకరణాలతోనూ జీవించడం నేర్చుకోలేకపోతే, కొంచెం వేళాకోళం చెయ్యడమూ సరసోక్తు లాడడమూ, ఫేమను కాదనుకుంటే, నవ్వు పువ్వులూ

మాయమై......మిగతా మాటలు మీరు పూర్తిచేసుకో వచ్చు.

దర్శకుడు

అదంతా ఎలా వున్నా నాటకములో యాక్షను, అనగా అభినయం బ్రహ్మాండంగా ఉండాలె. ప్రేక్షకుల కనులముందే రసమయ సంఘటన లనేకం సాక్షాత్కరించాలె. వారు కళ్లార్పకుండా రంగస్థలంపై పే చూస్తుండాలె. వారి ఆశ్చర్య విభ్రమాలను బట్టే మన ప్రతిఫలము. తళుకు బెళుకులతో ప్రజా హృదయాన్ని దోచుకోవాలె. ప్రతి ఒక్కరికీ అతనికి నచ్చింది కొంత అందివ్వాలె. ప్రేక్షకుల కరతాళ ధ్వనులు మిన్నుముట్టడాన్నిబట్టే ప్రదర్శన విజయమూ, భవిష్యత్తూ తేలిపోతుంది. సామాన్యుల కర్థమయ్యే మాటలూ, ఛలోక్తులూ, హాస్యం, కరుణ, విషాదాలు మీరు ఎన్నయినా అందులో ప్రవేశ పెట్టండి. ఒకే నాటకంలో పన్నెండు అంతర్నాటకాలు వుంచండి – ఫరవా లేదు. అది ప్రజారంజకతను పొందినదా దానికింక తిరుగులేదు. కావ్యలక్షణములు గల నాటకములు మీరు యెంత గొప్పగా తయారు చేసినాసరే, అది ప్రజాదరణ పొందలేక పోయిందా అంతా నిష్ప్రయోజనం.

కవి

ఆ ప్రకారం తయారైన రచన, దృశ్యకావ్య మనిపించుకొంటుందా? దానిలో కళాశిల్పం వుంటుందా? నీ పలుకులు కళోపాసకుని చెవికి ములుకులు. ఆ కర్ణకఠోర వాక్కులను నేను వినలేను. ప్రజలు హర్షధ్వానాలు చేసి

నంతమాత్రాన నాటకం గొప్పదీ, ఉదాత్తమైనదీ అవుతుందా ఎంత వెర్రివాడవో!

దర్శకుడు

అబ్బే ఈ కవి శాపాలకూ, స్వప్నాలకూ నేను బెదరను. ప్రజలు నీ దృష్టిలో వెంగళప్పలు కావచ్చు. కాని అడవిలో మ్రాను ఎంతచిత్రిక పట్టితే కుర్చీలూ, బల్లలూ అవుతున్నవి? నీవు రచించే నాటకం ఎవరికనోయ్ కవిరాజ్! మన నాటకం చూడడానికి వచ్చేవారి విషయం ఆలోచించు. కాలక్షేపం కోసం కొందరూ, వేషాలు చూద్దామని కొందరూ, ఇదేమిటో అను ఆసక్తిని కొందరూ, కడుపునిండా తిన్నతర్వాత విశ్రాంతికని కొందరూ, పత్రికావిమర్శలు నమ్మి కొందరూ, ఈ ప్రకారం వస్తారు. ఈ ప్రేక్షకబృందంలో మనకు ఎక్కువ మేలు చేసేది ఎవరంటే, రంగు రంగులగౌనులతో, నూతనాలంకారములతో వచ్చే వనితాశిరోమణులు. మనకు పైసా ఖర్చు లేకుండా ప్రదర్శనకు నిండుతనమిచ్చేది ఆ అంగనామణులే! నీ కవితా శిఖరాలవిషయమైకలలు కంటావా, లేక ఈ ప్రదర్శన మనుష్యులతో కిటకిట లాడాలని కోరుకొంటావా? ఇక మనపోషకుల విషయమంటావా? అందులో ఒకాయనకు కుడిఎడమ లే తెలియవు. మరొకతను ఏదిచెప్పినా తల వూపుతాడు. ఇంకొకాయన ఈ నాటకం ఎప్పుడైపోతుందా ఎంత త్వరగా క్లబ్బుకు పోయి చీట్లాట ఆడుకోవచ్చా అనుకొంటాడు. మరొక మహానుభావుడు ఈ బెడద తీరిన వెనుక ఏ వేశ్య

ఇంటికి వెళ్ళడమా అని నాటకం జరుగుతూన్నంత సేపూ ఆలోచిస్తూంటాడు. వీరిలో ఎవరిని మెప్పించాలో ఆలోచించు? నీ కవితా సౌరభం, పాండితీప్రకర్ష వారికి కావాలా? అందుచేత నేను చెప్పదలచుకొన్నదేమంటే, నీవు ప్రజల కోసమే ప్రజలను ఒళ్ళు మరిపించే విధంగానే వ్రాయి. అయినా వారిని తృప్తిపరచడం బ్రహ్మాంతరం కూడా కాదు కాబట్టి వారిని మరపించి ఊరుకోపెట్టడమే మనం చేయగల కార్యం. ఏం, నా మాటలు బాధ కలిగిస్తున్నాయా?

కవి

దర్శకమహాప్రభూ! తమరు మరొక నౌకరును వెతుక్కో కూడదూ? సత్కవి ఎవరైనా తన ఆత్మను అమ్ముకోగా విన్నావూ? మహిమాన్వితమగు శుభసంపదను ప్రజల క్షుద్రవినోదానికి, మలినపరచమంటావా? ఆ మాలిన్యం ఇక పోతుందా? సత్కవి ఎప్పుడూ తన హృదయధర్మమాదేశించినట్లు వ్రాస్తాడు. ఈ పంచభూతాలనూ శాసించే కవితాశాసనమది. హృదయగోపురంలో మ్రోగే గుడిగంటలే శంఖారావాలై అతని కంఠమునుండి వెలువడుతవి. తనను మరపించే ఈ ప్రపంచంతో అతను అనుక్షణమూ సామరస్యం ఏర్పరచుకొంటూ, ప్రకృతిమాత ధరించిన బంగారు వలువల దివ్యకాంతికి ముగ్ధుడై దివ్యప్రాసాదిత ప్రియుడైన అదృశ్యరాగబంధంతో క్రమత్వం లేక పడివుండే శబ్దజాలాన్ని, భావ సముదాయాన్ని, ఘటనా ఘటన చక్రాన్ని లయబద్ధం చేసి వాటికి కళారూపం కలిగిస్తాడు

పరస్పరసంబంధం లేని వేరువేరు ధ్వనులు, భారంగా చెవిని తాకుతున్నప్పుడు, ఆ కనుపించని మెరుపుతీగతో పువ్వుల మాలగా కట్టి, శబ్ద సౌందర్యములో నుంచి గానామృతమును పిదుకుతాడు. గతమనగా ఏమిటి? విశ్వవిపంచి స్మృతిలోని మచ్చుతునక గదా! అనురక్త అనే అశ్వంమీద ఆకాశ పథాన విహరించే కవి, సాయం సంధ్యలోగల రాగరంజిత శోభనూ, వసంతకాలంనాటి పూవులసోయగాన్ని, తన కంఠంలో పలికిస్తూ, తన నెచ్చెలి ఇడిచే పూలబాటలకు, ఇరు పక్కలా వాటిని సవరిస్తాడు. అటువంటి ఆదరానుభూతి భూమిక చేరువగా కవీశ్వరులు తప్ప మరెవరు తేగలరు? మానవునిలో గల మహోన్నతశక్తి కవి హృదయంలో నిద్రాణమై వున్నది,

హాస్యగాడు

ఓహో - హో! ఇప్పుడు కాగల కార్యం మరచిపోయి రసాస్వాదనలో పడ్డట్టున్నారే కవిరాట్టులు! కవితాలంబనకై ఎంతటి ఉదాత్తమైనదైనా సృష్టించుకో మహానియా - మాకు అభ్యంతరం లేదు మాకు కావలసింది ప్రదర్శన చక్కగా నడవడం. ఒక ప్రేమ కావ్యం సృష్టించుకో, మేము వద్దనము. ఆ ప్రేమికులతో నీవు అష్ట కష్టాలుపడి వాళ్ళతో ఆనందించు, శోకపడు, మేము వద్దనము. కవులతో వచ్చిన గొడవ యేమిటింటే ముందు గాలిలోకి ఎగిరి పోతారు. ఆ పైన దారి కనబడటం లేదంటారు. గాలిలో ఎగిరేవాళ్ళు నేలపై

బడటం న్యాయమేకదా! ఏమంటారు? చూడు కవిశేఖరా! నీ ప్రణయ కావ్యంలో కొంచెం ఘాటయిన ప్రేమనే రంగరించు. లేకపోతే నాటకం రక్తి కట్టదు. జీవితపు బావిలో జాగ్రత్తగా దిగి, మానవత అనే మునిగిపోయిన బక్కెటు బయటకు తీసుకొనిరా. నాటకంలోని ముఖ్యులు మాకు అర్థమయ్యేవారై వుండాలె. ప్రేమ అందరిలోవుండే జబ్బే కనక ఎవరూ కాదనరు. అందుచేత దాని చుట్టూ ఒక గోడ పెట్టుకొంటూ, రా. నీవు సమర్పించే ఇతివృత్తంలో కొన్ని ఆకస్మిక సంఘటనలుండాలి. అవి సందర్భశూన్యంగా వున్నా ఏమీ భయంలేదు చివరకు చూచుకో వచ్చు. ఆ మాటకు వస్తే కొన్ని అసందర్భంగానే ఉండాలె నేమో కూడా పాత్రలచేత కొన్ని తప్పులు చేయించి, నిజమేమిటో దానిని లీలగా కనిపింప చేస్తూ, గుప్పిట్లో పెట్టుకొని దాచు. ఆ రకంగా ఉంటే ప్రజలకు తెరిపిగా ఉంటుంది. నేను చెపుతున్నాగా, నమ్ము. అసలు పదార్థమింతే! దీని ప్రతిరూపమే రంగస్థలంమీద కావాలె ఈ ప్రజకు. నాటకం తొందర తొందరగా పరుగెత్తాలె. నడుస్తే ఒప్పుకోరు. కథానాయకుడు ఆదర్శాల పోగు. అందుకు తోడు వివేకవంతుడై కూడా ఉండాలె. అతని హృదయం చంద్రకిరణం, వెన్న ముద్దాకూడా! నాటకం సుఖాంతమా విషాదాంతమా అనేది వీలునుబట్టి చూచుకోవచ్చు. ప్రజలు ఈ నాటకాన్ని చూచి కమనీయానుభూతి పొందుతూ రసవాహినిలో మునిగి తేలాలె. కొందరు ముత్యాలూ పగడాలూ వెతికే వారైతే, మరికొందరు ఈతలు కొట్టేవారు. అందరూ

మనకు కావలసినవారే. నీ నాటకాన్ని మెచ్చుకొనే ప్రతి ఒక్కరూ నీవు చూపే ప్రజ్ఞావిశేషంవల్లగాక, వారి మనసులో ఏమున్నదో దానినిబట్టి మెచ్చుకొంటారు. ఈ పరమ సత్యం మరచిపోకు. యువతీ యువకులకు, చమత్కార భాషణలు, కన్నీరు తెప్పించే ప్రేమ వచనాలు కావాలె. ఎవరిమనసులతో వారు వచ్చారిక్కడికి. నీవు చేయవలసిన దల్లా నాగస్వరం వాయించి వారిమెప్పు పొందడమే! మెత్తని మనసులు నీకు జోహార్లు అర్పిస్తాయి. పరిణతిపొందని హృదయాలు నీ ప్రజ్ఞకు నిన్ను అభినందిస్తవి.

కవి

అయితే సుందర స్వప్నాలతో నిండిన వెనుకటి రోజులు మళ్ళీ నాకివ్వండి అప్పటి నా ప్రపంచం నిండా వసంతశోభలే! పాటలు నానోట నదీతరంగాలవలె ఉయ్యాల లూగేవి, భావాలు తుమ్మెదలవలె ఝుంకారం చేసేవి. మంచుపొగలతో నిండిన ప్రపంచం నా కనులముందు సాక్షాత్కరించేది ప్రతి పుష్పబాలహృదయంలోని మాధుర్యమూ, ప్రతికొండకోనలోని అగాధపాతమూ నన్ను తమ వైపుకి లాక్కొనేవి. వికసించిన ప్రతీ పువ్వుతోనూ కలపి పాటలు పాడేది ఈ బేల హృదయం. నాకు ధనధాన్యాలు, సిరిసంపదలూ లేవు. కాని నేను పేదవానిని మాత్రం కాను. సాహిత్యాన్వేషణ, కల్పనాచాతుర్యం గల వ్యక్తికి బీదతన మంటూ ఎక్కడ ఉంటుంది? హృదయాన్ని కేరింతలు కొట్టించే మధుమాసదినాలు మళ్ళీ రాకూడదా? ఎంతటి

తీవ్రతర బాధలోనూ ఏదో అదృశ్య హస్తం నాకు ఉపశమన కలిగించేది. గడచిపోయిన వసంతోదయ స్మృతులతో బరువెక్కిన, ఆ పరిమళ బాహువల్లరినుంచి తప్పించుకోలేకుండా వున్నాను.

హాస్యగాడు

మిత్రమా! గడచిపోయిన యౌవనం కావాలా? పోరాటంలో నీవు పిరికిపందవైనప్పుడూ, నీ భుజముమీద వాలిన విలాసిని మనసు మరొక అందగాడు ఆకర్షించినప్పుడూ, నీ వసంతఋతువు నీకు గుర్తుకు వస్తున్నది కాబోలు! యౌవనకాలంలోనే నీ లక్ష్యాలనూ, నీ పూలమాలలనూ, నీ గమ్యాన్నీ గుర్తుంచుకోవాలె. జీవన్నాటకంలో అంకాలప్రకారం తెరలు పడుతూ లేస్తూ వుంటవి. కొంచెం నేర్పరితనంతో, కొంచెం హృదయ సౌకుమార్యంతో, నీ వనుకొన్న లక్ష్యం, నీ యిచ్చవచ్చిన రీతిని చేరేటందుకు ప్రయత్నించు, కవీశ్వరా! దానినే అనుభవమన్నారు. కవిగారూ, వెనుకటిరోజులు తలుచుకొని విచారించడం భావ్యం కాదు. నేను హాస్యగాణ్ణి మాత్రమే. విజ్ఞులకు చెప్పదగినంతవాణ్ణి కాదు. కాని ఒకక్కముక్క చెప్పాలనిపిస్తున్నది వయస్సు మళ్ళినవారు బాలకులతో సమానమంటారు. కాని పెద్దవాళ్ళు ఎంత బాల్యస్థితిలో ఉండేదీ, చూడగా చూడగా తెలుస్తున్నది.

దర్శకుడు

ఇక చాలు బాబూ, ఈ మాటలు కట్టిపెట్టండి. మాటలు పనులకెప్పుడూ అవరోధంగా నిలుస్తాయి. ఇప్పుడు గడచిన సంభాషణలో పనికివచ్చేదేమైనా వున్నదా? మనః

ప్రపంచం, అదృశ్యశక్తుల ప్రభావం, ఇలాటివన్నీ ఎందుకు? కవి అనగా కవిత్వం వ్రాయగలిగేవాడు. ఏమంటారు?

మాకేమి కావలెనో మీకు తెలుసు. మాకొక శ్రేష్టమైన మధుపానీయం కావాలె. అది రుచికరంగా సుగంధభరితంగా వుండాలె. ఏలా తయారుచేయడమనేది మీ భారం. మాటలు కట్టిపెట్టి కార్యనిర్వహణకు వుపక్రమించండి. రేపటికి వాయిదావేస్తే అవి ఎప్పటికీ తెమలవు ఏనాటి పని ఆ రోజే పూర్తిచేయాలె మాకు కావలసినది రసవత్తర నాటకం. తయారుచేయవలసిన బాధ్యత మీది ఉపకరించే దృశ్యాలన్నీ అందులో ఉంచండి. మన శ్రమను బట్టి ఫలితం దక్కుతుంది. ఆ నాటకంలో సూర్యచంద్రులనూ, నక్షత్రాలనూ, కొండకోనలనూ, ఉద్యానవనాలనూ మీ యిష్టం వచ్చినట్లు ఇమిడ్చిపెట్టండి. నాకు అభ్యంతరము లేదు. కావలసిన రంగప్రసాదనమంతా మనదగ్గర వున్నది. జలపాతాలూ, పర్వతశిఖరాలూ, నక్షత్రరాసులూ, పెద్దపులులూ, సింహాలూ, పక్షులూ, ఎటువంటి దృశ్యాలు కావాలంటే అవన్నీ సమకూర్చేందుకు నేను ఇక్కడ ఉన్నాను.

మన రంగస్థలం చిన్నదే కావచ్చు. మన అవకాశాలు స్వల్పమే కావచ్చు సృష్టికి ప్రతిసృష్టిగా మన ఈ రంగస్థలంమీద స్వర్గనరకాలూ, జరామరణాలూ. ఆనంద విషాదగీతికలూ, సుళ్ళు తిరుగుతూ అతివేగంగా పరుగెత్తే ఒక జగన్నాటకం ప్రదర్శించాలె మనం.

# దేవలోకంలో

(ప్రభువూ, ప్రధాన దేవదూతలైన రఫాయేల్, గేబ్రియేల్, మైకేల్ ప్రవేశము. మెఫిస్టోఫిలిస్ కూడా ప్రవేశము)

రఫాయేల్

వేగుచుక్క సంగీతాన్ని వినిపింపచేస్తున్నది. కాంతి ప్రసారంవల్లనే మావంటి దేవదూతలకు శక్తి సామర్థ్యములు కలుగుతున్నవి. సృష్టి ప్రారంభంనుంచీ భగవానుని మహత్తరకాంతిలో సృష్టి చాతుర్యమంతా అనంతమై అపూర్వమైన విస్మయానందం కలిగిస్తున్నది.

గేబ్రియేల్

రాత్రింబవళ్ళను సృష్టించుకొంటూ అమిత వేగంతో ప్రయాణించే ఈ పృథివీమండలంలోని సముద్ర కెరటాల నురుగు, పర్వతశిఖరాలకు ప్రణమిల్లుతూ, ఆ కాంతి వెల్లువల రహస్యాన్ని తెలుపుతున్నది ఎటు చూచినా ఆ తేజోరూపుని దివ్యనామ సంకీర్తనమే!

మైకేల్

సముద్రగర్భాన్ని కలియబెట్టి ఆ భీభత్సాన్ని నేలపైకి తరిమే తుఫాను తాండవం, ఉరుములూ, మెరుపులూ, ఇవంతా సృష్టిచైతన్యంలోని అంశ విభాగం

ఈ భూమి, నిరంతరం మార్పులకు లోనవుతూనే ఉంటుంది. దేవా, నీవునడిపే ఈ జగన్నాటకంలో పరిచారకుల మైన మేము నీ ప్రభంజనలీల ఆశ్చర్యకరంగా చూస్తూ, నీ శక్తి స్వరూపానికి జోహారు లర్పిస్తూవుంటాము.

ముగ్గురు దేవతలూ (ఏకకంఠంతో) - దేవా నీకరుణా కాంతులు మాకు దివ్యశక్తిని ప్రసాదిస్తున్నవి. నీ విరాట్ రూపదర్శనం మా సుకృతంవల్ల లభిస్తున్నది. నీ సౌందర్య శోభలు మమ్ము శతవిధాల కటాక్షిస్తున్నవి.

మెఫిస్టోఫిలిస్

(కొంచెం తొందరపాటుతో) - లోక ప్రభూ, తమ సృష్టిలీల ఘనంగా సాగుతూనే వుండివుండవచ్చు. కాని నేను భట్రాజు పొగడ్తలతో ప్రశంసించలేను. అసలు ఆ దేవదూతల పొగడ్తలంటే నాకు మహా తలనొప్పి. వారి స్తుతివాక్యాలు వినివిని తమరు ఇలా అయిపోయినారు. నేను వారివలె హారతులీయలేను విశ్వగానాలు, సూర్య కాంతులూ మెచ్చుకోవడం, మన పనికాదు. స్వకీయ ప్రపంచ మెప్పుడూ మానవజాతికి పరిమితమైనది. అమర గానం నరుని చెవికి వినబడదు, నీ సృష్టికాంతి అతనికళ్ళకు కనబడదు. అతని ఆత్మలో ఏదో వెలుగు కిరణం దాచా నంటావు ఈ మహాసృష్టిలో ఎన్నిమార్పులు జరుగుతున్నా ఆ మానవుడుమట్టుకు ప్రారంభదినాలలో ఎట్లు వున్నాడో అదే స్థితిలో ఉండిపోయినాడు. నీవు సమర్పించిన ఆ కిరణం చిన్నదైనందునేమో అతనిని బాగుచేయలేకుండా ఉంది.

జంతువులకన్నా అధ్వాన్న గతిలో పడిపోతున్నాడు, పాపం! రెక్క లల్లార్చుకొంటూ చెత్తలో పొర్లాడే పురుగులకూ నరులకూ తేడా కనబడడం లేదు. మట్టిలో దొర్లుతూ అతను అలా నాశనమయి పోవలసిందేనా?

ప్రభువు

నీ ఫిర్యాదు ముగిసినట్లేనా? చాడీలు చెప్పడానికే కదా నీవు యిక్కడికి వచ్చేది సువిశాలభూమండలం మీద నీ కిసుమంతయినా సుగుణం కనబడ లేదా?

మెఫిస్టోఫిలిస్

ప్రభూ, కాగడా వేసి వెతికినా కనబడడం లేదు. దుర్భరమైన రోజులు వెళ్ళబుచ్చుతున్న మానవాళి వద్దకు వెళ్ళి వారిని బాధించడం నాకే తలవంపులుగా ఉంటుంది. నా పని నన్ను చాలా విసిగిస్తున్నది.

ప్రభువు

ఫౌస్ట్ అనే పేరు ఎప్పుడైనా విన్నావా?

మెఫిస్టోఫిలిస్

వినకపోవడమేమిటి! ఆ పుస్తకాలపురుగేనా మీరనేది?

ప్రభువు

అతడు నా భక్తుడు.

మెఫిస్టోఫిలిస్

ఆహా! తమ భక్తులందరూ అలాటివాళ్ళే. ఇతనిదో కొత్తదారి. సామాన్యులు ఆశించే భోగభాగ్యాలు వద్దు

న్నాడు. అతని అధ్యాస ఎప్పటికీ అందని నక్షత్రాల మీద. ఇటు భూలోక సౌందర్యాలూ, అటు అమరలోకపు ఆనందాలూ రెండూ, చెరో గుప్పిటలోను ఇరికించుకోవాలని ఆ వెఱ్ఱివాడి ఆశ. ఇటు ఇవీ అందవు అటు అవీ అందవు. చివరకు నీ భక్తులకు ఇంతకంటే మరేంచూపగలవు నీవు?

ప్రభువు

(చిరునవ్వుతో) ఫౌస్ట్ ప్రస్తుతం సందిగ్ధావస్థలో ఉన్నాడు. అతని అన్వేషణా క్రమంలో ఇది ఒక మెట్టు. ఆ మెట్టునుంచి మరో మెట్టు చేరుకొంటాడు. తర్వాత మెట్టు కనపడగల శక్తి అతనికి నేను ప్రసాదిస్తాను. తోటమాలికి, తన తోటలో ఉన్న ఫల పుష్పాలను గురించి, ఆయా మొక్కల పోషణను గురించీ బయట వాళ్ళు వచ్చి చెప్పాలా? కాలస్వభావాన్ని బట్టి, ఆయా ఋతువులనుబట్టి, అతనే తెలుసుకోగలుగుతాడు.

మెఫిస్టోఫిలిస్

అయితే పందెం కడదామా? తెలుసుకోలేడని నేను, తెలుసుకుంటాడని మీరు. ఈ విషయంలో మీరు, మీకు మీరుగా కలుగజేసుకోకుండా ఉంటే, నా అభిప్రాయం నిజమైనదన్న విషయం మీకు ఋజువు చేస్తాను. అతన్ని యిట్టే పడగొట్టి వేస్తాను చూడండి.

ప్రభువు

నీ శక్తి భూతల ప్రవృత్తికి పరిమితమై వున్నది కనుక నీవు అతనిని ప్రలోభ పెట్టి, కుతంత్రంతో, నీ మార్గానికి త్రిప్పుకోవచ్చు. మానవుడు తన జీవిత యాత్రలో పొరపాట్లు చేస్తాడు. అది సహజం. కాని ఫౌస్ట్ నన్ను నమ్మినవాడూ, నా భక్తుడూనూ!

మెఫిస్టోఫిలిస్

ఏమైనా, అతను భూమిమీద ఉన్నంతకాలం మీరు కల్పించుకోనని మాటయిచ్చారు కదా? అదే నాకు కావలసింది. పందెం నేను కాచాను. ఎవరు నెగ్గుతారో చూతురుగాని. నా వ్యవహారమంతా మనుష్యులు బ్రతికి వుండగా వాళ్ళను గురించి కనుక్కోవడం మాత్రమేగాని, చనిపోయినవారిని బ్రతికించడం, వాళ్ళు సన్మార్గులుకదా అని స్వర్గద్వారం దగ్గరకు తీసుకొని వచ్చి దిగపెట్టడం, – అటువంటి పాడు పనులు నా కార్యక్రమ విధానంలో లేవు. నాకు కావలసినది వేడి రక్తం! యువక రక్తం! నేడో రేపో కనుమూసే జీవన్మృతులతో, నా కెటువంటి సంబంధమూ లేదు. ప్రాయంలో వున్నవారూ, ముందువెనకలు చూడనివారూ నాకు వశ్యులవుతారు. వారే నా బలగం వారే నా సంపద. ప్రపంచమంతా వారివల్లనే ముందుకు నడుస్తున్నది.

ప్రభువు

నీవు చేయగల పనులేమిటో నీ శక్తి ఎంతవరకూ

ఉన్నదో అదంతా నాకెందుకు చెబుతావులే - నాకు తెలియదనా? ఫౌస్ట్‌తో చెలగాటం ఆడాలని ఉన్నది నీకు, కానీ చూదాం. అతన్ని కొంత కాలం నీవు చేయి పట్టి నడిపించుకొని వెళ్లుతావు నీవు మరచిపోతున్న దేమంటే నీ మంత్ర ప్రభావం ఉన్నంత సేపే ఆతడు నీకు వశ్యుడవు తాడు ఫౌస్టు భక్తి సాధన చేసినవాడు సాధకుడు ఒక్కొక్కసారి సారంగ మార్గాన చీకటిలో నడువవలసి వచ్చినా, సారంగాని కావల వెలుగు ఉంటుందన్న విషయం అతనికి తెలియనిది కాదు. ఈ చీకటి మార్గాన అతను నడుస్తున్నప్పటికీ అతని ధ్యానమంతా బయటి వెలుగుమీదనే ఉంటుంది. అదే అతని గమ్య స్థానం. ఆ లక్ష్యాన్ని ఏ సాధకుడూ మరచిపోడు

మెఫిస్టోఫిలిస్

సరిసరి, ఈ ఉపమానాలకేమిలె. కావలసినన్ని చెప్పవచ్చు. ఫౌస్ట్ లాంటివారు ఒక్క చిటికలో బోర్లగిలా పడతారు. మీరే చూస్తారుగా నా సమర్థత. మహామహా వాళ్లే మట్టి కొట్టుకుపోతే యీ వృద్ధ పండితుడా నా తడాఖాకు నిలిచేది. అబ్బే, మీరు నాశక్తిలోగల చేవ మరచి పోయినారు.

ప్రభువు.

(చిరునవ్వుతో) నీ చేవ నాకు తెలియక పోవడమేమిటి? తెలుసు. కాని ఒక్కొక్కసారి నిన్ను చూస్తే జాలి, అసహ్యం కలుగుతవి. నీవు మరచిపోతు

న్న దేమిటంటే ప్రతీ మానవ హృదయాంతరములోనూ నేను ఒక చిన్న దీపం వెలిగించి ఉంచానని. అతను గాలి పీలుస్తూ వున్నంత కాలం ఆ దీపం వెలుగుతూనే ఉంటుంది. అంతర్ముఖుడై అతను ఆ దీపాన్ని చూడవచ్చు. శక్తి చాలక చూడలేకనూ పోవచ్చు. నీవు ఎంత పెద్ద యెత్తు వేసినా సాధకుణ్ణి జయించలేవు తాత్కాలికంగా వశ పరుచుకోగలవు. నిజానికి ఫౌస్ట్‌కిప్పుడు కొంత విశ్రాంతి కావాలె. అందుచేత అతని జీవన ప్రయాణంలో నీ అవసరం ఏర్పడింది. అందుకే నీవు యీ పందెం వేసి అతని దరి చేరుతున్నావు. కాని నీవు యీ పరమ సత్యాన్ని గ్రహించ లేవు. నీ యిష్టం వచ్చిన రీతిని అతనిని చీకటి సొరంగంలో నుండి నడిపించినా యేమీ భయం లేదు. అతను సర్వ పాపాలనుండి విముక్తుడై నన్ను చేరుకోగలడు. సాధకుల మనోవాక్కాయ కర్మలు వారి సాధనలో తోడ్పడుతవి. నీకు ఈ విషయంలోగల జ్ఞానం పరిమితం అందుచేత నీవు నా మాటలలోని పూర్తి అర్థం గ్రహించలేవు. (స్వర్గ ద్వారాలు మూసుకొంటవి. దేవదూతలు నిష్క్రమిస్తారు. మెఫిస్టాఫిలిస్ ఒక్కడే వుంటాడు)

మెఫిస్టోఫిలిస్

ఆ వృద్ధ పండితుని కనిపెట్టుకొని ఉండడం నాకు సరదాగానే ఉంది. ఏదో మధ్య మధ్య ఇలాంటి హుషార్నైన పని లేకపోతే మనుగడ మరీ చప్పచప్పగా ఉంటుంది. ప్రభువు మాటలు నాకు అర్థమవకపోతేపోయె. చేతినిండా పని దొరికింది.

# రాత్రి

(గోథిక్ శిల్పకళకు చెందిన వలయాకారపు యిరుకు గది. వ్రాత బల్లముందుగల కుర్చీమీద ఫౌస్ట్ కూర్చుని వుంటాడు. గదినిండా గల పుస్తకాలు అది ఒక పండితుని పఠన మందిరమని చెపుతున్నవి)

ఫౌస్టు

తత్త్వ, న్యాయ, వైద్య శాస్త్రాలు క్షుణ్ణంగా చదివాను. మత బోధలన్నీ తెలుసుకొన్నాను. శాస్త్రీయ పరిజ్ఞానానికి గల అవధులు చుట్టివచ్చాను ఇన్నీ తెలుసుకొని సాధించిన దేమిటి? నాలోగల విజ్ఞాన భాండం సాధనాపరంగా వుపయోగిస్తున్నాను. నాకింకా సమస్తం అస్తవ్యస్తంగానే కనిపిస్తున్నది. నన్ను పండితుడని పేర్కొంటారు. మేధావియని శ్లాఘిస్తారు. విజ్ఞానఖనియని గౌరవిస్తారు. అనేక సంవత్సరాలుగా నాలోగల విద్యని శిష్యకోటికి పంచి పెట్టుతున్నాను. 'పూర్తిగా యిచ్చినా పెరిగే' యీ విద్యాదానమువల్ల నా మనసుకి కొంచెం ఊరట కలుగుతున్నది. కాని ఒక జీవిత కాలపు సాధనకు పర్యవసాన మింతేనా? నా సమకాలికులయిన పండితులను, అధ్యాపకులను, ఆచార్య శ్రేష్టులను నేను అధిగ

మించి ఉండవచ్చును. కాని అందుకోరకై నేను పడ్డ యాతన లెవరికి తెలుస్తున్నవి? నా శిక్షణ, నా సాధన ఎవరి కర్థమవుతున్నవి? అటు ప్రజలకూ, ఇటు భూతప్రేతాలకూ యేమాత్రమూ భయపడను నేను. నాకు తెలిసిన విషయాల్లో నేను శిష్టుణ్ణి. అది గర్వానికి చెప్పుకోడం కాదు - సాధనవల్ల నాకు సమకూరిన ఆత్మ విశ్వాసము భోగభాగ్యాలు నన్ను ఏనాడు మురిపించలేదు. లౌకిక మార్గం నాకే నాడూ ఒంటపట్టలేదు. మంచి అన్నది మనసులో దాగకుండా మాటల రూపాన వెలుపలికి వచ్చేదే. మనుష్యులని మంచి మార్గాన నడపడం, నేను సన్మార్గమనుకున్నదే వారికి బోధించడం యివి చేస్తూ వచ్చాను. లౌకిక జ్ఞానం లేకపోవడం వల్లనేమో ప్రజలు వెనకటివలె నన్ను ఆదరించడం లేదు. ఆస్తిపాస్తులా అంతంత మాత్రమే. జీవితమెందుకనో నానాటికీ నిస్సార మనిపిస్తున్నది.

పోనీ మంత్ర తంత్రాలతో ఆ అందనిది, అందుకోనేందుకు ప్రయత్నిస్తేనేమి? ఈ మంత్ర తంత్రాలుకూడా విజ్ఞాన భాండంలో ఒకభాగమేనేమో! అటువంటప్పుడు అవి సాధన కెందు కుపకరించవు? అవి క్షుద్రవిద్యలని ఒక అపవాద వుంది. అవునుగాక, సాధనాక్రమములో సమస్త విద్యలూ అలవరచుకోవలసిందే! భూగర్భంలో సృష్టి రహస్యమంతా, బీజప్రాయంగా దాగివున్నది. ఆ సృష్టి సంపదను చూస్తున్న కొద్దీ - ఏదో అనిర్వచనీయానందమూ, గోప్యతరమగు భావగంధ సౌరభమూ కలుగుతాయి.

చంద్రబింబమా, ఎందుకు నీవు నా గదిలోకి వచ్చి నన్ను పల్కరిస్తున్నావు? ఆకాశమండలమంతా నీ చల్లటి వెల్గుతో నింపడమే కాకుండా, యావత్ సృష్టినీ పులకాంకితము చేయడమే గాకుండా, యీ దీనహృదయంలోకి యీ ముదిహృదయంలోకి ఎందుకా వెన్నెలబాణాలు పంపుతావు? అవి గాయపరిచే బాణాలుకావే - పూలబాణాలు. ఎన్ని నిశీథాలు యీ బల్లముందు జాగరణతో గడచిపోయినవో! పుస్తకపుటలలో తలదూర్చి లోకసౌందర్యానికి అంధుణ్ణయిన నన్ను చల్లని చెలికానివలె వచ్చి ఎన్నిసార్లు పల్కరించావో! ప్రతిసారీ నీదర్శన మొక మధురానుభూతి. కొండ శిఖరాలను తాకే ఆ వెన్నెల కాంతిలో కొంత, యీ జీర్ణ ప్రాంగణములోకి దయదలచి వదిలిపెడ్తున్నావా? నీ హిమ కాంతిలో, ఆ వెన్నెల బరువులో కొండగుహలని, పచ్చిక బయిళ్ళని ఒకే విధంగా వెలిగించే, పాలసముద్రపు కెరటాల్లో, దివ్యపురుషునిఛాయలు నాకు గోచరిస్తున్నవి. ఆ రత్నశోభలు తెలుసుకోనాలనేకదా - లక్షలాది మూగ హృదయాలు ఆక్రోశించేది. నీ ఫేనకాంతిలో కరిగిపోవడంకంటె యీ జీవితానికి సార్థక్యము ఏమున్నది?

ఇప్పుడు నేను ఎక్కడ ఉన్నాను? ఒక కారాగృహంలో. కారాగృహపు చీకటి గదిలో, వెలుగు కానని ఆత్మ, ఎంత కాలం యీ బంధంలో మగ్గిపోవాలో! నాకు వూరట కలిగించేవి, నా మనసు స్థిమితపరిచేవి ఈ ఒక్క పుస్తకాలే. ఎటు చూసినా పుస్తకాలే. పురు

గులు రుచిమూచిన పుస్తకాలు. ధూళి ధూసరితమైన పుటలతో మాసిపోయిన పుస్తకాలు. అరలు అరలుగా పైకప్పువరకూ వ్రాకిన పుస్తకాల దొంతర్లు. పాత కాగితాల వాసనలు. ఈ చిన్న గదికూడా ఒక వింత వాసన ప్రసరింప జేస్తున్నది. చుట్టూగలదై నందిన వస్తువులూ ఆ పాత సామానులూ నా తాతముత్తాతల నాటి ఆస్తిలో మిగిలిన నిలవ

'ఇది నీ ప్రపంచం దానినే లోకం అంటారు. ఎందుకలా ఆరాట పడతావు? మాటలలో చెప్పలేని బాధతో ఎందుకు కృంగిపోతావు? ఈ బాధకీ, యీ ఆవేదనకీ కారణమంటూ ఒకటుండాలె' అని లోపలినుంచి ఏదో ప్రశ్నిస్తున్నది.

ప్రకృతి సిద్ధమైన సహజ వాతావరణంలో యీ తనువు చాలించాలని దేవుని ఆజ్ఞ. కాని నేను చేస్తున్న దేమిటి? బూజుకల గూడునై యీ పుస్తకాల దొంతరల మధ్య ఊహించుకొన్న వికార రూపాలతో సంభాషిస్తూ, ప్రకృతి సౌందర్యాలకు దూరమవుతున్నాను. ఇప్పటికయినా మించి పోయిందిలేదు. ఈ కారాగారంనుంచి విముక్తి పొందాలె ఆ ఆహ్వానిస్తున్న విశాల ప్రపంచంలోకి పరుగు పరుగున పారిపోవాలె. ఈ చేతిలో నున్నది ఒక అపూర్వ రహస్య గ్రంథం. సుప్రసిద్ధుడైన 'నోస్ట్రాడామ్సు' లిఖించిన బృహత్తర గ్రంథం. ఈ గ్రంథరాజము నూతన ప్రపంచ ద్వారాలు తెరుస్తున్నది.

నక్షత్రమండల రహస్యాన్ని, ప్రకృతి శక్తులని, మాంత్రిక తాంత్రిక విద్యలనూ, స్థిర చేతనాజగత్తుల మధ్యగల వైరుధ్యమునూ ఈ గ్రంథ గురువు నాకు తెల్పగలదు ఇందులో గల రహస్య సంకేతాలద్వారా భూతపిశాచాలతో సంభాషించగలను భూత ప్రేతాల రహస్యాలు ఛేదించగలను ఇంతవరకూ దాచిపెట్టిన గ్రంథం యింక యీ నాడు తెర వక తప్పదు

భూతశక్తులారా, నా చుట్టుపక్కల తారాడుతూ, నేను పీల్చేగాలిలోనే నశిస్తూ నాకంటి కగుపడని, అదృశ్య రూపాలు ధరించిన పైశాచిక శక్తులారా, మీరు నేనడిగే ప్రశ్నలకి సరియైన సమాధానలివ్వండి

(ఆ పుస్తకపుటలను చటుక్కున తెరుస్తాడు, అతని దృష్టి అమాంతం 'విశ్వరూపం' అను సంకేతచిత్రం మీద వ్రాలుతుంది)

ఎంత గొప్పగా భావబంధురంగా వున్నదీ చిత్రం. నా కనులకేదో అపూర్వలోకాలు కన్పిస్తున్నవే. ఈ సంకేతాన్ని చేతితో తాకగానే నా రక్తనాళాలలోకి ఏదో జలపాతవేగం జొరబడిందే! ఏమిటి, ఇదేమిటి! కాలచక్రం నాకోసం వెనుకకు తిరిగిపోయిందా? ఇదేమో! ఆశ్చర్యంగా వున్నది, యువకునివలె మారిపోయాను జవజవలాడుతున్న యీ దేహంలోకి పటుత్వమూ, బిగువూ ఎక్కడినుంచి వచ్చాయి? ఏ అదృశ్యశక్తి నాపై మంత్రజలము అభిషేకిం

చింది? ఈ సంకేతాలు చిత్రించిందెవరో మహాసిద్ధుడో దేవదేవుడో అయివుండాలె. నా క్షుభితహృదయంలోకి ప్రశాంతత ఎలా ప్రవేశించింది? శోకానలంగా కనిపించే యీ ప్రపంచంలో యీ వసంతోదయచ్ఛాయ యేమిటి? ఏమి యీ దివ్యానుభూతి? ఏమి యీ మధురానుభూతి? ప్రకృతి అంతటా ఈ అదృశ్యశక్తులు నివురుగప్పిన నిప్పువలె వుండి, తెర తొలగించగానే, తమ సహజ తీక్ష్ణతతో ప్రకాశిస్తున్నవా? నా జీవితకాలపు పాండిత్యమంతా యీ దివ్యక్షణాల అనుభూతికి సరితూగటం లేదే! ఈ బలవత్తర పరిణామానికి కారకు లెవరు? భగవంతుడా? పైశాచిక శక్తులా? లేక నాలో నిబిడీకృతమై యున్న శక్తే యీ రూపాన ప్రజ్వరిల్లుతున్నదా? 'అమరపురిద్వారాలు సర్వదా తెరవబడి వుంటాయి' అన్న పెద్దలవాక్యంలోని అంతరార్థం నా కిప్పుడు లీలగా బోధపడుతున్నది. హృదయం పాషాణమైపోగా, విజ్ఞానమార్గాన పయనించి, నేను గమ్యం చేరుకోలేను. కాంతి ప్రవాహంలో స్నానమాడి, యీ శరీరాన్ని దివ్యతేజఃప్రసారంతో పునీతం చేసుకుంటేనే తప్ప స్వర్గద్వారాలు తెరువబడవు.

(సంకేతం కేసి తదేకంగా చూస్తూ వుంటాడు)

ఈ విశ్వరూప సంకేతం ఇంద్రియాతీతమైన అనుభూతికి నన్ను లోను చేస్తున్నది. యౌవనప్రాయం చిగురించినట్లయింది. ఇది యింద్రజాలమో, మహేంద్రజాలమో,

దివ్యపురుషుని లీలలో, పరమేశ్వరుని కృపావీక్షణమో తెలియకుండా వుంది. ఆక్రోశించే సముద్రంవలె ఆరాట పడ్డ నా హృదయం, శాంతిపొంది, మానవనేత్రాని కగు పడకుండా ప్రకృతి గర్భంలో దాగివున్న దీప్తి శిఖాన్ని, నా మనోనేత్రానికి దర్శనమిస్తున్నది. నాలోగల ఆత్మ, ప్రకృతి సంగీతంతో, విశ్వవీణావిపంచితో ఏదో లయ కలిసినట్లయి, చిన్ని వెలుగూ, దివ్యతేజమూ ఐక్యమయి నట్లు భావన కలుగుతున్నది. 'అమరపురి ద్వారాలు సర్వదా తెరిచేవుంటాయి. నిన్ను నీవే మూసుకొంటావు. నీ హృదయం పాషాణం చేసుకుంటావు. అరుణోదయకాంతిలో ఈ ఆత్మ జలకమాడినప్పుడు, ఈ యిహలోక వాసన లను నీవు విడిచిపెట్టినప్పుడు, తెరిచినద్వారాలు కనపడతవి. నీవు ప్రవేశించవచ్చు. అప్పుడే నీకు భూమ్యాకాశాల స్నేహమూ స్వర్గనరకాల సామరస్యమూ అవగాహనమవు తుంది.'

(పుస్తకం తెరిచి సంకేతముపై దృష్టిని కేంద్రీ కరిస్తాడు)

విశ్వమంతా గిరగిర తిరుగుతున్నది. సకల జీవ కోటి తమ ధర్మాన్ని చైతన్యవంతంగా నిర్వహిస్తున్నది. భూమ్యాకాశాలు ప్రశాంతిమంతంగా ఏకమై పోతున్నవి. ఇది ఒక మహా నాటకం. తల్లి ప్రకృతి మాతా! నీ హృదయ పీఠము ఎక్కడ వున్నది? ఈ భూమ్యాకాశా లను ఏకం చేసే మూల శక్తికి స్థానం ఎక్కడ? ఆ

పరమ రహస్యం తెలుసుకొన్నానో – జన్మ చరితార్థమైనట్లే. లాలించి పాలించవలసిన దేవమాతా నీ దివ్య సుందర విగ్రహం దర్శించగల భాగ్యం మాకు కలుగుతుందా?

(ఈ తన్మయావస్థలో పుస్తకపుటలు మరికొన్ని తిరగవేస్తాడు. భూమండలానికి అధిష్ఠాన దేవత అయిన భూశక్తి అతనిముందర ప్రత్యక్షమవుతుంది)

వెనుకటి అనుభవాలన్నీ ఒక ఎత్తు, యీ నిదర్శన మొక ఎత్తు. నీవు భూశక్తివికదూ! నాకు ఎంత దగ్గరలో వున్నావో! నిన్ను మాటలతో కీర్తించలేకుండా ఉన్నాను. మధుపానీయాల రుచి నాలుకమీద ఆడినట్లే నాలో వుత్సాహము కట్టలు తెంచుకొని ప్రవహిస్తున్నది. నీ ఆర్భాటాలకు నేను భయపడను నిట్టూర్పులకూ, ఉపద్రవాలకూ నేను జడవను. నిశీధి నన్ను ఆవరించనీ, చంద్రుడు తన కాంతితో నన్ను కప్పివేయనీ, కాంతిధామాలే కరిగిపోనీ, మంచు నన్ను ముంచెత్తనీ, అదృశ్య కిరణాలు నన్ను కాల్చివేయనీ, వీటన్నిటితో శృతి కలిపి నేను జీవింపగలను. నన్ను బందీకృతునిగా చేస్తున్న ఈ బంధాలెక్కడివి?. నీవు ఎవరివో చెప్పు? నీ నిజరూపం బయటపెట్టు. నేను ప్రార్థించినా వినడం లేదే యీ శక్తి! నన్ను పరీక్షించతలచుకొన్నదా? నీ నిజరూప దర్శనమైతే నా హృదయాన్ని నీకు కానుకగా సమర్పిస్తాను. నీవు ఎవరివో చెప్పు? నీవు ఎందుకు ఇక్కడికి వచ్చితివో చెప్పు? నాకు కనబడకుండా యీ ప్రకారం చుట్టూ ఎందుకు ఆవరించుకొని పోవడం?

(పుస్తకాన్ని చేత పుచ్చుకొని, మంత్రోచ్చారణ చేస్తూవుంటాడు మంత్రఫలితంగా ఎర్రటిమంట ముందు కనబడుతుంది. ఆ మంటలోనుంచి భూతశక్తి బయటకు వస్తుంది)

భూతశక్తి

నన్ను పిలిచింది ఎవరు ?

ఫౌస్టు (ప్రక్కకు తప్పుకొంటూ)

ఎంత వికారమైనరూపు! ఎంత భయంకరమైన ఆకారం!

భూతశక్తి

నీవేగదా నన్ను ఆహ్వానించింది. మంత్రోచ్చారణ చేసి నన్ను పిలిచావు నీ పిలుపుఆలించి వచ్చాను. తీరా వచ్చేక ఇలా అంటావేమిటి ?

ఫౌస్టు :

నిన్నా నేను పిలిచింది! నీ రాక్షసరూపం ఎలా భరించగలను ?

భూతశక్తి

నన్ను పిలిచింది నీవే. నన్ను చూడాలనుకున్నదీ నీవే. పనికట్టుకొనివాచ్చాక భయపడుతున్నావు. నీ మనోభిప్రాయాలు నాకు తెలుసు. నీ కోర్కెలు నేను నెరవేరుస్తాను. నేను అందుకనే వచ్చాను. నీవంటి ధీరపురుషుడు భయభ్రాంతుడవడమా! నీ ఆర్తనాదం నాకు తెలుసు. నీ

హృదయం ఎక్కడవున్నది? లోకాన్ని తన యిష్టంవచ్చిన రీతిగా సృష్టించుకొన్న హృదయం, రసబంధురమగు ఆ హృదయం, తుదకు మా భూతగణాలను కూడా చేరదియ్యడానికి ఆరాటపడుతున్న దే।

ఫౌస్టు

ఇంతకూ నీవెవరు? నీ ఉనికి ఎక్కడ? నన్ను స్వాధీనం చేసుకోపోయే దుష్టశక్తివలె వున్నావు. దుష్టగణాలకు, తంత్రాలకు లోబడడు ఈ ఫౌస్టు. ఉచ్చులువేసి నీ వలలో చిక్కించుకొందామని వచ్చావుకాదూ! నీ శక్తియుక్తులకు భయపడిపోయినాను కీటకంవలె హడలిపోయినాను అగ్ని శిఖలలో రూపు దిద్దుకొంటున్న నిన్నుచూచి భయపడకుండా వుండడం సాధ్యమా? నీవు దుష్టత్వానికి చిహ్నమైతే, నేను సత్ చింతనకు వారసుణ్ణి.

భూతశక్తి

ఈ లోకాన్ని, ఇందులోగల ప్రాణులను వారి జీవనధర్మాలను సృష్టించినది నేనే. వారిసృష్టి, స్థితి, లయములు నావల్లనే జరుగుతున్నవి. పడుగుపేకలవలె రాత్రింబవళ్ళను అల్లుతూ, ఆద్యంతాలు తెలియని జననమరణాలు కల్పిస్తూ, ఈ జీవనసృష్టిని సాగిస్తున్నాను. కాలం అనే మగ్గంలో పడుగుపేక లల్లడమే నా నిత్యకృత్యము. అందులో తయారైన దుస్తులు నేను విశ్వప్రభువుకు కానుకగా సమర్పిస్తూ వుంటాను.

ఫౌస్టు

ఇంత సమర్ధత కలిగిన నీకూనాకూ ఏదో సన్నిహిత సంబంధమున్నట్లు తోస్తున్నది.

భూతశక్తి

నీకు ఎటువంటిశక్తి కావలెనో, ఏ శక్తిసంపన్నత వల్ల నీవు పరిపూర్ణుడవవుతావో అది నాకు తెలుసు. ఆశక్తిని నేను స్వయంగా నీకు ఇవ్వను. అది యిచ్చేందుకు మరొకడు వస్తాడు. (భూతశక్తి మాయమవుతుంది)

ఫౌస్టు (నిశ్చేష్టుడై)

ఏమని విన్నాను? ఈ తుచ్ఛశక్తులతో సరితూగలేనా నేను? సౌజన్యము, సౌశీల్యమూ దేవుని ప్రతిబింబాలంటారే! వాటిని నమ్ముకొని జీవితమంతా గడపిన నేను ఈ తాంత్రిక శక్తులకు సరితూగలేనా?

(బయట అలజడి. తలుపు తట్టుతున్న చప్పుడు)

ఫౌస్ట్

ఇలాంటి సమయంలో నా తలుపు తట్టడమా? బహుశా శిష్యుడు వాగ్నర్ అయివుంటాడు. అదృష్టదేవత తనకుతానై పల్కరిస్తున్న సమయాన ఈ శిష్యుడు ఇప్పుడే దాపరించాలె?

(తలుపు తెరువగా వాగ్నర్ లోనికి వస్తాడు. అతని చేతిలో ఒక లాంతరు. శిష్యుని ముఖం చూడడం ఇష్టంలేకపోయినా, ఒకసారి అతని వంక చూస్తాడు)

వాగ్నర్

మీరేదో పరిస్తున్నట్లున్నారు. బయటకు వినబడుతున్నది ఇటువంటి సమయాన మిమ్ములను ఇబ్బంది పెడుతున్నందుకు నన్ను క్షమించండి. గ్రీకు విషాదాంత నాటకమేదో మీరు పైకి చదువుచున్నట్లున్నది. రాగబద్ధమగు అటువంటి కావ్య పఠన వినడం కొద్దిమందికే లభిస్తుంది. ఈరోజులలో అలాటి ఘట్టాలు అందరూ విని, విషయాలు తెలుసుకోవాలె. మన పరిసరాలలో ఉండే ఫాదరీ నేర్చుకోతగ్గ అపూర్వ విషయాలు అనేకం వున్నాయి అందులో

ఫౌస్టు

అవును. ఫాదరీలుకూడా నటకులుగా వుండవలసిన అవసరం ఎంతైనా వుంది ఈరోజుల్లో.

వాగ్నర్

అనవరతం విజ్ఞాన మందిరాల్లో మగ్గే మనకు ఈ ప్రపంచాన్ని గురించి తెలుసుకోగల వ్యవధి ఎక్కడ? ఇందులోగల వింతలు అవగాహన చేసుకొనేందుకు సూక్ష్మదర్శిని కావాలె.

ఫౌస్టు

ఏ విషయగ్రహణానికైనా తృష్ణ ప్రధానం. తృష్ణ అన్నది హృదయంలో జల వలె వూరుతూ వుండాలె. ఆ తృష్ణా తత్పరతే మానవునిలోగల సహజ శక్తులను ప్రకోపింపజేస్తుంది. ఏకార్యమైనా సాధించడానికి దీక్ష – అందుకు

తగ్గ వోర్పు అవసరము. భోజనానికని సిద్ధము చేసుకొనే వంట పదార్థాలలో అసలు పదార్థం నాలుకమీదకు వచ్చే లోపుగా, పాత్రలు, పొయ్యి, వంటకం, శుభ్రత, రుచి, ఇలాటి కార్యభారము ఎంత వున్నదో ఆలోచించు. మంట ఎక్కువయితే పదార్థము మాడిపోతుంది. తక్కువైతే సరిగా ఉడకదు. అన్ని సమపాళంలో వుండాలె. ఇది నిత్యమూ మన కండ్లముందు జరుగుతున్నదే. కాని మనం కండ్లు తెరిచి చూడము. ఎవరిపనిలోవారు నిమగ్నులై ఉన్నప్పుడే ఆ కృషి ఫలిస్తుంది. అందుకు విధించిన మార్గాన్ని సాధన అంటారు ఆ మార్గం చూపేది అంతరాత్మ. బయటివారు చెప్పే మాటలు సామాన్యంగా గాలిలో కలిసిపోతాయి. అవి మన హృదయ మందిరాన్ని సోకవు. ఎవరి హృదయపీఠం వారు చేజేతులా నిర్మించుకోవాలె. అది వారి అపూర్వ మందిరం.

వాగ్నర్

మీరు చెప్పేది శాగానే వుంది ఆ ప్రకారం సాధన చెయ్యమనే నామనసూ చెప్పుతున్నది. కాని అంతదూరం వెళ్ళగల శక్తి నాకు లేదు.

ఫౌస్టు

ఇలా నిరుత్సాహపడి లాభమేమిటి? ఆ శక్తిని నీకు నీవుగా సంపాదించుకోవాలె. నీకు తెలివితేటలున్నవి. వాటిని సాధనకోసం వుపయోగించు. మబ్బులూ, సుడిగాలీ,

త్రోవలో అడ్డము రావచ్చు. మంచుగాలుల వల్ల శిశిర ఋతువులో చెట్ల ఆకులు రాలిపోగా, అవి తమ నాము రూపాలే పోగొట్టుకొంటున్నవి.

వాగ్నర్

మీరు ఇచ్చే సలహా బాగానేవుంది. కాని ఆ ప్రకారం సాధన చెయ్యడానికి ఎంతో ఓర్పు కావాలె. కాలపురుషుడు మనకు అంత సమయం అనుగ్రహిస్తాడా? మనమిక్కడ ఉండేదే స్వల్పకాలం. ఆ కొద్ది సమయంలో మేధకూ, హృదయానికి సంఘర్షణ కల్పించి, ఆ ఘర్షణలో స్వధర్మమేమిటో తెలుసుకొంటూ, మార్గానువర్తులమై ముందుకు నడవాలె. కాని మృత్యు రాక్షసి ఎప్పుడు మనను కబళించుకొని పోతుందో అని భయమేకదా!

ఫౌస్ట్

హృదయానికి, మెదడుకూ జరిగే పరస్పర ఘర్షణలోనే దివ్యలోకపు జీవధార వున్నదనీ, అదే మానవుల దప్పిక తీరుస్తున్నదనీ మరచిపోకు. నీలో నిద్రాణమైవున్న శక్తులను స్వప్రయత్నం వల్లనే గుర్తించగలగాలె. అలా చేస్తేనే నీ దాహం తీరుతుంది.

వాగ్నర్

మీరు చెప్పేది బాగానే వుంది. మన పెద్దలు వారి కాలంలో అలాటి ధృక్పథంతోనే సాధనచేసి వుండవచ్చు. కాని రోజులు మారిపోయినవి. అప్పటికీ ఇప్పటికీ ఎంతో

లేదా వుంది. వారి సనాతన మార్గమే మనకు అవలంబన యోగ్యమా అని?

ఫౌస్టు

ఇలాంటి విషయంలో తర్జన భర్జనలు నిరుపయోగం. భూతకాల మనేది ఒక బృహత్తర గ్రంథం. అది ఏడు రకాల ముద్రలతో మనకోసమని పదిలపరచబడి వున్నది. ఆయా చక్రాలు తిరుగుతూ వుంటవి. వాటిని త్రిప్పే శక్తి మార్పు లేనిది. కొంచెం లోతైన దృష్టితో గమనిస్తే, ఆయా కాలాలలో ఉండే వ్యక్తుల శక్తీ అటువం టిదే. వారు లెక్కకు మిక్కుటంగా ఉండవచ్చు గాని వారు సృష్టించిన వలయాలు ఒకే విధాన వుంటాయి. నేను చెబుతున్నది బోధపడడంలేదా? ఒక పట్టాన అర్థం కాదు కొంచెం శ్రమ పడితేనే తప్ప. కొందరు మను ష్యులు తమ త్రోవనుండి తప్పుకొని పారిపోదామనుకుం టారు. కాని యీ జీవితపథం మీదుగా వ్యక్తులకు పారిపో గల ఆస్కారం లేదని వారికి తెలియదు. పరిస్థితుల అను కూల ప్రతికూలాలతో ప్రమేయం లేకుండా ప్రతిఒక్కరూ తమ భూమికని ఈ మహానాటకంలో ఉచితరీతిని పోషించ వలసిన దే.

వాగ్నర్.

మీ దృష్టిలో లోకమనగా మనుష్యులు – అనగా వారి హృదయ దర్పణాలు. అందులో ప్రతిఫలించే సుందర దృశ్యాలనే ప్రతివారూ తెలుసుకోవాలనేగా మీారనేది?

ఫౌస్టు:

ప్రతి ఒక్కరూ హృదయమును సూటిగా లోపల చూడలేరు. హృదయ ధర్మం తెలుసుకోడం సాధ్యం కాదు. ప్రతి పాపనూ ఆ పాప పేరుతో పిలవగలమా? పాప పేరు తెలిసినవారు కొద్దిమందే ఉంటారు. అలాగే హృదయ సీమల విహరించే వినిర్మల భావ వీచికలు, ఉద్రేకంతో రంగరించిన వేళ మాత్రమే వారినుంచి బయటకు వస్తాయి. ఒక్కొక్కసారి ఆ పరమ సత్యానికి లోకం జడిసి పోతుంది. ఆ నిజం చెప్పినందుకు వారిని బంధించి చిత్రవధ చేస్తుంది. అగ్నికీలలకు ఆహుతి చేస్తుంది. సత్యసంధత మానవుని తేజోమూర్తిగా చేస్తుందికాని అతని వద్ద బలిదానం పుచ్చుకొంటుంది. ఇప్పటికే చాలా రాత్రి అయింది. ఈ తాత్విక చింతన ఇక ఆపివేదాం.

వాగ్నర్

ఎన్ని పగళ్ళూ ఎన్ని రాత్రిళ్ళూ మీ సాన్నిధ్యంలో గడిపినా ఇంకా ఏవో నూతన విషయాలు మీ వద్దనుంచి తెలుసుకోవాలని ఉంటుంది. రేపటినుంచీ ఈస్టర్ ఉత్సవాలు కదా! ఆ పండగ సంగతులెన్నో మీవల్ల తెలుసుకోవలెనని ఉన్నది. రేపు కలుసుకొన్నప్పుడు అడుగుతాను. (వాగ్నర్ నిష్క్రమిస్తాడు)

ఫౌస్ట్.

(ఒంటరిగా) అన్నీ క్షుణ్ణంగా తెలుసుకోవాలని ఈ వాగ్నర్ ఆశ. స్వప్రయత్నంతో ఏవి లభించినా ముందు

వెనుకలు చూడకుండా ఆ నిధి నిక్షేపాలు చేతికి చిక్కిం చుకోవాలని అతని అడియాస. నిధులకోసమై త్రవ్వే గోతుల్లో ఎన్ని కుమ్మరి పురుగులనో, మట్టి పురుగులనో వాన పాములనో చూస్తాడు! భూత శక్తులు తారట్లాడే, యీ పరిసరంలో వాగ్నర్ వంటి మనుష్యుల కంఠం ఎంత మ్రోగుతుందో, అరుస్తుందో! అతడీ సమయాన రావ డం నాకు ఒక విధంగా మంచిదయింది. నిరుత్సాహ జల ధిలో మునిగిన నన్ను పైకి లాగటానికి తగిన సమయం చూచి వచ్చాడు వాగ్నర్. నాకు ప్రత్యక్షమయిన మహాకాయభూతము ముందు నేను అణగారిన మరి గుజ్జ నయినాను, కాదనను కాని నేను దేవుని ప్రతినిధిని. దైవ కృప నాకు ఉన్నది నాలో ఉన్నది రాక్షస శక్తి కాదు. అది దైవ శక్తి. దైవాంశ గలది నా ఆకృతి కడు స్వల్పమైనప్పటికీ భూత శక్తి నామీద ఎటువంటి ప్రభా వమూ చూపలేదు దేవుడు నన్ను కనికరించాడను కొన్నాను. ఆయన చల్లని చేయి నన్ను ఆశీర్వ దిస్తుందనుకొన్నాను. ప్రకృతి లోగల దేవతా శక్తులు కష్టపరంపరలను త్రెంచుకొచ్చి, సత్యమా ర్గాన్ని చూపుతాయనుకొన్నాను. సత్య సౌశీల్యమూ ప్రభు భక్తీ నన్నొకదరికి జేరుస్తాయనుకొన్నాను. నా మార్గాన ఎందుకోసం ఈ ఉరుములూ, మెరుపులూ? ఎందుకిది కంటకావృతమై పోయింది! బాటకానరాని అరణ్యమార్గమైపోయిందే! ముందు ఏ మున్నదో కనబడదం

లేదు. నీ కరుణకలదని ఇన్నాళ్ళూ ధైర్యంగా వున్న నాకు, ఒడలంతా జలదరిస్తోంది. ఈ సామాన్యుని నీ దగ్గరకు పిలుచుకోడం నీకు ఇష్టంలేదా ప్రభూ! నీకాశక్తిలేదా దయామయా! నీకే ఆ శక్తి లేనపుడు నాయీ దీర్ఘజీవితానికి అర్థమేమి? లేక చేజేతులా నేను నీ దయాభిక్ష కోల్పోయానా? ఒకొక్కసారి మహోన్నతుడననే ఆత్మగర్వమూ, మరొకసారి క్షుద్రమానవుడననే నైరాశ్యమూ, ఎందుకు కల్పిస్తున్నావు ప్రభూ! నేను ఏం తప్పుచేశానని నన్ను దేవలోకంలో నుంచి ఈ మర్త్యలోకంలోకి గిరాటు పెట్టావు? ఇక్కడ నాకు దారిచూపగల మహనీయు డెవరు? మీదిమీదికి వచ్చే అవాంతరాలను తప్పుకోనడమో లేక ఎదుర్కోనడమో తప్ప మార్గాంతరం లేదా? ఈ సంఘటనలు కల్పించి మానవులను ఆడించడం నీ క్రీడావినోదంవలె వున్నదే! నాకు ప్రత్యక్షమయింది ఒక మహాశక్తి. సృష్టిస్థితిలయాదిగుణములన్నీ దానిలో కేంద్రీకృతమై వున్నవి. అప్రతిహతమగు ఆలోచనలు నన్ను వుక్కిరి బిక్కిరిచేస్తున్నవి. సన్మార్గాన పోవాలని మనము కాంక్షిస్తూ వుంటే ఎన్నో అడ్డంకులు ఎదురై నిలబడుతున్నవి. వాటికి తల ఒగ్గుతూ, ఒక్కొక్క సారి వాటిని జయిస్తూ జీవితరథం తోలుకొని పోతాము బహుశా ఇలాంటి పిచ్చి ఆలోచనలు రావడం ఒకవిధంగా మంచిదేనేమో! ఈ ఆలోచనల ఆంతర్యాన్ని ధైర్యసాహసాలతో విడగొట్టి చూశామా జీవితపు రహస్యాలన్నీ అందుతాయి. ఈ భావామృతం

లోనే అమరకిరణాలు లీలగా కనిపిస్తవి. భావమే సర్వ శక్తులకూ మూలాధారం. మనచుట్టూ పరిసరాలను మరిపింప చేసే స్వర్గనరకాలనూ, శక్తిసంపదలనూ, ధైర్యసాహసాలనూ ప్రసాదిస్తుంది. హృదయములో ఏదో తీరనిబాధ. ఆ బాధ హృదయాన్ని పీల్చి పిప్పిచేస్తున్నది. బాధ లెప్పుడూ కాపురముండేది హృదయంలోనే. అక్కడే అవి తమ తాండవనృత్యం సాగిస్తవి. ఎంతటి మహదానందంలోనూ విషాదఛాయలు గుర్తు చేస్తవి. భౌతికమగు విరామాన్ని మానసికమైన అలసటగా తారుమారుచేస్తవి హృదయ క్షేత్రాన్ని ఆశ్రయించి వుండే ఈ విషాదబీజాలు ఆస్తిపాస్తులుగా, భార్యాపుత్రులుగా, కుటుంబ బాధ్యతగా సంసారపంకమును కలిపిస్తూ, అగ్నియై, జలమై, ఆయుధమై అమృతమై మనతో నిరంతరమూ దోబూచులాడుతూ వుంటవి. ఈ విషయాలు అందరికీ తెలుసు, కాని వాటి గురించిన తలంపు వచ్చినపుడు మాత్రమే కంపించిపోతారు మిగతా వేళల వాటి వునికిని విస్మరిస్తారు. నాలో దైవాంశం లేదా? మంచితనమూ దైవత్వమూ ఒకదానికొకటి అతి సన్నిహితమయిన వంటారే, అటువంటప్పుడు నేను దైవత్వానికి దూరుణ్ణి ఎలా అవుతాను? ఈ ధూళీదుమ్మూవలె, పురుగుపుట్రావలె, అతి స్వల్పమైన ప్రాణధాతువుగల కీటకమాత్రుడి నేనా? అంతకు మించిన విలువలేదా నా ఈ తాపత్రయానికంతా? కీటకములవలె నేనుకూడా నేలలోనించే జనించాను. ఈ

భూమిలోనే కలిసిపోతాను. ఈమధ్యకాలంలో నాచుట్టూ ఎందుకు ఇన్ని ఎత్తు గోడలూ, ఈ మేజా బల్లలూ, పుస్తకాల పెట్టెలూ కావాలె? నన్ను ఈ స్థలానికి ఈ నేలకూ కట్టి వేసేది ఇవేనా? ఈ గదిలోని గ్రంథాల విలువ యింతని ఎవరు చెప్పగలరు? ఈ గ్రంథ భాండారంలో తలదాచుకొన్న వీటికి, విలువ నిర్ణయమవుతుందా? ఈ పుస్తకాలు కూడా నేడో రేపో పురుగుల పుట్టలయే వేకదా? ఇంతటి ఇరుకులో, పరిమితమైన చిన్న స్థలంలో, విశ్వరూపం తెలుసుకోవాలనే తహతహ నాకెందుకూ? ఇక్కడ వేలకొలదీ గ్రంథాలు న్నాయి. ఇందులో మానవుని సుఖపెట్టేవీ, దుఃఖాల పాలు చేసేవీ కూడా వున్నవి.

భోగభాగ్యాలు సమకూర్చగల మార్గాలు చెప్పే గ్రంథాలూ వున్నవి. ఈ పుస్తక పుటలు తిరగవేస్తూ కన పడినమేరకు చదువుతూ, అంతటితో తృప్తి పడవలసిందేనా?

(ఫౌస్టు ఒకమూల భద్రంగా అమర్చబడివున్న అస్థిపంజరంకేసి దృష్టి సారించి పుర్రెను పరిశీలగాచూస్తూ)

ఎందుకు ఆ ముసిముసి నవ్వులు? నాకుమల్లే నీకూ ఒకప్పుడు మెదడు వుండేదిలే. ఆ మెదడే నిన్ను బాధించి వుంటుంది. అది మంచి రోజులకోసం తహతహలాడించి ఉంటుంది. మంచి రోజులనే ఆనంద దీపం వుండే చోటు తెలియక నీవూ బాధపడి వుంటావు. మబ్బు తెరల వెనక నుంచేకాని, శతసహస్ర కిరణ శోభాయమానములుగా అరుణ కాంతులను కనుల పండువగా నీవు చూచి వుండవు. సత్యా

న్వేషణ మనే కనరాని స్వప్నం కోసం, నీ వివేకమంతా వృధా చేసుకొంటూ, విజ్ఞానమంతా వ్యర్ధపరుస్తూ రోజులు గడిపి వుంటావు. నన్ను చూచి హేళన చేస్తున్నావా జీర్ణ కంకాళమా! నీకు మీ కాలంనాటి ఆట పాటలు, నృత్య గాన వినోదాలు, స్ఫురణకు వస్తున్నాయా? నా విషయ మంటావా? నేను ఎందుకూ పనికిరానివాణ్ణి. ఒక పూర్ణ జీవితాన్ని నిరర్థకమైన ప్రయాసలో గడిపాను కంకాళ మిత్రమా, నీవు నాకు చేయూతగా ఉండి ముందుకు నడుపు కొనిపోకూడదా? అస్థి పంజరమా, నీవు సమస్త శక్తులకూ నిలయానివి. నీలో ప్రాణమైతే లోపించిందిగానీ మిగిలిన విజ్ఞాన నిధులన్నీ ఇంకా గుప్తంగా లోపల వున్నాయి. ఈ గ్రంథరాజములలో ఎన్ని కాంచన ద్వీపాలు, ఎన్ని పగడపు దీవులూ వున్నాయో కదా! ఎదురుగా ఇంతటి సంపద వుండగా, అందుబాటులో వున్న ఏ ఒక్క పని ముట్టూ వాడకపోవడం నా మూర్ఖత. గ్రంథరాజమా, ఎంతో కాలంగా ఈ బల్లమీద వుండటంవల్ల నీ సహజ కాంతులు తగ్గిపోయినవి. అయినప్పటికీ నీ విలువ నాకు తెలుసు. సంప్రదాయ ధర్మాన్నీ, జ్ఞానాన్నీ నీలో పది లంగా భద్రపరచుకొన్నావు. నీవు కట్టెదుట వున్నప్ప టికీ మానవులు నీవల్ల కాగల ప్రయోజనం పొందకపోవడం వారి దురదృష్టం. ఈ గదిలో ఇన్ని వస్తువులుండగా ఆ గాజు బుడ్డి నా కంటికి సూదంటురాయివలె కన్పిస్తు న్నది ఎందువల్ల? ఏమో వింతగా నున్నదే! గదిలోకి

ఎక్కడినుంచి వస్తున్న దీ వెలుగు? కారడవిలో చంద్రోదయమయినట్లు ఎక్కడిదీ వింత కాంతులు? కాంతి దేవా, స్వాగతం! నీకు సుస్వాగతం! భక్తివినమ్రుడనై నీకు స్వాగతము చెప్పుతున్నాను. మానవుని విద్యావిజ్ఞానాలు, అతనిలోగల కళాప్రభావం, నీలోతీర్చి దిద్దినట్లు ప్రతిఫలిస్తున్నాయి. కష్టపరంపరలు మరిపింపచేయగల శక్తి నీలో ఉన్నది మృత్యువును జయింపగల కళాకౌశలం నీలో నిబిడీకృతమై వున్నది. నీ వునికివల్ల సమస్త బాధలూ హరించిపోతాయి. నా కష్టపరంపరను తుడిచి వేయడానికి, దయచేశావా మహనీయా! సమస్త శక్తులకూ నిలయమైన నీలో మహార్ణవముల లోతూ, వైశాల్యమూ కనిపిస్తున్నాయి నీ కాంతి సాగరంలో ఈదులాడాలని, తేలిపోవాలనీ, మనసు వుర్రూతలూగుతున్నది. ఈ సాంద్ర కాంతి పూర ప్రయాణం నన్ను ఏ రేవుకు జేర్చునో? కాంతి దేవా, నీకు జోహారు. ఏమిది నా కనులముందే ఏదో కదులుతున్నది. ఏమిటా కదలిక? అగ్ని శకటమా! ఆచల్లనైన కాంతి ప్రవాహంలోనుంచి ఈ అగ్నిశకటమా? ఆ రథ చక్రాలు తిన్నగా నావైపుకే వస్తున్నట్లున్నవి. ఆ అగ్ని శకటమెక్కి ఆకాశమండలంలోకి పారిపోనా? ఆ అగ్నిశకట మెక్కగల అర్హత నాకున్నదా? దీనిలో ప్రయాణం చేయగలిగితే, నిజంగా అమరలోకం చూచి రావచ్చు. నే నా శకటం ఎక్కగలనా! నేనా, తుచ్ఛ జీవితం గడిపే మానవుణ్ణి, ఆ అగ్ని రథం ఎక్కాలనే వెర్రి

ఆశలు పెంచుకోకం? అది నావంటి మర్త్యులకు లభ్యమయే ఆనందానుభవమా? మనసులో ఎక్కడో మూలగా 'అది నీకెందుకు? నీకు అర్హత లేదు' అని చిన్న మూలుగు వినిపిస్తున్నది. ఈ సూర్యకాంతులు, యీ అగ్నిశకటం ఇవన్నీ ఏమిటి? నా మనస్సు కల్పిస్తున్న భ్రమలవలె వున్నవే! గదితలుపులొకసారి శార్లగా తెరవడం మంచిదేమో? లేచివెళ్ళి తలుపులు తెరిచేటందుకు కూడా ఏదో జంకుగానూ, భయంగానూ వున్నది. తలుపులు తెరవవద్దని ఎవరేనా ఆదేశిస్తున్నారా నన్ను? లోనగల శక్తి ఏదో నన్ను ద్వారంవైపు పొమ్మంటున్నది నీవిటు వెళ్ళితే అగ్ని గుండాలడ్డంపడుతాయని ఏదో రాక్షస శక్తి నన్ను భయపెడుతూ నిర్ప్రాణునిగా చేస్తున్నది. ఆ గాజుబుడ్డి ఎందుకంత దేదీప్యమాన్యంగా మెరుస్తున్నది. ఆ గాజుబుడ్డిలో ఏమో వున్నది అది ఒట్టి బుడ్డికాదు ఆ బుడ్డిమీద చిత్రింపబడ్డ చిత్రాలు ఏదో రహస్య గానాన్ని ఆలాపిస్తున్నాయి. ప్రాచీనులనాటి పాత కథలు ఆ రేఖలలో ఒదిగి కావ్యభూమికలై గానారావం చేస్తున్నవి. ఆ రేఖా చిత్రాల దివ్య సౌందర్యాన్ని తలపోసినకొద్దీ, నా యౌవనకాలం నాటి మధుర యామములు స్మృతిపథంలోకి వస్తున్నవి. ఈ బుడ్డీని ఎవరూ తాకకూడదు. దీనిలోగల మహత్తు నాకుతప్ప మరెవరికీ తెలియదు. ఇందులో వున్నది అమృత పానీయం. దీనిని తయారుచేసింది నేనే. దీనిని సేవించి జీవన దారుణాగ్నులనుంచి విముక్తి పొందుతాను.

(ఆ పాత్రను నోటివద్దకు తెచ్చుకొంటాడు ఫౌస్టు. అదే సమయాన బయటనుండి చర్చి గంటలు వినబడుతవి. ఆతరువాత దేవదూతల బృందగానం 'ఇహలోకపు కట్టుబాట్లలో వుండి, యమయాతనలకు లోనుగావలసిన నరులారా – క్రీస్తు ప్రభువు లేచాడు. మన ప్రభువు లేచిన విషయం విని మీరు ఆనందించండి. మానవులందరికీ కల్యాణ దినం యీరోజు')

ఫౌస్టు

ఎంత శ్రావ్యమైన గానము! ఆ దేవదూతల గాన మాధురి యీ విషపాత్రను నాకు దూరం చేస్తున్నది. శక్తిమంతమైన గానమెప్పుడూ మధువు కంటె తియ్యగా వుంటుంది. చర్చి గంటల గతిగమకాలలో శబ్దంలో ఎంతటి లయ – ఎటువంటి సునాదమూ – వున్నాయి. మానవ బంధాలు సళ్ళింపజేసే దేవదూతల మధుర గానం ఈ ఈస్టరు పర్వములోనే విననవుతుంది. ప్రభువు సమాధికి ప్రదక్షిణంగా ఈ దేవదూతలు పాడిన దివ్యగానం – మానవ హృదయధ్యానగానమే అనవచ్చు. ఈనాటితో ఒక నూతన శకమే ఆరంభమవుతుంది.

(ఇంకా బృందగానం వినబడుతోంది)

ఫౌస్టు

మీరందరూ ఎవరు? అశరీర శక్తులారా – మీరు స్వర్గంనుంచి వచ్చారా? మీ గాన మాధుర్యం వింటుంటేనే అందులోని గాంభీర్యతకూ, మధుర రసానుభూతికీ, ఈవృద్ధుని హృదయం పులకిస్తున్నది. నన్ను కనికరించి ఈ దివ్య

గానం వినిపిస్తున్నారా? ఎంతోకాలంగా ప్రతి ఈస్టరు పండగనాడూ మీ దివ్య సందేశం వినే నావంటివారు, మీ గానాన్ని నమ్ముతారు అశరీరవాణి దివ్యగానం నావంటి వృద్ధులకు మాత్రమే వినపడుతున్న దీరోజులలో. నేటి యువతీ యువకులకు, బాల బాలికలకు అటువంటి నమ్మకం లేదు వయస్సులో వున్నపుడు నేను – ఈ ఈస్టరు దివ్య గానానికి అలవాటుపడినందుచేత ఇప్పుడూ నా చెవికి సోకుతున్నది. ఈ దివ్య గానంతోపాటు ఆనాటి దివ్య స్మృతులన్నీ నా కనులముందు వరుసలు వరుసలుగా నిలు స్తున్నవి. ఆ నాదోపాసనలో ఏదో పరిపూర్ణత వున్నది. ధ్యానముద్రవల్ల అలౌకికానందపు తీవ్రత హెచ్చుచున్నది. ఈ ఇరుకు గది వదిలిపెట్టి, విశాలమగు అరణ్యాలలో, నిండారిన బయళ్ళలో, విస్తర ప్రకృతిమధ్య విహరిస్తూ చుట్టూవున్న ఈ గోడలు మర్చిపోవాలనిపిస్తున్నది. ఈస్టరు పాట యౌవనకాలంతోపాటు బాల్యక్రీడలను జ్ఞప్తికి తెస్తు న్నది ఈ జ్ఞాపకాలు ఒకవిధంగా మనసుకు లంగరు వంటివి. మనో నౌకను ఇష్టంవచ్చినరీతిని ప్రయాణం చేయనియ్యవు. ఈ భూమిమీదినుంచి ఎక్కడికో ఎగిరిపోవాలనిపిస్తున్నది. కాని భూదేవి నన్ను ఎంతో కరుణతో పెంచి పెద్దచేసి, ఎదిగిన కొడుకును విడలేని మాతృమూర్తివలె విల పిస్తున్నది. ఎట్లు పోను? ఎక్కడికి పోను? ఈ మాతృ ప్రేమానుబంధాలనుంచి,–

(పక్కనున్న చర్చినుంచి ఈస్టర్ గానం వినబడుతూ వుంటుంది)

# ఊరి బయట

(పండుగనాడు ఊళ్లో జనం – పిల్లా పెద్దా, భాగ్యవంతులూ, బీదలూ అందరూ ఆ ఈస్టరునాటిపుదయం ఊరుబయట విహరిస్తున్నారు)

మొదటి జట్టులో ఒకడు

ఎక్కడికి అలా హడావుడిగా వెళ్తున్నావు?

ఇంకొకడు

అదిగో కనబడుతున్న ఆ వేటస్థలానికి. రా నీవు నీవుకూడా – వెళ్ళుదాము.

(మరో జట్టులో యిద్దరబ్బాయిలు)

మొదటి అబ్బాయి

ఆ చెరువు వద్దకు వెళ్దాం పద.

రెండో అబ్బాయి:

ఆ దారి బాగాలేదు. ఎందుకలా వెళ్ళడం?

మొదటి అబ్బాయి

అయితే ఏం చేదాం చెప్పు?

మరో అబ్బాయి:

అందరూ వెళ్తున్నదారినే మనమూ వెళ్ళుదాము.

ఒక పెద్దమనిషి

ఈ దారిన తిన్నగా వెళితే కోటకి సమీప గ్రామం వస్తుంది. అక్కడ బలేచక్కని అమ్మాయిలు వుంటారు, మింటి చుక్కలు నేలమీద అవతరించినవేమో అనుకో వలె. మదిరా మధుపానమూ - ఈ రెండూ లేకపోతే పండుగేమిటి నా మొహం?

మరొకడు

ఇంకా నీకు సరదాలు తీరినట్లులేదు. ఎన్నిసార్లు చివాట్లు, బడితపూజలూ జరిగినా నీ అలవాట్లు మానుకోవు. నేనురాను అటువంటి దిక్కుమాలిన చోట్లకి.

ఒక పనిపిల్ల

నేనూరాను వెనక్కు తిరిగి వూరికి వెళ్ళిపోతాను.

ఒకరు.

మనకి కావలసినవాళ్ళు ఆ చెట్లదగ్గిర తప్పక కన బడుతారు.

ఇంకొకరు

అలా వెతకడం సుతరామూ యిష్టములేదు. కావలిస్తే వాళ్ళే వెతుక్కుంటూ వస్తారు. మనం వెతుకుతూ పోవడమేమిటి?

ఒకడు

మా నేస్తం యీనాడు ఎలా వుండగలదు తోడు లేకుండా! తోడులేని బతుకు ఎంతకష్టం - ఎంతకష్టం?

విద్యార్థి

బుర్రల్లో యివాళ ఎందుకనో మెరుపులు మెరుస్తు న్నాయి. అమ్మాయి, ఓ అమ్మాయి! నీవు నా వెంటవచ్చావా మనమిద్దరం తిన్నగా ఆ హోటల్ కి వెళ్ళిపోవడమే. లోకంతో మన కెందుకే లోలాక్షీ!

పట్నవాసపు అమ్మాయి

ఆ కనబడే యువకుడు ఈపూట కాలక్షేపానిః బాగానే వున్నాడు. ఫరవాలేదు. జోడుగా తోడుగా వుంటాడు. ఇదేమిటి యీ రోజుల్లో ఆడపిల్లలే మొగవాళ్ళ వెంటపడుతున్నారు!

ఇద్దరు విద్యార్థులు ఒకరితోనొకరు

ఏమిటా పరుగులు? ఎందుకలా పరుగెత్తటం. ఎవరా పడుచు పిల్లలు? అందులో ఒకమ్మాయి మా పక్కింటివాళ్ళ అమ్మాయిలా వుంది. ఏమినడక! ఏమి వయ్యారం! హంసలలాగే నడుస్తాయికాబోలు. అటు పోదాంపద.

మరొక విద్యార్థి

ఆడపిల్లల వెంటబడటం నాజూకు కాదురా నాయనా! నువ్వు వెంటపడ్డట్టు వాళ్ళకు తెలియకూడదు. ఏదో కొంప మునిగిపోయే పనిమీద వెళ్తున్నట్లు పోజు వెయ్యాలి.

ఒక పట్టణవాసి

ఈ కొత్త ఛైర్ మెన్, నాకెంతమాత్రం నచ్చడం లేదు. ఎంతపనైనా యిట్టే చేస్తానంటాడు. ప్రతిసారీ తను చేయబోయే పనులు పదేపదే వర్ణిస్తాడు. చివరికి ఏం చేస్తాడో చూడాలె.

(బిచ్చగాడు పాటలు పాడుకుంటూ వుంటాడు)

మరో ఆయన

ఆస్తి పాస్తులు లేని ఆ బీదలు నిష్కాములు. వారు మనకంటె సుఖులు వారి వాతావరణంలో శాంతివుంది. వాళ్ళ జీవన విధానానికి మనమెందుకు అడ్డురావాలె? వాళ్ళ బీదరికం వాళ్ళనుభవించనీ. అది మన జోలికి రాకుండా చూచుకుంటే చాలు.

ఒక ముసలాయన

ఏం పిల్లా, అంత జోరుగా ముస్తాబు చేసుకు కులుకుతూ ఎక్కడికి బయలుదేరావు? ఆహా! నీవంటి వన్నెల విసనకర్రని చూచి మూర్ఛపోని మనిషుంటాడా? నీవు శాసించిన ప్రకారం నడుచుకోవాలని కనిపెట్టుకుని వుంటారు పురుషులు.

అమ్మాయి

ఆహా! బాగుంది తాతా. వయసు వస్తున్న కొద్దీ సరసమెక్కువవుతున్నది. కాని నీవంటి పెద్దవాడు నా అండన లేకపోతే ఆ కుర్రకారు నన్ను బ్రతకనిస్తుందా?

పండుగనగా పవిత్ర దీక్షతో గడుపవలసిన దినం. కాని యీ యువకుల ధ్యానమంతా ఎంతకీ పండగమీద కాదు ప్రేమసరాగాలమీద!

మరొక అమ్మాయి.

విన్నావటే చెల్లీ – అంజనంలో నాకు కాబోయే భర్తని చూపించాడు అతను. ఎంత బాగున్నాడనుకున్నావు వరుడు. ఆ పటకా, ఆ తుపాకీ ఆ డ్రస్సూ, మూడు మూర్తులా సోల్జరే! అటువంటి స్వప్న పురుషుని కోసం కళ్ళు కాయలు కాచేలాగా వెతుకుతున్నాననుకో. ఆ మహాను భావుడు అంజనంలో కనబడుతాడు కాని, ప్రత్యక్షంగా ఎందుకు కనపడడో?

(ఒక సోల్జర్ల గుంపు సరసోక్తులు వెదజల్లే గేయంపాడుకుంటూ అటువైపుగా వెళ్ళారు. ఫౌస్టు, వాగ్నర్ ప్రవేశం)

ఫౌస్టు

వసంతకాలం ప్రవేశించింది. ఎటుచూచినా ప్రకృతి రమణీయకాంతులు వెదజల్లుతూ నేత్రపర్వంగా వున్నవి. చలికాలం అంతరించింది మంచూ చలీ రెండూ మాయమై వాటిస్థానంలో సూర్యకాంతి పచ్చిక బయళ్ళూ భూమిని వెల్గిస్తున్నది. సూర్యుడు తన కిరణకాంతులతో గుప్త హృదయాలను పులకరింపజేస్తున్నాడు తోటలు ఫల భారంతో ముగ్ధమోహనంగా కనబడుతున్నాయి. ఆ లో లోయలూ, కొండలూ, అడవులూ మనస్సును వింతకోర్కె

లతో సంతోషపరుస్తున్నాయి. ఈ లేతఎండలో సూర్యకిరణ హాసంలో ఎంత సౌందర్యం! ఎంతటి సంగీతం ఇది పండగ రోజు. ప్రభువు మృత్యువుని జయించి, మృత్యుంజయుడైన దివ్యదినం. ఆ ప్రభువువలెనే యీ సమస్త ప్రపంచంకూడా చలిచీకట్ల గుప్పెటలో నుంచి, వెచ్చని వెలుగు రేఖల వైపుగా పయనిస్తున్నది శీతలమయమై పోయినలోకంలో వెచ్చదనం నెమ్మది నెమ్మదిగా వృద్ధిచెందుతున్నది. వెలుగుకు కరువు వాచిన వీధులన్నిటినీ సూర్యభగవానుడు తన కిరణజాలంతో కమ్మివేస్తున్నాడు లోకమే ఒక వెలుగు పంట అవుతున్నది. ఏమిటా జనం? ఎందులకా కోలాహలం? ఎందుకు ప్రజలలా ఆనందపరవశులై పరుగులెత్తుతున్నారు? ప్రకృతిలోవచ్చిన మార్పే వారి హృదయసీమలలో నాట్యమాడుతున్నదా? నిన్న మొన్నటివరకూ మంచుగడ్డవలె, కరుడుకట్టుకొని పోయిన ఈ నదీ ప్రవాహం, ఆనందాతిరేకంలో తన్మయులై యున్న జనసందోహాలని ఎలా నౌకాయానంలో వోలలాడిస్తున్నదో చూస్తున్నకొద్దీ యీ వృద్ధ హృదయానికి మాటలకందని రసానుభూతి కలుగుతున్నది. ఈ నదులు దాటాలని, అ నౌకా విహారంలో తమ చింతలను మరిచిపోవాలని, సామాన్యప్రజలు ఎంత ఆరట్లాడుతున్నారో! ప్రజల కందరికీ యిది పండుగదినం. దైనందిన జీవిత బాధ్యతలనుంచి ఒక ఆటవిడుపు. నేను వారిలో ఒకడినై, వారితో కలిసిపోయి, మహా సంగీతంలో ఒక స్వల్ప

స్వర్గంలాగా, మహార్ణవంలో ఒక చిన్న కెరటంలాగా రసా నందం పొందడంలో తప్పేమున్నది?

(నిమ్మచెట్టు దగ్గిర ఆగుతారు)

వాగ్నర్.

మీవంట వారితో యిలా బయలుదేరడం నిజంగా నా అదృష్టం. ప్రజలలో కలిసి తిరిగి తేతప్ప, వారి సమస్యలు వారి భావనలు నాకు తెలియవు. ఒంటరి నడక, ఒంటరి జీవితము, జీవిత గమ్యాన్ని జేర్చవు. కాని యీ ప్రజలూ, యీ రైతులూ, యీ శ్రమ జీవులూ ఎందుకలా అరు స్తారు? వారి మాటలలో పిలుపులలో మృదుత్వము ఎందుకు లోపిస్తున్నది? వారి పాటలు మొరటుగానూ, మాటలు కటువుగానూ నా చెవుల్లో పడుతాయి. అలా ఆటవిక నృత్యం చేస్తూ ఆ గెంతడంలో తమనితాము మైమరచిపోవడం పామర జనానికే సాధ్యం. మనవంటి చదువుకొన్నవాళ్ళు, వాళ్ళతో కలవలేరు. పైకి కాసేపు కలిసినా మనసులు అతుక్కొనక దూరమైపోతాం.

(ముసలిరైతు ప్రవేశం)

ముసలి రైతు

మీరు యీ శుభ వేళ మా యింటిక రావడం నిజంగా మా అదృష్టమే, వెనుకొక సారి మీరు యీ పరిస రాలకు వచ్చారు. మీరు మరచిపోయి వుండవచ్చు. కాని మాకది పర్వదినం. మీరు ప్రాణదానం చేసినరోజు. మీ తండ్రిగారు ఎటువంటివారో, వారు వైద్యంలో ఎంత ఖ్యాతి

కులో మా గ్రామ ప్రజలకు తెలుసు. ఏ పుణ్యలోకాన వున్నారోగాని వారు, ఆ ధర్మాత్ముని మేము తలచుకుంటూనే వుంటాము. ఆ రోజుల్లో మీరు చాలా చిన్నవారు. అయినప్పటికి మీ గుండెధైర్యం గొప్పది. రోగులకి సేవ చెయ్యడంలోనూ, అవసానదశ అనుకున్నవారికి కూడా ప్రాణాలుపోసి బతికించడంలోనూ పితృదేవులకు మీరెంత మాత్రం తీసిపోరు. ఆపత్కాలంలో ఇతరులకు సహాయం చెయ్యడమనేది మీ వంశ సంప్రదాయం

(మరికొందరక్కడికి చేర్తారు)

అందరూ

జై డాక్టరుగారికీ జై! డాక్టర్ ఫౌస్ట్‌కూ జై! డాక్టరుగారెప్పుడూ ఆయురారోగ్యాలతో వుండాలె.

ఫౌస్టు

(వారిని వారిస్తూ) నాదేమున్నది అమాయకులారా! నన్ను మీ సేవకై నియోగించిన ఆ జగత్ ప్రభువును ప్రస్తుతించండి. మనమందరమూ ఆ కరుణా సముద్రుని సంతానం. ఆయన తన యిచ్ఛానుసారం ఆయాపనులు ఫలానావారికని నిర్ణయిస్తాడు. నాదేముంది నాయనా! నేనూ మీవంటివాడినే.

(వాళ్ళదగ్గిర శలవు పుచ్చుకొని ముందుకు వస్తాడు)

వాగ్నర్

ఈ పామరజనుల శ్రద్ధాభక్తులు చూస్తూవుంటే మీరు పండితకోటిలోనేకాక, ప్రజాసామాన్యానికికూడా

పూజనీయులైనారని చెప్పక చెప్పే నిదర్శనము లభిస్తున్నది. స్వధర్మాచరణకు మీ కటువంటి అవకాశం కలగడం నిజంగా అదృష్టమే! స్వధర్మవర్తనుడే లోకవంద్యుడు. మీలోగల గొప్పదనం ఈ ప్రజలకు తెలుసు. అందువల్లనే ప్రేమభావంతో వారు మీగురించి చెప్పుకొంటున్నారు. ప్రతిఒక్కరూ మీదర్శనంకోసమై ఆరాటపడుతున్నారు. మీరు అటువైపుగా వెళ్ళుతూవుంటే వారు తమ వినోద విలాసాలు కట్టిపెట్టి, వినమ్రభావంతో మీపట్ల మన్నన కనబరుస్తున్నారు. మిమ్మలను తమ హృదయమందిరంలో పూజిస్తూ పుష్పాంజలు లర్పిస్తున్నారు గొప్పవారిని గుర్తించి వారిని ఎలా గౌరవించాలో ఈ గ్రామీణులకు బాగా తెలుసును

(ఇద్దరూ ఒక గుట్ట సమీపిస్తారు)

ఫౌస్టు

(గుట్టదగ్గిర) ఇంకొంచెం దూరం నడిస్తిమా అక్కడ ఒక రాతిబండ కనబడుతుంది నా విరామఘుడియలనేకం, ఆ రాతిబండ సాన్నిధ్యంలోనే గడిపాను. విశ్రాంతి లభించి నప్పుడల్లా నేనిక్కడ నింపాదిగా కూర్చుని నన్ను అశాంతిలో ముంచిన సమస్యల నెన్నింటినో ఆలోచిస్తూ వాటి పరిష్కార మార్గములు వెతుకుతూంటాను. మన ఆశయాలు – ఆదర్శాలు – మనమూహించే బంగారు మేడలూ– మనకు కనపడని అందాల దీవులూ – ఇవన్నీ ఈ రాతి కొండపై కూర్చొని, వాటి స్వరూప స్వభావాలేమిటో ఆత్మ

పరిశీలన చేసుకొంటూ ఈ మేధను ఫలప్రదాయినిగా చేశాను. చేశానని చెప్పుకోవడం కూడా తప్పే. భగవంతుడు చేయించాడు. ఇదంతా ఆ దయామయుని వరప్రసాదం. ఈ సామాన్యులు తమ రోగాలనుంచి నేను కాపాడినానని భ్రమ పడి నన్ను పొగుడుతున్నారు. కాని రోగాలు కల్పించేది, నివారించేది, ఎవరో తెలుసుకోలేక వారు అంధకారంలో తడుముల్లాడుతున్నారు. వాగ్నర్! నీకైనా నేను అర్థమవుతున్నానా? నన్ను నీవు అర్థం చేసుకోగలుగుతున్నావా? శిష్యుణ్ణి అనడమెందుకు? ప్రాణదాత అయిన తండ్రి తనయుని మనోమార్గం తెలుసుకోలేడు తండ్రికి కొడుకు అర్థం కానప్పుడు శిష్యులూ, సన్నిహితులూ గురుజనాన్ని అర్థం చేసుకోగలరా? మా తండ్రిగారు తనకు తెలిసిన మేరలో తాను అద్భుతంగా రాణించారు. దివ్యశక్తులనగా ఏమిటో తెలుసుకోనడానికి చేతనయినంత శ్రమపడ్డారు లోహాలూ రసాయనపదార్థాలూవీటిలోతులు తెలుసుకొని రసవాదంలో మునిగితేలారు ప్రకృతి గర్భంలో నిద్రాణమైన శక్తులనే ఈ రసవాదసాధనతో మేల్కొలిపి, వాటిని వైద్యప్రక్రియకు చక్కగా వుపయోగించగలిగారు రోగులకు ప్రాణం పోసే గరళాలు, వారిని చంపివేసే పాషాణాలు రెండూ ఆయనకు తెలుసును పాషాణానికీ గరళానికీ మధ్యనున్న దూరం స్వల్పం సుమా? ఇటువంటి ప్రమాదకరమైన మందులు తయారుచేయడం హానికరమని ఆయనకు చెప్పగల ధైర్యం ఎవరికున్నది? ఈ ప్రాంతాలకు మహామ్మారి ఒకసారి

చుట్టపుచూపుగా వచ్చింది. ఈ నా చేతులమీదుగా వేల కొలది రోగులకు పాషాణాలు వాడాను. మహామ్మారిని జయించడానికి అదొక్కటే మార్గం. నిష్కర్షగా చెప్పాలంటే వారిని నా చేతులమీదుగా స్వర్గలోకయాత్ర చేయించాను. అలా పాషాణం వాడకపోతే దేశమంతటినీ మహామ్మారి తనపొట్టన పెట్టుకొనివుండేది.

వాగ్నర్

మీవంటి విజ్ఞానధనులు జరిగిపోయినదానికి విచారించడం భావ్యం కాదు, శుభాశుభాలు రెండిటికీ ధైర్యమే ధీరపురుషుని లక్షణం. పితృపాదులపట్ల మీకున్న గౌరవం వల్ల ఆయనచేతలూ భావాలూ, మీరు మీభావమలో అనువదించుకున్నారు. స్వయంకృషివల్ల మీరు మీ విద్యను విస్తృతం చేసుకొన్నారు మీకు సంక్రమించిన విద్యను మీరు మరొకరికి దానంచేసి, ధన్యులవడమేకదా విద్యాగరిమకు గల సార్థకత?

ఫౌస్టు:

విద్యకూడ ప్రవాహం వంటిది. అనుశ్రుతంగావచ్చిన విద్యను నిలబెట్టుకోడం గొప్పకాదు. నీవు నేర్చినవిద్యఅంతా నిన్ను నీవు సంస్కరించుకొనేందుకు, నీలోగల కోరికల బావిలోని నీళ్ళు తోడేటందుకు ఎంతవరకు ప్రయోజనకారి అవగలదు? లోకానికి దూరంగా బ్రతికే మహాపండితుడు, లోకవంద్యుడు కాలేడు. నీ పాండిత్యానికి, నీ విద్యకుగలసార్థకత అది పదిమందికి వుపయోగకరమైనప్పుడే! ఉపయోగార్హం

కాని జ్ఞానసంపద నిస్తేజమైనది. చూడు వాగ్నర్! ఈ మనస్సు ఎప్పుడూ పాదరసంవలె భావాలను స్థిరంగా వుండనియ్యక ఇటూ అటూ కదిలిస్తుది. ఇది నిజమనిపించినపుడు, ఇదే నిజమా అను సంశయం దానికి తోకవలె అవతరిస్తుంది, ఈ ప్రపంచమే ఒక అయోమయం అందుచేత దానిని కొంచెం మరిచిపోతూంటే కాని మనసుకు శాంతి రాదు. ఈ వ్యర్థ ప్రసంగం బదులు ఆ సూర్యాస్తమయ కాంతులు చూడకూడదూ? ఆ సంధ్యారుణకాంతుల్లో గృహప్రాంగణాలన్నీ, నూతన సౌందర్యము వెదజల్లుతున్నాయి. అది అలిసిపోయిన కనులలోకి వచ్చే లేచిరునవ్వు. సూర్యుడుకూడా 'ఈనాటి కార్యభారం తీరింది సుమా!' అన్నట్లు తనకర్మసాక్షిత్వానికి నమస్కరిస్తున్నాడు. ఇంటికి వెళ్ళడమంటే ఆ సూర్యుడికికూడా ఎంత వుత్సాహంగా వుందో చూడు! ఎంతవేగంగా పరుగెత్తుకొంటూ పోతున్నాడో! ఆ సూర్యునితో పాటు వాళ్ళఇంటికి వెళ్ళగలశక్తీ, రెక్కలూ, నాకుంటే! అంత అదృష్టం, మానవ మాత్రులకుంటుందా? పర్వత శిఖరాలకు తన అస్తమయ కాంతులతో వీడ్కోలు చెప్పుతున్న సూర్యుడు, లోయలను ప్రశాంత జగతిలో ముంచి జోలపాడుతున్నాడు. నదులలో నీరంతా కరిగిన వెండివలె వడివడిగా దూసుకు పోతున్నది. కొండ శిఖరాలూ, నదీ లోయలూ ఆకసము వంక దీనంగా చూస్తూ, ఆడుకునేందుకు తారకలని పిలుస్తున్నాయి. సముద్రుడు భూదేవి వైపుగా వుత్సాహంగా

పరుగు పరుగున వస్తున్నాడు. ఈ కొద్ది సేపట్లో చూడు లోకమెంత మారిపోయిందో! ఈ మార్పంతా ఎవరివల్ల జరుగుతున్నది? ఎవరు కారకులు యీ మార్పుకు? ఎవరు జరిపిస్తున్నారీతతంగమంతా? ఏ మహత్తర శక్తి, ఏ దేవతా శక్తి, ఏ యీశ్వరశక్తి, ఏ పరంజ్యోతి ఈ సమస్త లోకాన్ని, లోకాలనూ, భూనభోంతరాళాలనూ, గ్రహకూటమునూ, విశ్వాంతరాళాన్ని, చైతన్యవంతం చేసి నడిపిస్తున్నది? ఈ కనిపించే చైతన్యాన్ని మన నేత్రాలు చూడలేకపోతే, ఈశ్వరుని రూపంకాని, ఆయన కరుణకాని మనకేం అర్థమవుతుంది? ఈ ప్రకృతి చిత్రపటాన్ని చూస్తూ తన్మయమవడంవల్లనే కాబోలు, ఆకలి దప్పులు తెలియటంలేదు స్వర్ణదీప్తుల ప్రవాహాన్ని నా దప్పిక తీరా తాగుదామనుకున్నాను. నిశీధి నన్ను ఆవరిస్తున్నది నాలోని సుందర స్వప్నం సంధ్యాకాంతులతో కరిగిపోయింది. ఈ పాంచ భౌతిక శరీరాన్ని పరుగెత్తించగల దేవతా శక్తులు చుట్టుపట్టుల ఎక్కడా లేవు. కాని నాలో ఏదో కనరాని వుద్వేగం, ముందుకు త్రోసే వుద్వేగ భావం, ఈ వినీలాకాశ పథాన్ని నాకు చూపుతూ, నన్నందులో పార్లిస్తున్నది సంగీత పక్షి ఆకాశమండలంలో రెక్కలు రెపరెపలాడిస్తూ శ్రావ్యగానం చేస్తున్నది. పెద్ద పక్షి తన విశాల దేహంతో బయళ్ళమీద, చెరువులమీద ఎగురుతూ తన పాట తాను పాడుతున్నది. గృహాభిముఖంగా పోయే కొంగల బారులో కూడ గానమేకదా!

వాగ్నర్.

ఒక్కొక్కసారి నా మనసులోకూడా కానరాని ఆశలు చిగురించి నన్ను విభ్రమంలో ముంచుతవి. కాని మీకుగల తీక్షణత నాకు లేదు. నిరంతరమూ చూస్తూ వుండడంవల్ల, ఈ కొండ కోనలూ వ్యవసాయక్షేత్రాలూ నాకేమీ నూతన సందేశం చెప్పవు. పక్షులకు రెక్కలు గలవని యీర్ష్య నాకు లేదు. నా అధ్యాస ఎంతకూ ఈ గ్రంధాలమీదనే. ఆ పుటలలో, ఆ పంక్తులమధ్యగల, ముత్యాలకోసమే! ముఖ్యంగా చలికాలపు రాత్రులందు గాలి దేవుడు ఈలలూదుతున్న వేళ, వెచ్చగా కూచుని, మనలను ఆనందతరంగాలలో తేలియాడించే పుస్తక పుటలతో కాలము గడుపుతున్నప్పుడు ఆ స్వర్గతలమే ఈ భూమిమీద అవతరించిందా అనిపిస్తున్నది.

ఫౌస్టు

నీ పరనాసక్తి నిన్ను ఒకవిధంగా బందీని చేసింది. నీకు ఏకాగ్రత నిస్తున్నది. కాని నాలో రెండు క్షుభిత హృదయాలు వున్నవి ఈ రెండు తీవ్రశక్తులమధ్య నిరంతరమూ పోరాటం జరుగుతూనే ఉంది. సమయా సమయాలనుబట్టి ఈ రెండింటిలో ఏదో ఒకటి పై స్థానం ఆక్రమిస్తున్నది. నాలోగల ఈ రెండు శక్తులలోనూ ఒకటి నిరంతరమూ ప్రేమకై కాంక్షిస్తూ, జ్ఞానేం ద్రియాల ద్వారా ఈ సువిశాలప్రపంచాన్ని, తన కౌగిలి లోకి తీసుకొన్నది. ఇక రెండవదివున్నదే అది దూరతీరాల

కోరకూ, కనపడని శక్తులకోసమూ, భౌతిక బంధాలనుంచి విముక్తికోరకూ ఆక్రోశిస్తూ, మర్త్యలోకానికీ, అమరలోకానికీ మధ్య వూగిసలాడుతున్నది. ఆ రెండవశక్తిని ప్రకోపింపజేసేది, ఏవో భూతాలని నా అనుమానం. కాని ఆ భూతాలు కూడా నాలో ఒక భాగమే! ఐంద్రజాలికశక్తులు నాకు వుంటేనా ఒక్కక్షణంలో దేశదేశాలూ సందర్శించి వుండేవాణ్ణి. నాకాశక్తి ప్రసాదించగల రక్షవుంటే, నేను దానిని రాజాధిరాజుల చీనిచీనాంబరాలకు గాని, వారి రత్నఖచితసింహాసనాలకు గాని పణం ఒడ్డివుండేవాణ్ణి కాదు.

వాగ్నర్

మీరు ఎటువంటి శక్తులతో ప్రమేయం పెట్టుకొన్నా ఫరవాలేదు కాని - దుష్టశక్తులను మాత్రం ఆహ్వానించకండి. ఇప్పటికే లోకంలో దుష్టత్వం పెరిగిపోయింది ఉత్తరదిశగా కోరలు చాచుతున్న పిశాచాలు దారులేలుతూ కత్తులవంటి తమనాలుకలతో మానవాళిని బెదిరిస్తాయని అంటారు. మిట్టమధ్యాహ్నం వేళ ఎడారియిసుకకు వేపడం పెట్టి, మధ్యందినభూతాలు మానవ కపాలాలనే పీల్చివేస్తాయంటారు. పడమటినుంచి వచ్చే భూతగణం పచ్చికబయళ్ళను పంటపొలాలను చీడపురుగులతో నింపి మన చెప్పు చేతలలో వున్నట్లు నాటకమాడుతూ చివరకు మననే బలిగొంటాయంటారు. భూతశక్తు లెప్పుడూ భగవంతుని సృష్టిసౌందర్యాన్ని ధ్వంసం చేస్తాయి. వాటిబుద్ధే అంత. ఒక్కొక్కసారి అవి దేవతలవలె మృదువైనభాషలో

ప్రసంగిస్తూ మనను మోసం చేస్తాయి. ఇక పోదాం. చీకటి పడుతున్నది. గాలిలో చల్లదనం పెరుగుతున్నది. చుట్టూ పొగమంచు తెరలు కమ్ముకొంటున్నవి. గృహవాటిక ఈ సంధ్యాకాంతిలో మనకోసం తలుపులు తెరిచి ఎదురు చూస్తూ వుంటుంది. ఎందుకీ ఊరుబయట? ఎందుకీ నిర్భేద్యమగు మాయాజాలంలో? ఈ పొగమంచులో మీకేం కనబడుతున్నది?

ఫౌస్టు

ఆ దూరానగల పొలంలో నుంచి నల్లకుక్క ఒకటి ఇటు వస్తున్నది చూడు!

వాగ్నర్

ఆ కుక్కను నేను చాలాసేపు కిందటే చూశాను. కాని దానిని గురించి ఆలోచించ వలసినది ఏమున్నది?

ఫౌస్టు

కొంచెం జాగ్రత్తగా చూడు అది ఎలాంటి కుక్కో చెప్పు

వాగ్నర్

ఎలాంటి కుక్కేమిటి? జాతి రకం కుక్క తన యజమాని ఎక్కడ వున్నాడోనని వాసనపట్టి వెతుక్కుంటూ వెళ్లుతూ వుంది.

ఫౌస్టు

ఆ కుక్క మనవంక చూస్తూ అక్కడనే వలయాకారంగా తిరుగుతూ వుంది. ఆ శునకం చుట్టూ ఆ చిన్న

చిన్న అగ్ని నాలుక లేమిటి? నా కండ్లకు భ్రమ కలగటం లేదుకదా! ఏమిటా మంటలు ఆ కుక్క చుట్టూ!

వాగ్నర్

మీ కేదో దృష్టిదోషం కలిగినట్లుంది. అది నల్ల కుక్క! నిక్షేపంగా నల్లగా మొద్దులా కనిపిస్తున్నది.

ఫౌస్టు

ఆ వలయాకారపు పరివర్తనలో నాకేదో భూత భవిష్యత్ ద్వంద్వాలు స్ఫురిస్తున్నాయి. ఆ కుక్క ఏదో వలలో నుంచి తప్పించుకోడానికి పడుతున్న తాప త్రయంలా వుందది.

వాగ్నర్

నల్లకుక్క తన యజమానిని వెతుక్కొంటున్నది. యజమానిని వెదుక్కోవడం దాని స్వభావ నైజం. ఇక్కడ యీ కొత్తవాళ్ళిద్దరూ ఎవరా అని అది కొంచెం చికాకు పడుతున్నదేమో!

ఫౌస్ట్

ఆ వలయం చిన్నదైనందున కుక్క మన దగ్గిరగా వస్తున్నది.

వాగ్నర్

కుక్కండి! అది ఒట్టి కుక్క. అదేమీ ప్రేతమూ పిశాచమూ కాదు. చూడండి. అది ఎలా మొరుగు తున్నదో! దాని తోక ఎలా ఆడిస్తున్నదో. అవన్నీ శునక లక్షణాలు

ఫౌస్టు

శునకమా! ఇటు మావద్దకు రా

వాగ్నర్

దానివన్నీ కుక్క బుద్ధులు మీరు పిలవకుండా వూరికె వుంటే అది అక్కడ దూరంగా నిలిచి వుంటుంది పిలిచారా తోక ఆడించుకొంటూ గంతులు వేస్తూ వస్తుంది మీరు మీ వెంట రమ్మంటే వస్తుంది. కర్రతో అదమా యించేరా, పోతుంది. ఈ చేతికర్ర అలా విసిరితే దానిని అది పట్టుకొనివచ్చి యివ్వడమనే ఆట అది బాగా ఎరుగును.

ఫౌస్టు

వాగ్నర్! నీవు చెప్పినదంతా నిజమే. ఈ కుక్కలో మాంత్రిక శక్తులేవీ లేవు. సర్వసామాన్యమైన కుక్క.

వాగ్నర్

యజమాని చెప్పినట్టు వింటూ అతని తరిఫీదు ప్రకారం నడుచుకొనే కుక్క పెద్దల గౌరవం విధిగా పొందుతుంది. ముత్యాలలో ఆణిముత్యం వెతికినట్లు, ప్రతి జాతిలోను ఉత్తమోత్తమమైనవి ఏరినట్లు యీ కుక్కపిల్లకు కూడా పండితులంటే యిష్టమనుకొంటాను. ఎవరు పండితులో గ్రహించేపాటి బుద్ధి దానికి వాళ్ళ యజమాని నేర్పి వుంటాడు

# ఫౌస్ట్ గదిలో

(ప్రశాంతమైన రాత్రివేళ – గుమ్మంవద్ద కుక్క)

ఫౌస్టు

ఏయ్ కుక్కపిల్లా! ఎందుకా గదిగుమ్మం దగ్గిర తారట్లాడుతావు? స్థిరచిత్తం కోల్పోయిన శునకమా నువ్వు విహరించడానికి అనువైన స్థలం కాదిది. అదుగో ఆ సోఫాలో పడుకో. దారి తప్పిన పాంథునివలె తిరగక నిప్పు గూడుపక్కన వున్న ఆ సోఫాలో వెచ్చగా పడుకో! నీవు మేలుజాతి కుక్కవలె వున్నావు అక్కడ ఆ కొండలమీద నీ ఆటలెన్నో ఆడినావు ఈ రాత్రికి నా అతిథివి అతిథి మర్యాదగా నీకు ఆ సోఫా యిస్తున్నాను. వెచ్చగా అందులో పడుకో ఈ నా చిన్న గదిలో దీపం నిశ్చలంగా వెలుగుతున్నది. మెత్తనికాంతి నా మనస్సును మృదువుగా తాకుతున్నది, మనో నైర్మల్యం వల్ల మానస కాసారంమీద ప్రతిబింబించే చంద్రకిరణాల ప్రభావంతో హృదయ కవాటం తెరచుకొంటున్నది. ఈ పుష్పబాల అంతరాంతరాలకు ఏదో లేతకిరణం ఆశాకిరణమై తగులుతున్నది. నా హేతుజ్ఞానం జీవన భాండారాన్ని మించినది ఏదీ లేదంటున్నది. కాని యీ జీవితపు

కూపాలలో జలపుట్టించేది - ఏదో బ్రహ్మాండమైన ఒక దైవికశక్తి.

(కుక్క మొరుగుతుంది)

ఏమది ఏయ్! ఇంత ప్రశాంతసమయాన్న అలా మొరగకు అతిథివిగాన నీవు నీ మర్యాద నిలబెట్టుకో. నీ అరుపులు నాగదిలో ప్రతిధ్వనించి సౌందర్యమయ వాతావరణాన్ని వికృతపరుస్తున్నవి. ఈగది నాది. నాకొక్కనికే ఇందులో నివాసం. నీకు మల్లె అరిచే మనుష్యులు లేకపో లేదు. అందమైనవి, మంచివి, అర్థంగాక వాళ్ళు మొరుగుతారు. సౌందర్యమూ, సౌశీల్యమూ అర్థంకాకపోతే వాళ్ళ బ్రతుకెందుకు, ఏడవనా? ఇంతమంచి పుట్టుకపుట్టిన కుక్కలు కూడా ఆ మొరిగేజాతితో కలిసిపోవటమేనా!

కుక్కపిల్లా! నువ్వు ఈ పూటకు విశ్రాంతి తీసుకో. విశ్రాంతిలో వున్న తృప్తి ఎందులోనూ లేదు నీకూ నాకూ మధ్య ఏర్పడిన స్నేహం, ఇంతత్వరలో సమసిపోవాలా? మానవుడెప్పుడూ దప్పిగొన్న బాటసారి కాలమూ, అనుభవమూ అతా నిజాన్ని పదేపదే గుర్తుకు తెస్తూంటాయి. అప్పుడప్పుడు అతని విషాదాలలోనూ ప్రతిఫలం ఏదో కొద్దిగా వుండవచ్చు. కాని జీవులనుసుఖపెట్టేవి చంచలమైన పంథాలు కావు. హృదయవేదనతో ఏదో నూతన సత్యం దర్శనము కావలెనని - ఏదో అపూర్వమైనది తమ బాధలకు బదులుచెప్పాలని వెర్రిఆశతో మూగహృదయాలు ఎదురు

చూస్తూంటాయి. నాకు ఈ సమయాన పవిత్రగ్రంథమయిన బైబిలు ఒక్కటే నిజమనిపిస్తున్నది పవిత్రసూక్తులనగా సత్యాన్ని ప్రేమభాషలో చెప్పే మృదువచనాలు,

(ఒక బైబిలుపుస్తకం తెరచి చదవబోతాడు)

ఇక్కడ ఏమనివ్రాసివుంది? ప్రపంచం పుట్టడానికి ముందు శబ్దం పుట్టింది. అనగా నాదం జనించింది. అలా నిర్ణయించడంలో ఆ శాస్త్రకారుల భావమేమిటో? మాట, పదము. ధ్వని ద్వారా వ్యక్తమయేది శబ్దం. వీటన్నిటికీమూల కారకమైనది నాదం. మాటఅనగా నాదం. నాదం గొప్పది. నిజమే. కాని ఆ నాదం అనేమాటకు మరొక అర్థంతియ్యాలని పిస్తున్నది. సృష్టి ప్రారంభాన ముందు జనించింది నాదం కాదు, భావం కాని ఏదిముఖ్యం? భావమానాదమా? భగవంతుడు ఇటువంటిది ఒకటి సృష్టించాలని భావించకపోతే– ఈ ప్రపంచం ఎలాపుట్టివుంటుంది? అందుచేత భావానిదే వున్నతపీఠం. కాని బైబిలులో 'నాదం' అని వ్రాసివున్నదే? ఈ విషయమై మళ్ళీ నేను ఆలోచించాలె. బైబిలును వ్రాసినవారు పరమ పూజ్యులు. అయినా నాకు అసలు భావం వల్లనే సృష్టి స్థితి లయములు జరుగుతున్నవా అని పిస్తున్నది. సమస్త చరాచర జగత్తుకూ మూలాధారం భావ బలమేనా? భావం నుండి భావబలము అనగానే శక్తి విషయం స్ఫురణ వస్తూన్నది. ఒకానొక మహత్తర శక్తి వల్ల యీ ప్రపంచ భారం నిర్వహింపబడుతున్నదేమో! అదే నిజమైతే భావంకంటే, నాదం కంటే సృష్టిలో శక్తికి

అన్య స్థానం ఇవ్వవలసి వుంటుంది. చేతిలోవున్న కలం వేళ్ళు చెప్పిన విధంగా గబగబా వ్రాసేస్తున్నది. వ్రాసిన తరువాత ఏదో సంశయం, ఏదో అసంపూర్ణత ఆ వ్రాత నుంచి మనవంక ఎదురు చూస్తవి. సంశయాకుల చిత్తుడనై మార్గమేదో తెలియక ఆరాటపడుతున్నపుడు 'ఇలా చేయి' అని ఏదో ఆత్మశక్తి చెప్పుతుంది. చూడగా చూడగా ఈ ప్రపంచ సృష్టికీ నిర్వహణకూ, మూలాధారమైంది కర్మ. అంటే బాధ్యత అని తేలింది. స్వకర్మ ఆచరించడం అనగా చివరకు నాదమూకాక, భావమూకాక శక్తీకాక కర్మయే ప్రధానమూ అనిపిస్తున్నది.

ఓ కుక్కపిల్లా! మనమిద్దరం యీ గదిలో స్నేహితులవలె వుండదలచుకొంటే నీవు మొరగడం, ఏడవడం మొదలైన పిచ్చి పనులు మానివెయ్యాలె. దయచేసి మానుతావా – మానవా? పనికట్టుకొని నిన్ను తీసుక వచ్చినందుకు నా ప్రశాంతిని భంగపరుస్తున్నావు. నీలాటి ప్రాణిని నేను తోడుగా స్వీకరించలేను. అందుచేత మనిద్దరిలో ఎవరో ఒకరు యిక్కడనుంచి వెళ్ళిపోవాలె. నీవు అతిథివి గనుక నేనే వెళ్ళిపోవాలె. కాని శునకదేవతా, నాకు వెళ్ళడమిష్టంలేదు నేను నిన్ను తరిమి వెయ్యనూలేను. అందుచేత నీవు మంచి కుక్కపిల్లవై – ఆ తెరిచివున్న ద్వారం గుండా బయటికిపోయి – నీ మార్గం నీవు అనుసరించు. నా ప్రశాంతత నాకు మిగులుతుంది దయచేయి బాబూ, నీకు పుణ్యముంటుంది. ఆరె! ఇదేమి తమాషా!

ఈ కుక్కపిల్ల ఏదో వింత ఆకృతి ధరిస్తున్నదే! ఇది భ్రమా, వాస్తవమా! నా కండ్లముందే దీని ఆకారం అంత పెద్దదయిపోతున్నదే? కుక్కలెక్కడా ఇంత ఎత్తైన వుండవే! చూస్తుండగా యిది ఏనుగంత ఆకారం దాల్చింది ఏమిటిది? ఆ పెద్ద పెద్ద చెవులు, ఆ చెవులు వ్రుక్షుకూ మంటలు విసురుతున్నట్లు – ఎందుకు నావంక కోపంగా తీక్షణంగా చూస్తున్నది? ఆహా! ఎటువంటి అతిథివి! నేను చేజేతులా తెచ్చుకొన్నాను. ఈ రహస్యమేదో తెలుసుకొని తీరాలె. ఈ రాత్రి నాకేదో మానవాతీతమగు అనుభవం కలగాలె. ద్వారంవద్ద ఏదో ఆకారం ప్రత్యక్షమవుతున్నది ఎందుకోసమో నేను బందీనయిపోయినాను. నాకు తెలియని దానికి దేనికో బానిసనైనాను. బోనులోపడ్డ నక్కవలె, వలలో చిక్కుకొన్న జంతువువలె గిజగిజ లాడుతున్నాను. పైనా, కిందా, చుట్టూ తిరిగే అదృశ్య శక్తులారా! నన్ను యీ బంధంనుండి తప్పించండి. భూతములారా! ఈ యినుపకట్లు విప్పి కాపాడండి ఈ ఫౌస్ట్ స్వర్గ నరకాలను ఒకేవిధంగా ఆరాధించేవాడు. ఇతన్ని యీ బంధాలనుండి విముక్తి చేయండి. మొదట నాకు కనబడింది జంతువు మంత్ర తంత్రాలతో అది బృహదాకారం దాల్చింది దీనిలో ప్రకృతి శక్తుల తీవ్రత వున్నట్లుంది. దీనికి పిశాచాల పట్టుదల వున్నది. అగ్నిజ్వాలలో ఇది మాయమగుగాక! తారకల కాంతిలో అదృశ్యమగుగాక! నదీప్రవాహపు తీరాల

ఇసుక రేణువులలో నామరూపాలు లేకుండా పోవుగాక! దేవతాశక్తులారా, నాకు సాయంగావచ్చి నన్ను కాపాడండి. ఆధిభౌతికశక్తులు నాలుగూ కుక్కవలె కనిపించే-యీ చిన్న పిశాచాన్ని ఒక భయంకరాకారంగా మార్చినవి నా యిచ్ఛానుసారం, నేను శాసించింది జరుగుగాక! భగవంతుడు నావంటివాణ్ణి కాపాడనిచో యీలోకంలో మిగిలేది నరకమే ఈ గుర్తులు శనేశ్వరునివి భూత ప్రేత పిశాచ గణాలకు అధిదేవత ఆ శనిమహారాజు ఆ శని ఆవహిస్తే ముందువుండేది వినాశమే అతడు మన దృష్టినీ, మనస్సునూ మిక్కిలి నేర్పుతో స్వాధీనం చేసుకొంటాడు. మన ఆత్మను తన గుప్పెట్లో పెట్టుకొని నలిపేద్దామనుకొంటాడు. గుండెలలో గాకులు పొడిచి భగవంతునికి దూరంచేస్తాడు అతని మాంత్రికశక్తినుండి తేరుకొంటేనే బ్రతకగలం కాని శనేశ్వరుడు యీ ప్రపంచమును చక్కగా పాలిస్తూ వుంటాడు ఆ నీడలో, ఆ నిప్పుకణంలో పైకప్పుమీద, ఎటుపడితే అటు తన దుష్టశక్తులద్వారా, విజృంభిస్తాడు నాలమూండర్, మంటల్లో మాయమయిపో. హుండెనా, నీ పరివారంతో తోకముడు. ఇలిఫ్, వుల్కవలె దేదీప్యమానంగా మెరుస్తూవుండు. సమయానికి తోడ్పడటం మీపని. మంత్రకాళీ, నీవు నిష్క్రమించు. ఈ నాలుగు మంత్రశక్తులూకూడా ఆ బృహదాకారం మీద ఏమీ పనిచేయడంలేదే నా మంత్రప్రభావం నీమీద పనిచేయదా? ఐతే నేను చెప్పేది విను. సావధానంగా విను

సూటిగా జవాబు చెప్పు. నరకంనుండి పారిపోయివచ్చిన పిశాచానివికావా నీవు? ఈ 'రక్ష'ను చూడు దీనికి నీవు లోబడకతప్పదు నీవేకాదు, మీ పిశాచ గణమంతా దీనికి లోబడిపోతుంది.

ఓహో! ఎందుకది అలా తలవిప్పుతున్నది! వెంట్రుకలు విరబోసుకొంటున్నది అమాయకులను మందబుద్ధులను నీవు బాధింపగలవు, కాని నీ ఆటలు నాదగ్గిర సాగవు.

ఆశ్చర్యంగా వుందే! ఆ నిప్పుగూడు వెనకకు వెళ్ళి దాగిందే! కుక్కపిల్లలావచ్చి ఏనుగంతరూపం దాల్చింది. ఈ గదినంతా ఆవరించింది బయటకి పారిపోవాలని కాబోలు. మంత్ర శాస్త్రం చదివిన ఈ ఫౌస్టు దగ్గిర నీ వెర్రి చేష్టలు పనిచేయవు. నిప్పుగూడుపైన గల రంధ్రంనుంచి పారిపోవాలనుకొంటున్నావా? నీజిత్తులు నా దగ్గర సాగవు. నా పాదాలమీద పడి వేడుకో చెప్పినట్లు వింటే నిన్నేమీ చెయ్యను నీలో వున్నది పిశాచ శక్తి. నేను భగవచ్ఛక్తి సంపన్నుడను నీవు నాకు స్వాధీనంకాక తప్పదు. ఇటువంటి రక్షరేకులూ మంత్ర తంత్రాలేగాక నాలో ఎన్నో నిగూఢ శక్తులున్నవి. ఇప్పుడు నీమీద ప్రయోగించినవాటికన్న ఎంతో బలమైనవి వున్నవి అయినా వాటిని ప్రయోగించి నిన్ను ఏడిపించలేను.

(కుక్క మెఫిస్టోఫిలిస్ ఆకారంలో గురువుకు శుశ్రూష చేయు శిష్యునివలె ఫౌస్టు ముందుకు వచ్చి నిలుస్తాడు)

ఫౌస్టు

ఎందుకలా అరుస్తావు? ఎందుకని ఈ రాద్ధాంత సిద్ధాంతాలు? ఇంతకూ ఆ శునక రూపం ధరించిన మోసగాడివి నీవేనన్న మాట. ఆహా! ఎన్ని వేషాలు వెయ్యడం నేర్చుకొన్నావు? నా దగ్గిరేనా యీ వెర్రి వేషాలు?

మెఫిస్టోఫిలిస్

మీరు నిజంగా పండితులు మహా పండితులు. సమస్తమూ తెలిసిన విజ్ఞాన ధనులు మీ శాస్త్ర పాటవంతో నన్ను హడలగొట్టి వేశారు

ఫౌస్టు

ఇంతకూ నీవెవరు?

మెఫిస్టోఫిలిస్.

నా నామరూపాలకన్న, నా వెనుక వున్న ముఖ్య శక్తులు తెలుసుకోవాలని తాపత్రయపడుతున్న మీవంటి వారికి నేనెవరినో ఎలా చెప్పను?

ఫౌస్టు

పేరునుబట్టి వ్యక్తిని తెలుసుకోలేని మాట నిజమే! కాని నీవంటివాళ్ళ మాయాజాలం తెలుసుకోవచ్చు. ఇంతకూ నీవెవరు? ఆకాశ మండలంలోని అదృశ్య శక్తివా? సామాన్య మానవులను చికాకు పరిచే భూత ప్రేతానివా?

మెఫిస్టోఫిలిస్

నేను సర్వ శక్తులలో ఒక గుణ విభాగమై నిలుస్తు

న్నాను. చెడ్డలోనూ వున్నాను, మంచిలోనూ వున్నాను. సుజనదుర్జనులిద్దరిలోనూ నివశిస్తున్నాను.

ఫౌస్టు

చూడు. ఆ వంకర మాటలు కట్టిపెట్టి మీలోకంలో నిన్నే పేరుపెట్టి పిలుస్తారో చెప్పు.

మెఫిస్టోఫిలిస్

నేను ప్రతి ఘటన శక్తిని ప్రతిదాన్నీ ప్రతిఘటించడమే నా స్వభావం. సృష్టిగతమైన ప్రతిదీ చిరకాలం అలా అక్షయంగా ఉండిపోతే యీ లోకంలో స్థలం చాలదు అందుచేత సృష్టి ఎంత ముఖ్యమో - లయింప చేయడమూ అంతే ముఖ్యం లయకారక శక్తులలో నేను ఒకడను గాలిలోకి విసిరిన ప్రతిదీ నేలపై పడాలె. విసురుతున్నప్పుడు ఎంత పైకి వెళ్తుందో అని చూస్తారేకాని, అంతపైనించీ తిరిగీ క్రిందకు పడుతుందనే యోచనరాగు. నేనెప్పుడూ ఇరుకు సందులలోనూ, చీకటి దారుల్లోనూ, పాపపంకిలమని లోకం భావించే చోట్లనూ, నివాస మేర్పరిచుకొని నా కర్తవ్యం నెరవేరుస్తూ వుంటాను. నశింపు అనేది చెడుగా భావిస్తారు మానవులు కాని నశింపు జరగడానికి నేను వినియోగింపబడ్డాను

ఫౌస్ట్

అయితే నీవు సృష్టిలో ఒకభాగానివన్న మాట. అటువంటప్పుడు ఈ మారు వేషాలూ, మాయవేషాలూ దేనికి?

మెఫిస్టోఫిలిస్

వేషాలు ఎన్ని ధరించినా, వేషాల వెనుకగల నా నిజరూపం ఒక్కటే. ఈ మానవుల విషయం మాత్రం? మానవుడు తన స్వల్పజీవిత పరిధిలో బహురూపాలు ధరించి, అతి సామాన్యమూ, నిస్తేజమూ అయిన జీవితము గడుపుతూ, తాను ఏదో సాధించాను, సాధిస్తున్నాను అని, తన జీవితంలో పరిపూర్ణత పొందగలుగుతున్నాను అనీ భ్రమ పడుతాడు సృష్టి ప్రారంభంలోనూ, ఈనాడూ కూడా సృష్టిరహస్యం ఒకేవిధంగా వుంది. ఆ భ్రమయే లేక పోతే మానవునికి బ్రతుకుమీదనే రోత పుట్టుతుంది. బ్రహ్మాండమైన అజ్ఞానాంధకారం కల్పించి. అందులో ఒక చిన్న వెలుగుదీపం పెట్టి, ఆ అంధకారాన్ని తరమగలిగేది ఈ చిన్నదీపము సుమా అని చెపుతుంది సృష్టి. మిణుకుమిణుకు మనే ఆ చిన్న దీవానికి ఎంతగర్వమో? తనవల్లనే ఈ చీకట్లు తరమబడుతున్నాయనీ, ఆ చీకట్లన్నీ తమ విముక్తికొరకే తనవైపు చూస్తున్నాయనీ, అనుకొనే ఆ చిన్ని వెలుగు పొట్టలో గొప్పశక్తివున్నమాట నిజమే. కాని దానికిగల గర్వాన్ని కూడా మనం అంగీకరించాలె ఈ మహాంధకారాన్ని ఈ లోకపు భ్రమలను అది పూర్తిగా తరమగలదా? ఇది ఒక కాంతిపుంజం. తనలోగల శక్తిని సమస్తప్రాణుల్లోనూ ప్రవేశపెట్టి, ఆ ప్రాణులకు రూపలావణ్యాలిస్తూ, తన సృష్టి శాధ్యతను కొనసాగిస్తున్నది. తనశక్తిని అస్తిపంజరాల్లో బంధించి, నామ

రూపాలు కల్పించుకొని, ఆ అస్థి పంజరాలను కాలధర్మా నికి గురిచేస్తూ, 'అసలు వెలుగు ఇక్కడవున్నది సుమా' అని చెపుతూవున్నది కాని ఎంత చిన్న వెలుగు అది!

ఫౌస్ట్,

సృష్టిశక్తిని నీవు ఎలా ప్రతిఘటిస్తున్నావో నీకర్తవ్య పాలన ఎటువంటిదో నాకు బోధపడుతున్నది నీ శక్తి యుక్తులు ఎంతవరకూ అజ్ఞానులమీదనే ప్రసరిస్తాయి. ఆ కృతినిబట్టి శక్తికి విలువకట్టలేవు. నీ వెంతకూ చిన్నచిన్న సరదాలతో, మానవుల జీర్ణ జీవితాలతో ఆడుకొంటూ కాలం గడుపుతావు

మెఫిస్టోఫెలిస్

నన్నుగురించి నేను చెబుతున్నాకూడా నీకు అర్థం కావడం లేదే. నేను ప్రతిఘటన శక్తిని. ఈ ప్రపంచాన్ని కల్లోలపరుస్తున్న సముద్రతరంగాలను, పెనుఘానులను, భూకంపాలను, కారు చిచ్చులను అదుపులోపెట్టి వుంచాలని ఎంతో శ్రమపడ్డాను. ఆ చైతన్యశక్తులు నామాట వినేవి కావు. ఈ భూమీ, సముద్రము దేనికది వేరుగా వుండి పోతూ - ఈ ప్రతిఘటనను ఏమాత్రం లెక్కచేయడంలేదు అది వాటిస్వభావం కాబోలని వదిలివేశాను ఏం చేయ గలను? ప్రకృతి శక్తులమీద ఈ ప్రతిఘటన పనిచేయన ప్పుడు? ఇంక నాకు లోబడేదేది చెప్పు ప్రాణిలోకం తప్ప? అటు మనుష్యులు, ఇటు జంతువులు వీళ్ళతో ఆడటం, చికాకు పరచడం నాకు సరదా. నేను లయ కారక శక్తి

నని చెప్పానుకదా. ఎన్ని ప్రాణులను లయం చేస్తే ఏమి? ఈ సృష్టి ఆగుతున్నదా? సముద్ర తరంగాలు నా ఆజ్ఞ వుల్లంఘించినట్లే, ఈ సృష్టి ప్రవాహం కూడా నన్ను లక్ష్యపెట్టదు కాని నా ధర్మం నేను నెరవేర్చాలె జీవులు పుడుతూ వుంటారు, చనిపోతూ వుంటారు. ప్రతి తరం వారికి, వారి జీవిత యాత్రలో కొంత మాయాజాలం కన గారుస్తూ, వారిని జీవధర్మంపట్ల వుత్సాహపరుస్తూ, వారిని ఇచ్ఛాను రక్తులుగా చేస్తూ మళ్ళీ 'ఇదంతా మీ ప్రజ్ఞ కాదుసుమా' అని వారికి జాగ్రత్త చెప్పుతూ యీ జగన్నాటకం జరుపుతున్నాను ఈ నాటకంలో నేనూ ఒక పాత్రధారినే. నాటకం యథావిధిగా జరిగిపోవలసిందే. వాయువు, అగ్ని, జలం, భూమి తమ కర్తవ్యం నిర్వహిస్తున్నట్లే, నా కర్తవ్యం నేను నెరవేర్చుకొంటూ పోవాలె.

ఫౌస్టు

లోక చక్రం యీ విధంగా ఆద్యంతాలు లేనిదై పరిభ్రమిస్తున్నదని నీవే వొప్పుకుంటున్నావుకదా! అటువంటప్పుడు నీవంటి దుష్టుడు ప్రాణులను బాధపెట్టటం కాక మరొకపని వేయించుకో కూడదూ?

మెఫిస్టోఫిలిస్

పండిత ప్రకాండా! నీవన్నది నిజమే. అదే మంచి మార్గం కూడాను ఈ విషయం మనం మరొకసారి కలుసుకొన్నప్పుడు సంభాషించుకొందాం ఈనాటికి నేను శలవు పుచ్చుకోవచ్చునా?

ఫౌస్టు

ని ధోరణి ఏమిటో నాకర్థం కావడం లేదు. మనం కలుసుకున్నది ఇదేగా మొదటిసారి. నీవు ఎప్పుడైనా సరే రావచ్చును. ఇదిగో ఇది కిటికీ, అది తలుపు. పొగగొట్టం అదుగో! ని కిష్టమొచ్చిన దారిన లోనికి రావచ్చు, యట టకు పోవచ్చు

మెఫిస్టోఫిలిస్

కాని ఒక్క సంగతి. నన్నిక్కడనుంచి కదలనీయని మంత్రశక్తి వున్నదే ఈ గదిలో! నేనెలా రాగలను, ఎలా పోగలను?

ఫౌస్టు

అంటే నీకిందాక చూపెట్టిన ఆ రక్ష విషయమే కదా! నిన్ను అది కట్టివేసిందన్న మాట అయితే నీవు అసలు లోపలికి ఎలా రాగలిగావు? నీవు వచ్చిన తర్వాత అది నిన్నెల బంధించ గలిగింది? ఆ సంగతి చెప్పు, వింటాను.

మెఫిస్టోఫిలిస్

ఆ రక్షాముద్రలో ఒకవైపున చిన్న బీట వుంది. ఆ సందులోంచి సూక్ష్మ రూపంలో నేనిక్కడికి వచ్చాను. ఆ బీటకూడా లేకపోతే నేను మీ దగ్గరకు రాగలిగి వుండే వాణ్ణికాదు.

ఫౌస్టు

సరే వచ్చినవాడివి వచ్చావు. ఇంక బయటికి ఎలా వెళ్ళగలవు? ఇక్కడ సులభంగా నాకు ఖైదీగా చిక్కిపోయావు.

(కుక్క తారట్లాడుతూ ఖంగారు పడుతూ వుంటుంది)

ఫౌస్టు

ఎందుకలా ఖంగారుపడతావు? కిటికీ తలుపులు తెరిచి వున్నాయిగా అటునుంచి వెళ్ళిపో

మెఫిస్టోఫిలిస్

భూతప్రేత పిశాచాల్లో ఒక కట్టుబాటు వుంది. అవి ఏ మార్గాన ప్రవేశిస్తవో అదే మార్గాన నిర్గమించాలె. అప్పుడు రావడం ధైర్యంగానే వచ్చాను ఇప్పుడు మీకు దాసుణ్ణాయి చిక్కిపోయాను

ఫౌస్టు

ఓహో! అయితే మీ పిశాచ గణానికికూడా ఒక నియమావళి వుందన్నమాట. అయితే మనం ఒక ఒప్పందానికి వద్దాం. ఇద్దరం రాజీ కుదుర్చుకోనడం మంచిది, ఏమంటావ్?

మెఫిస్టోఫిలిస్

ఇచ్చినమాట కాదనటం మాజాతిలో లేదు కాని యీ విషయంలోమాత్రం తొందరపడడం సబబుకాదు.

కొంచెం నిదానంగా ఆలోచిద్దాం. వ్యవధి ఇవ్వండి, జాగ్రత్తగా ఆలోచించుకొని ఒక నిర్ణయానికి వద్దాం. నాకవతల బోలెడు పనులున్నాయి. ఈవేళకు ఒదిలిపెట్టండి. మీకు దండం పెడతాను

ఫౌస్టు

ఆహా దండం పెడతావూ! అంతగొప్పవాడివి నీవు నన్ను చూచి బెదరడమేమిటి? కొంచెంసేపు ఇక్కడ వుండవయ్యా కబుర్లు చెప్పుకుందాం!

మెఫిస్టోఫిలిస్

కాదు బాబూ కాస్త తొందరగా వెళ్ళిపోవాలె ఈసారి వచ్చినపుడు మీ సందేహాలు అడుగుదురుగాని.

ఫౌస్ట్.

నిన్ను నేను రమ్మని పిలిచానా? నీఅంతట నీవు వచ్చావు. ఎలా వొచ్చావో అలా వెళ్ళిపో. నిన్ను నేను వద్దంటున్నానా? బోనులోపడ్డ ఎలుకను తిరిగి వంటింట్లో వదిలిపెడతారా ఎవరైనా? పంజరంలో బంధించి తెచ్చిన చిలుకను వృథాగా వదిలిపెట్టమంటావా? నిన్ను పరీక్షించనిదే వదలను.

మెఫిస్టోఫిలిస్

నన్ను పరీక్షించాలని వుందా? అలాగే కానీండి. మీకోరిక నెరవేర్చగలను. నా విద్యలు ప్రదర్శించి మిమ్ములను ఆనందపరచమంటారా?

ఫౌస్టు

నిరభ్యంతరంగా నీ విద్యలు ప్రదర్శించు వాటి లోతు ఎంతవరకూ వున్నదో తెలుసుకొని ఆనందిస్తాను.

మెఫిస్టోఫిలిస్

అలా మనం ఒకరినొకరు అర్థంచేసుకోగలిగితే, ఒక సంవత్సరపు కాలాన్ని ఒకగంటలోకి ఇమిడ్చినట్లుగా, ఆలౌకికానుభూతి పొందగలుగుతాము. మా పిశాచగణం మీకు, రసప్రపూర్ణమగు పాటలు నేర్పుతుంది. మీరు కోరిన చిత్రాలు వారు తెచ్చిపెడతారు ఇది గారడీ కాదు. ఇందులో దగాలేదు మీ మనస్సు తన్మయత పొందే అపూర్వ దృశ్యాలు, మీకు నేత్రోత్సవం కలిగేవిధంగా మా వాళ్లు కనబరుస్తారు నేను మీకు సేవ చేసేందుకు తయారుగా వున్నాను మా పైశాచిక గానంలో కారు మేఘాలు అదృశ్యమైపోయి, నీలాకాశం స్వచ్ఛంగా మీకు కనబడుతుంది నక్షత్రాలను ధగ ధగ మెరిపించే సమస్త క్షేత్రాలను, తీర్థాలను, కాంతి వెల్లువలో కప్పివేస్తుంది ఆ గానం ఎవరు కోరుకొన్నది వారికి లభింపచేసే, రసవంతమైన ద్రాక్షపళ్ళవిందు. ద్రాక్ష పానీయం వలె ఆ మధురతమమైన మంజుల గానం వినిపించే రేయింపగళ్ళ కదలిక జీవితానికి సార్థకతను చిగురింప చేస్తుంది. ద్రాక్ష రసమే ఒక నదీ ప్రవాహమై, దానిలో ననరత్నాలుగా ఆట వస్తువులు, గులకరాళ్ళూ అయి, కొండలకు చిత్రకారుని కుంచె రంగులద్దుతూ, లోకమంతటా చంద్ర కిర

ణాలవలె ఆనందాన్ని కురపిస్తూ గడ్డి పోచలనూ, నదీతరం గాలనూ, ఒకే విధంగా అల్లల్లాడిస్తూ జీవన మార్గంలో కన బడే ఎగుడు దిగుళ్ళను సమతలం చేస్తూ మానస సర స్సులో ఆనందం ధారలు నింపుతూ, గిరి శిఖరాలు అధిరో హిస్తూ మీ జీవిత మే ఒక ఆటగా, పాటగా, కమనీయనృత్య గాన వినోదంగా నడిపించి వేస్తాం మేము తలుచుకుంటె చేయలేని దేది? పంచ భూతాలు మా ఆజ్ఞలు శిరసా వహిస్తాయి

(భూతగానం ఆ భూతగానానికి ఫౌస్ట్ నిద్రావసు డవుతాడు)

మెఫిస్టోఫిలిస్

ఈ పండితుడు నిద్రపోతున్నాడు తన వయస్సు లోని జ్ఞాపకాలు, తన పెదిమలమీద దరహాసంగా ఆడు తున్న విధాన నిశ్చింతగా నిద్రపోతున్నా డీమహానుభావుడు! పైశాచిక శక్తులారా, మీ కమ్మనిపాటలతో నాపని తేలిక పరిచారు మీ గానమే ఆయన్ని నిద్రపుచ్చింది నన్ను బందీగా చేసినమనిషి, మీ శక్తుల ప్రభావానికి బందీ అయిపోయినాడు కమ్మని కలలతో భ్రమప్రమాద మగు ప్రపంచంలో ఎంత సులభంగా జొరబడ్డాడు ఆ స్వప్న వాటికలో అతడు, పాపం, తన నిజశక్తులు విస్మరిస్తాడు. ఇక నేను యీ బంధంనుంచి తప్పించుకోవాలె మూషికాల రాజో, పశులప్రభువో, కప్పలదొరసానో ఎవరో ఒకరు వచ్చి నన్నికక్కడినుంచి రక్షించాలె. అతడు ఆ కలనుంచి

తేరుకునేలోపల నేను పారిపోవాలె. నీవు జాగ్రదావస్థలో వున్నపుడు నన్ను వదలవు. ఈ స్వప్నావస్థలోనే నేను నీ పట్టునుంచి తప్పించుకోవాలె.

ఫౌస్టు

(లేచి కళ్ళు నలుపుకొంటూ నలువైపులకు చూస్తూ)

ఏదిఆభూతం? కనపడడం లేదే? నన్ను మోసపుచ్చగలిగిందా! కలలోకూడా ఆ దెయ్యాల వికారనృత్యమే కదా! కుక్క పారిపోయిందే! ఆ దెయ్యమూ పారిపోయింది. ఇదంతా ఒక పీడకలా? ఇది వాస్తవమా? నాతో నావెంటబడి ఈ గదిలోకి ఒక కుక్కపిల్ల రాలేదూ! అది బృహదాకారం దాల్చి తాను ఒక పిశాచమైనట్లు నాతో మాట్లాడిందే!

---

# ఫౌస్ట్ గదిలో - 2

(ఫౌస్ట్ ఆలోచనలో వుంటాడు బయట తలుపు తడుతున్న శబ్దం)

ఫౌస్ట్

ఎవరువారు ఈ వేళప్పుడు? ఆ, లోపలికి రావచ్చు

మెఫిస్టోఫిలిస్

(లోపలికి వస్తూ) నేనే.

ఫౌస్ట్

లోపలికి రావచ్చు

మెఫిస్టోఫిలిస్

అలా మూడుసార్లుపలిస్తే గాని రాను.

ఫౌస్ట్

లోపలికి రావచ్చు, ఇది మూడోసారికదా! ఎందుకు నాచేత అలా పట్టుపట్టి చెప్పిస్తున్నావు?

మెఫిస్టోఫిలిస్

నే ననుకొన్నవిధంగా నిన్ను నడిపించడం నాకెంత సంతోషమో నీకే తెలుసు! పండితశ్రేష్ఠా మనమొక

రాజీకివద్దాము. నీకు బానిసనై నీకోర్కెలు తీర్చడం నా పని. దానికోసమే రాజవేషంలో ఈ జల్తారు బట్టలల్తో యిక్కడికి వచ్చాను. ఈ పట్టుకోటూ - యీ తలపాగా - ఈ తలపాగాపైగల ఫింఛమూ - యీ పొడుగాటి కత్తీ యివన్నీ నా రాజరీవికి చిహ్నాలు, లాంఛనాలు. నీవూ యిటువంటి దుస్తులు ధరించి నన్ననుసరించు. నీకు తీరని కోరిక లంటూ వుండవు.

ఫౌస్ట్

ఈ జల్తారుబట్టలతో నాకేంపని? జీవితపు విలాసాలకు చెందిన యీ ఆడంబరం నాకెందుకు? పెద్దవాణ్ణి, కొంచెం వివేకవంతుణ్ణి, ప్రాయంలో వున్న యువకునివలె నేని సరదాలవైపు మొగ్గడమా! లోకం నాకేమి యివ్వగలదు? ఏ త్యాగసంపద జీవితాన్ని పరిమళభరితం చేస్తుందంటారో, దాన్ని గురించి నేను జ్ఞానం వచ్చినప్పటినుంచీ వింటూనేవున్నాను ఆ త్యాగగుణమే సహాకారంమై నా ఈ దీర్ఘజీవితంలో నన్ను కాపాడుతోంది.

నిజమే యీ ధ్యానంలో, 'నావి' అన్న కోర్కెలు లేవు. ఒక్కొక్కసారి యీ జీవితమంతా కన్నీళ్ళకే అంకితమైపోయిందా అనిపిస్తుంది. దినములే ప్రతిధ్వనులిస్తూ అవతరిస్తున్నపుడు ఒక్కకోరికైనా తీరలేదేమో అనిపిస్తుంది. ఒకప్పుడు ఎన్నో కోరుకొన్నాను. ఎన్నో కావాలనుకొన్నాను ఆ వెర్రికోర్కెలు కుంటిగుర్రాలై నన్ను అడియాశలపాలు చేశాయి ప్రతిపుదయం 'యీనాడు చేయ

గల దేమున్నది?' అను నైరాశ్యముతో మేల్కొ-వడమూ, ప్రతిరాత్రీ, మరొకరోజు గడిచిందిలే అని నిరుత్సాహంతో శయనమందిరం చేరుకోవడమూ నాకు దైనందిన కార్యక్రమమైపోయింది. నా మనస్సుకి విశ్రాంతిలేదు పగటివేళ కనపడేవన్నీ, కటికిరాత్రుల స్వప్నాలలో భయపెట్టే దృశ్యాలు. దేవుడెవరో దూరాన్నుండి నన్ను పిలుస్తున్నాడా అనిపిస్తోంది నాలో నిద్రాణమైవున్న శక్తులను ఆయన లాలించి మేల్కొలుపుతున్నాడా అనిపిస్తోంది. ఈ వేర్వేరు వ్యామోహాలను ఏరీతిగా తృప్తిపరచడం? తీరని కోరికలతో జీవన సంధ్యారామం చేరుకొన్న నేను మృత్యుకరాళికంటే కోరదగిన దేమున్నది!

మెఫిస్టోఫిలిస

ఆహా! ఏమి పండితుడవయ్యా! మనుష్యులెక్కడైనా చేజేతులా మృత్యువుని ఆహ్వానిస్తారా?

ఫౌస్టు

జీవితపరమావధికి మానవుడు వాంఛించవలసినవి రెండే వున్నాయి. జయభేరి మ్రోగిస్తూ, విజయలాంఛనాలతో తన సర్వస్వాన్ని మృత్యుదేవత పాదాల ముందు వుంచటం, లేదా అవిరతమైన నాట్యశోభలో జీవితమే ఒక నర్తనశాలగా, అందకత్తెలయిన అతివల కనుచూపుల లోనూ, వారి బాహుపరిరంభనములలోనూ తన్మయుడై, ఆ రసానుభూతిలో సర్వసామాన్యమైన యీ బాధలన్ని

మరిచిపోవడం. గమ్యం చేరడానికి యీ రెండు మార్గాలు తప్ప మరొకటి లేదే

మెఫిస్టోఫిలిస్

ఎన్ని నేర్చుకొంటేనేమి, మధురసపానంలో గల రుచి పుస్తక పఠనంలో తెలియదు ఆ రుచి అన్నది జిహ్వకు మాత్రమే తెలుస్తుంది నివుమాత్రం ఒకరోజు ఆ రసాస్వాదన చెయ్యలేదా? అది చెయ్యరానిదని విముఖుడవై, యిప్పుడు యీ వైరాగ్యమార్గం అవలంబించావుకాని!

ఫౌస్టు

ఇతరుల పనులు పొంచిచూడడమే నీపనిగా వున్నదే!

మెఫిస్టోఫిలిస్

సర్వమూ తెలిసిన పండితుణ్ణి అనే అహంభావం నాకు లేకపోయినా, నాకు ఏవో చిన్నంచిదరా తెలుసు.

ఫౌస్టు

గ్రాహ్యం వచ్చినప్పటినుంచీ సందిగ్ధావస్థ అనేది నా స్వభావంలోనే ఒకభాగం అయిపోయింది. ఏదో అమర గానం ఒకేఒక్కసారి నా చెవికి సోకి నన్నీలోకవిలాసాలకు దూరుణ్ణి చేసింది. ఆ గానం నన్ను వరించి, నన్ను వున్నత పథానికి తీసుకొని వెళ్ళిందో, నరకకూపంలో గిరవాటు వేసిందో నాకు తెలియటంలేదు. అంతా రహస్యం. ఏదో తెలుసుకోలేని మోసం విధి నన్ను మోసగించింది. ఆత్మ ఒకవంక శాంతిని కోరుతూ, స్థిమితపడుతూవుండగా, యీ

విధి, వేళ్ళలోనుంచి జారిపోయిన సుఖాలను నా కండ్ల ముందు ప్రదర్శించి, 'యిదంతా మోసం, నీవు దగాపడ్డావు ఫాంద సుడా' అంటూన్నది. అసలీలోకంలో శాశ్వతమైన దేది? పేరుప్రఖ్యాతులు వృథా. ఆత్మను తాకట్టుపెట్టి సంపాదించే ఆస్తిపాస్తులు వ్యర్థం. 'నావాళ్ళు' అనుకొని ప్రేమించే భార్యా బిడ్డలు రిక్తం. పేరుప్రఖ్యాతులూ, ఆస్తిపాస్తులూ, సంసార తాపత్రయాలూ యివన్నీ చివరకు నిరర్థకాలేనా? పైశాచిక శక్తులే వీటి వెనకనుండి అనుక్షణమూ లోభ పెట్టుతూ వుంటవి. సాహస కార్యాలు చేయాలనీ, మన ఘనత పదిమందీ చెప్పుకోవాలనీ, సిరి సంపదలతో మన యిల్లు తులతూగాలనీ మద్యపుచులను మన జిహ్వ రుచి చూడాలని మాధుర్యమే ప్రతి అడుగునా మనకి దర్శన మివ్వాలనీ, వాపోవడం, బుద్ధి హీనత నిజ సాధకుని దృష్టిలో అదంతా వృథా ప్రయాస ఈ లోకంలో ఏదో ఒక్కటే ఆశయం కోసం బ్రతకడం తప్ప ఒక సిద్ధాంతాన్నే నమ్మడం తప్ప ఓపికవల్లనే పనులు జరుగుతాయనుకోవడం తప్ప. నా చుట్టు ముట్టిరాగల తప్పులేమిటో నాకు తెలుస్తున్నాయిగాని ఏది మార్గమో కానరాకుండా ఉన్నది. తామరాకుపై నీటి బొట్టువలె ఏగీ మనలని స్పృశించని విధంగా బ్రతకడం గొప్ప విషయం. వెలుగులో కండ్లు మిరుమిట్లుగొని త్రోవ కనపడదు ఇంత నికృష్టమైన జీవితాన్ని - ఆ ప్రభువు ఎందుకు కల్పించాడో తెలుసు

కొందామని ఎంత ప్రయత్నము చేసినా, అడుగు అడుగునా పొగమంచు తెరలనే కప్పుతుంది - తప్పులనే చూపు తుంది అంతేగాని ఏది ఒప్పో చెప్పదు

(భూతాల గానం)

'ఏమిట్లలని చెప్పమంటారా ఏది తప్పో? సంతోష పాత్రను వొంచి పారపోయడం తప్పు. మీలో గల శక్తు లను నాశనం చేసుకోవడం తప్పు. దేవుడు సృష్టించిన మనిషి తానే దేవుణ్ణి సృష్టించాననుకోవడం తప్పు. దేవ త్వాన్ని ధ్వంసం చేయడం తప్పు శూన్యతను వినాశన మునూ కోరుకోవడం తప్పు మేము భూత శక్తులం, భూలోక ప్రాణులకు జీవరసం పోయడం మా విధి. అదే మా కర్తవ్యం మా అంశలన్నీ మీ హృదయంలో వున్నవి ఇప్పుడు మాత్రం మించిపోయిందేమున్నది! నూతన జీవితం ప్రారంభించు. నీలోగల సామర్థ్యంతో తేజో బలంతో క్రొత్త పాటలు పాడి, నీ గానమాధుర్యం నీ ప్రజలందరూ పాడుకునేటట్లు ప్రకటించు'

మెఫిస్టోఫిలిస్

నీవు దుష్ట శక్తులనుకొనేవన్నీ నా చెప్పుచేతల్లో వుండే శానిసలు. తమ కార్యనిర్వహణలో అవి ఎటువంటి వుత్సాహం కనబరుస్తున్నాయో చూచావుగా! ఈ ప్రపంచ మంతా వాటి గుప్పెట్లో వుంది, వాటికి సాధ్యంకాని కార్య మంటూ లేదు. నీవు ఎందుకలా బుర్ర పాడుచేసుకొంటావు. ఏదో పెద్దపక్షివచ్చి నిన్ను మింగేస్తుందా? ఎందుకా భయం!

సంఘం ఎటువంటి అధ్వాన్న స్థితిలో వుంటేనేంగాక. నిన్ను విద్యాధికునిగా గౌరవిస్తుంది నీకా గౌరవ స్థానం ఎప్పుడూ వుంది. నేను నీ అంత తెలిసిన వాణ్ణి కాదు. కాని నేను నీకు సాయంగా వుండి, నీ జీవనయాత్ర సుఖప్రదం చేయాలనే సంకల్పంతో నీ ఆప్త మిత్రునిగా, నీ మేలుకోరే హితునిగా, నీ బానిసగా, నీ పాద సేవకునిగా, నీ దాసాను దాసునిగా వచ్చాను నాపట్ల మీ కెందుకింత అనుమానం?

ఫౌస్ట్

నేను ఎప్పుడూ కష్టకాలంలోనే వుంటున్నాను. నాకు సహాయం చేద్దామని నీకు తోచడం బాగానే వుంది కాని నీ వంటివారు కోరే ప్రతిఫలము ఏమిటో అని.

మెఫిస్టోఫెలిస్

ప్రతిఫలమా, మీరేదిస్తే అది పుచ్చుకొంటాను. మీ సేవ చేయడంలో నాకు ఫలాకాంక్ష ఏమీ లేదు. అదీ గాక నాకివ్వదలచుకొన్న ప్రతిఫలాన్ని గురించి ఆలోచన ఎందుకు? ఇంకా చాలా వ్యవధి వున్నదికదా!

ఫౌస్ట్

ఊహూ. నేను నీ మాటలు నమ్మను. నీవు స్వార్థ పరుడవు. నీ స్వార్థాభిలాష నాకు తెలుస్తూనే వుంది. అదే మిటో ముందే స్పష్టంగా చెప్పు. నీవు దైవ విరోధివి. నీ వంటి దాసులు ఎటువంటి పంగనామాలు పెడతారో నాకు తెలియదనుకున్నావా? ఆ షరతులు ముందే మాట్లాడుకో వాలె.

మెఫిస్టోఫిలిస్

మీ సేవలో నేను ధన్యత పొందాలనుకుంటున్నాను. ఈ దాసుడికి మిమ్మల్ని కనిపెట్టుకొని వుండటంతప్ప వేరొక పని లేదు ఈ భూమండలం మీద వుండగా నేను మీవల్ల ఏ ప్రతిఫలమూ కోరను మరొక లోకంలో మనం కలుసుకొన్నప్పుడు ఆ సంగతి మాట్లాడవచ్చు.

ఫౌస్ట్

ఆ ప్రపంచంలో కూడా నీ తంటా తప్పదా! నీ కార్యక్రమమంతా యీ లోకంలోనే కదా? తమరు ఈ లోకంలోగల మంచిని ధ్వంసం చెయ్యడానికి జన్మించిన కారణ జన్ములు. నాకు నీవు చేయగల సేవలు యీ లోకంలోనే, తీరని నా వాంఛలు కూడా యీ లోకానికి చెందినవే. నా మనస్సును బాధపెట్టే స్ఫురణల నుంచి, నాకు విముక్తి కావలసినది – నేను యీ లోకంలో వుండగానే. అమర లోకం చేరినతరువాత నిన్ను దరిదాపులకి రానివ్వను. అక్కడ నన్ను కాపాడడానికి విశ్వప్రభువు వున్నాడు.

మెఫిస్టోఫిలిస్

అలాగే గానీయండి మీరు నావెంట వుండడమో లేదా – నన్ను మీవెంట వుండనీయడమో, మీరు ప్రసాదింపగల ప్రతిఫలం నావెంటవుంటానని మాట ఇయ్యండి చాలు నాలోగల మహాశక్తుల నన్నింటినీ వెచ్చించి మీ కనులముందు ఒక వసంతాన్ని, ఒక అమరలోకాన్నీ, మాన

వుడు కనివిని ఎరుగని ఆనందధామమునూ సృష్టించి, ఆ దివ్యప్రపంచం మీకు నైవేద్యంగా యిస్తాను. ఏ సంతోషాలకు మీరు యిన్నాళ్ళబట్టీ దూరమైవున్నారో, వాటి నన్నిటినీ మీకు కరతలామలకం చేసి, మిమ్మొక రసాంబుధిలో ముంచి ఎత్తుతాను

ఫౌస్ట్

ఆహా, ఆహా! పెద్దమాటలు చెప్పడానికి మొనగాడివి ఎవరైనా వున్నతమార్గాలకొరకు అన్వేషిస్తారుగాని, యీ సరస వినోద సంగీతాలకోసం కాలాన్ని వృథాపరుస్తారా? మానవుని ఆత్మ వేగుచుక్కవంటిది. నిశానతారతి కాంతి ఏనాడూ కనబడదు నీ భూతశక్తికీ, మానవునిఆత్మ శక్తికీ ఏనాడూ పొత్తుకుదరదు నీవు సమకూర్చే భోజనం వల్ల రుచులకాంక్ష పెరుగుతుండే తప్ప, ఆకలిని జయించలేము తలచుకొంటే నీవు సువర్ణం పుట్టింపగలవు. కాని అది భగవంతుడు సృష్టించిన సువర్ణం కాబోదు నీ మాయ బంగారముతో మానవుణ్ణి కొంతవరకూ పతితుణ్ణి చేయగలవు కాని, అతని ఆత్మను స్వాధీనం చేసుకోలేవు. ఏదీ చూద్దాం నీ ప్రతాపం ఎంతటిదో! చూడు, ఆ పసిడివెన్నెల కన్యకను ఇటు తీసుకొనిరా. ఆ లలనామణి నాపై చిరునవ్వులు చిమ్మేటట్లు చెప్పు. నాయీవార్ధక్యజీవితాన్ని వసంత కాంతులతో నింపు నీ కేశక్తివుంటే. చెట్టునపండిన ఫలము మగ్గిపోయినా చెట్టు తన పచ్చదనాన్ని నిరంతరం కాపాడు

కుంటున్నట్లు – నా జవసత్వాలు క్షీణించిన యీ వార్ధక్యము తప్పించి నన్ను వసంతంవైపు మళ్ళించు, నీ శక్తి చూద్దాం.

మెఫిస్టోఫిలిస్

అబ్బే! అదికూడా ఒక ఘనకార్యమేనా! నీవు కోరికలు కోరినంతమాత్రాన నేను బెదరిపోతాననుకొన్నావా! వీడు బెదిరే సేవకుడు కాడు. సముద్రగర్భంలోని ముత్యాలూ భూగర్భంలోని వజ్రాలూ నాగరాజుముఖాన గల మణులూ అడుగు. నీవు ఏమడిగినాసరే తీసుకొనివచ్చి యిస్తాను. అంతే కాదు, ఈ కాలచక్రాన్ని నీ యిచ్చవచ్చినరీతిగా త్రిప్పివేస్తాను. మనిద్దరం కలిసి మెలసి వుందాం. అదొక్కటే నా కోరిక.

ఫౌస్ట్

చాలా గొప్ప సేవకుడే కుదిరాడు నాకు నేను సోమరిపోతునుకాను. నిత్య చైతన్యవంతుణ్ణి. నా దేహమూ, మనస్సు నిరంతరమూ పరుగులెత్తుతూ ఉంటవి. నీవు ఏదో మాయాజాలం పన్ని నన్ను నీ బుట్టలో వేసుకొందామని అనుకున్నా చివరికి నేను నీకు అందను. బహుశా యీ జన్మ అంతం కావచ్చు. అంతేగాని నేను నీకు దొరకను ఈ జన్మ అంతమయి పోతుందే అను భయం నాకేనాడూ లేదు. దానికి నేను ఎప్పుడూ సిద్ధంగానే ఉన్నాను. అయినా పందెం వేద్దాం, ఎవరు నెగ్గుతారో చూద్దాం

మెఫిస్టోఫిలిస్

నేను మొదట్నుంచీ ఒప్పుకొంటూనే వున్నానుగా.

ఫౌస్ట్

ఈ పందెంలో ఏది ఒడ్డడానికైనా సిద్ధంగా వున్నాను. నీ యింద్రజాలం నామీద ఏదో ఒక పొర కప్పగలదు అంతే తప్ప నాలో గల నిజ తేజస్సును ధ్వంసం చేయలేదు. నీ మాయకు అంతటి శక్తిలేదు నీవు మెల్లగా బానిసగా చేరి నన్ను బందీకృతుణ్ని చేయగల ననుకొన్నావు నీ బంధాల మూలంగా నేను మృత్యు లోకం చేరినా నాకిప్పుడు వచ్చే నష్టమేమిటి? నా మర ణాన్ని సూచిస్తూ చర్చిలో గంటలు మ్రోగవా? మ్రోగు తవి. కాలాన్ని స్థంభింప చేద్దామనుకున్నావా? ముల్లు వూడతీసినంతమాత్రాన గడియారం తిరగడం ఆగు తుందా! అయినా చూద్దాం, నీ తమాషా ఎంతటిదో!

మెఫిస్టోఫిలిస్

నీవు ఎటువంటి ఒడంబడికకు వస్తున్నావో ముందే హెచ్చరికి చేయడం నా విధి. తరువాత నన్ను తెగనాడి లాభం లేదు.

ఫౌస్ట్

నీకు తోడు నన్ను హెచ్చరించడంకూడానా? నేను ఏమంటున్నానో నాకు బాగా తెలుసును. నీవంటి నౌకరు సమయానికి దొరికాడని సంతోషిస్తున్నాను. ఇక నేను,

నీకు సేవలు నిర్దేశించడమే కదా నా పని. చెప్పుతాను. సిద్ధంగా వుండు.

మెఫిస్టోఫిలిస్ .

అలాగైతే ఈ వేళ ప్రారంభిద్దాం. ఇదుగో భోజనం వేళ యింది ఇకమీద నీవు నాకు పనులు నిర్దేశిస్తూ వుండాలె. మన ఒడంబడిక వ్రాతమూలకంగా వుంచుకుంటే మంచి దేమో!

ఫౌస్ట్

ఏమంటావ్? స్వహస్తముతో రాసి యిమ్మంటావా? పెద్ద మనుష్యుల మాటమీద ఆమాత్రం విశ్వాసం లేని వాడివి, నిన్ను ఏమని ఏమి ప్రయోజనం? పుట్టుకతోనే నీది సంకుచితమైన బుద్ధి మనస్ఫూర్తిగా మాటయిచ్చినమీదట ఇంకా వ్రాసి యివ్వాలా? నేనే మాటను నిలబెట్టుకోలేక పోతే యీ భూమ్మీద నదీ నదాలు స్వస్థానాల్లో వుంటాయా? నా మాటకే విలువా విశ్వాసమూ లేకపోతే, మానవుని మాటకిగల విలువ ఏమిటి? ఇంతవరకూ నేను మాటతప్పినవాణ్ణికాదు. ఎంతటి త్యాగబలంతోనైనా సరే, నామాట నేను నిలబెట్టుకొంటూనే వచ్చాను. ఔను మాటలకంటె పత్రాలే ముఖ్యం ఒక రకంవారికి! భూతాలకి అటువంటివే అవసరం. కలంతో వ్రాసే మాటకి ప్రాణం వుంటుందా, ఆ కలం చేతపుచ్చుకునేవానికిగాక! ఇంతకూ ని ఆలోచన ఏమిటి? నిన్ను నాతో వుండనిస్తానన్నానుకదా! ఆ ఒడంబడిక కుదిరినమీదట, అది కాస్తా

పత్రంమీద వ్రాసియిమ్మంటున్నావా! పాలరాతి మీదనా - పట్టు కాగితంమీదనా? మేక చర్మంమీదనా మేలు పత్రం మీదనా? దేనిమీద వ్రాసి యిమ్మంటావు? లక్క సీలుకూడా వెయ్యమంటావా? గంటంతో లిఖించమంటావా? కత్తితో చెక్కమంటావా? కలంతో వ్రాయమంటావా? తన భృత్యుడు కోరినవిధంగా చేయడానికి సిద్ధంగా వున్నాడు యీ ఫౌస్ట్.

మెఫిస్టోఫిలిస్

ఎందుకయ్యా వూరికనే ఆ వుపన్యాసం, ఆవేశమూను? దేనికా ఆడిపోసుకోడం? నీవు ఎటువంటి పత్రం మీద రాసి యిచ్చినా ఆక్షేపణంటూ లేదు. ఒక్క స్వీ సంతకం మాత్రం నెత్తురులో ముంచిపెట్టాలి రక్తాక్షరాలు తప్ప యింకేవీ మా లోకంలో చెల్లుబడికావు.

ఫౌస్ట్

పనివాడితో యింతసేపు తర్జన భర్జన చేయడం నాకే చికాగ్గా వుంది. కానియ్ నీకెలా కావాలంటే అలాగే వ్రాసి యిస్తాను.

మెఫిస్టోఫిలిస్

రక్తంతో చేవ్రాలు చేయడంలో ఒక ప్రత్యేకత వున్నది

ఫౌస్ట్

నా మాటకి లేని విలువను ఆ పత్రం సృష్టించ లేదని నీకు చెప్పినా అర్థంకాదు. నీ ధోరణే నీది. ఏ వ్యవహారం

ఏమిటో చూద్దామనే నేను నీకు మాటయిచ్చాను నీవు నీఅల్పత్వాన్ని బయటపెట్టుకున్నావు కదా! నా సాధనకు సహాయంగావుంటుందనుకున్న మహత్తరశక్తే నన్ను చులకనచేసి వేసింది. దానితో నామేధ చిందరవందర అయిపోయింది జ్ఞానసంపత్తి నాకు అందకుండా వుండటానికి సుఖలోలత్వమనే వుచ్చులు నాపై పన్నుతూ - ఆశా పాశాలు కల్పిస్తూ - వాటినడుమ నన్ను తృప్తిపడమన్నది ఆ శక్తి. నాకు చూపదలచుకొన్న, ఆ మహేంద్ర వైభవమేదో వెంటనే చూపు. అది ఎటువంటిదో తెలుసుకోవాలనే తహతహ నేను భరించలేకుండా వున్నాను కాలవాహినిలో సుఖదుఃఖాలు కలిసిపోయినట్లే, నీ వింతలూ అద్భుతాలుకూడా వాటిలో ఏకమై లయించిపోనీ, ప్రవాహంతో కొట్టుకొనిపోతున్నా తన విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చడమే సజ్జనుని స్వభావం అందేవీ, అందనివీ ఒకే స్థాయిలో చూడగలగడమే వివేకవంతుని లక్షణం

మెఫిస్టోఫిలిస్

అలా ఒకపద్ధతిలోకి వద్దాం. గమ్యం ఫలనా అని నిశ్చయించుకోవడం అనవసరం నీకు ఇష్టం వచ్చినవి నీవు అనుభవిస్తూ వుండు. నీసొంతం చేసుకోవాలన్నది ప్రతిదీ నీదై పోతుంది. సంతోషపడడానికి కొంచెం సాహసం కావాలె. ఆ సాహసం కోల్పోయి బుద్ధిహీనుడివై పోకు.

ఫౌస్టు

సుఖమనగా ఏమిటి? సంతోషమనగా ఏమిటి?

ఎందుకీ సుఖసంతోషాల ఎండమావులు? కష్టనిష్టూరాలని ఎదుర్కోడానికి నేను ఎప్పుడూ సిద్ధంగానే వున్నాను. ప్రేమించినవారిని ద్వేషించవలసి వచ్చినా సిద్ధంగానే వున్నాను. ఇంతవరకూ నా సాధన అంతా జ్ఞానసముపార్జనకై వినియోగింపబడ్డది. నా మనస్సుని పవిత్రంగా ఉంచుకోవాలనే దీక్షతో కల్మష కలితములను వేటిని అ ప్రాంతాలకి రానియలేదు. ఎటువంటి అవాంతరాలకూ నేను భయపడను. నా అనుభవ జ్ఞానము నాతోడి మానవులందరికీ మనఃపూర్వకంగా పంచిపెట్టాలని ఆరాటపడే వాణ్ణి అటు పర్వత శిఖరాన్ని, యిటు కడలిలోతును తెలుసుకోవలెనని పరితపించేవాణ్ని, నా ఆత్మ యీ రెండు అవధులకూ మధ్య ఉయ్యాలలూగుతూ ఆ చలచాలనలో నన్ను ఉక్కిరి బిక్కిరి చేసేది.

మెఫిస్టోఫిలిస్

తరతరాలుగా నా పనికూడా యిటువంటిదే, కొండవాగులలో దూకడం నా నిత్య కృత్యం. జనన ఘటిక మొదలు శ్మశాన ప్రవేశందాకా ఈ మానవులు నా ప్రభావం తప్పించుకోలేరు. జగత్ప్రభువే ఈ ప్రపంచాన్ని సృష్టించి నాకు కూడా అందులో ఒక స్థానం కల్పించాడు భగవంతుడు తనకొరకై ఒక మహా జ్యోతిని నిర్మించుకొని – మావంటి భూతప్రేతాలను చీకటి కోనలకు తరిమివేసి దినాన్ని పగలుగా, రాత్రిగా విభజించాడు అన్ని చోట్లా యీ పగలూ రాత్రీ వున్నవి.

ఫౌస్ట్

నావలెనే నీవు కూడా ఆలోచిస్తున్నావే.

మెఫిస్టోఫిలిస్

నీకు తెలిసినపాటి నాకు తెలియదని నీ ఉద్దేశం. నాకూ తెలుసును కాని నా సమస్యా స్వరూపం వేరు, కాలం బహు స్వల్పమైనదనీ కళలు కాల స్వభావానికి అతీతములై చిరకాలం మనగలవనీ భావించి ఈ చిక్కు సమస్య తేల్చడానికే కదా ని నిర్విరామ కృషి కళాకారుల ద్వారా మీరు యీ భూమిలో అమరత్వాన్ని సృష్టించబోతారు కళలు గొప్పవే, కాదనను కాని అవి అమూల్య రత్నాలు వంటివి, సింహ బలమునిచ్చేవి, కొదమ లేడివలె పరుగెత్తించేవి - అవే గుప్తవిద్యలు ఆ గుప్తవిద్యలు మీరు పరికింపగలిగితే పిరికితనం పారిపోతుంది. నరనరాల్లోకి ధైర్యోత్సాహాలు వెల్లుబికినస్తవి ఆ గుప్తవిద్య వల్లనే యువకరక్తంలోగల శక్తీ, తేజం మీకు అవగతమవుతుంది. నువ్వు మొదట కాయకల్పసిద్ధిపొందాలె, తిరిగి నవజీవనుడవు కావాలె. అప్పుడు ప్రణయమేమిటో, వసంత సమీరమేమిటో, తీయని గాథలకు, వలపు కలలకుగల అర్థమేమిటో తెలుస్తుంది నీ సాధన అప్పుడు మరొక మార్గాన ప్రసరిస్తుంది నీవెంతవరకూ విజ్ఞానాన్నే నమ్ముకున్నావు. రసానందమనగా ఏమిటో నీకు తెలియదు

ఫౌస్ట్

మానవమకుటాయమానమగు శిఖరాగ్రం చేరుకున్న నన్ను, మళ్ళీ యింద్రియ వాంఛలనే లోయలోకి గిరవాటు పెట్ట చూస్తున్నావా?

మెఫిస్టోఫిలిస్

అబ్బే! నీకు నా మాటలు అర్థంగాక తొందరపడుతున్నావు నీ వెవ్వరవో నీకు బాగా తెలుసును, తెలిసి కూడా ఎందుకో యీ అజ్ఞానం? చక్కని తలపాగా, విలువయిన పాదరక్షలు, మెరిసే దుస్తులు, నీ పై వేషాన్ని మార్చినా - నిన్ను మార్చగలవా?

ఫౌస్టు

విద్యా విజ్ఞాన సంపదతో ధన్యుడనైనానని గర్వ పడుతున్న నన్ను ఎందుకు యీ విషమావస్థలో ముంచెత్తున్నావు? నిజమే నా విద్యా, నా విజ్ఞానమూ ఎవరిని వుద్ధరించాయి? నా పాండిత్యం నా జీవనకాసారంలో పద్మాలు పూయింపగలిగిందా? ఆ కాసారమే ఎండిపోయింది కొసరి జల మడుగున పడింది నేలంతా బీటలు వారింది. వర్షపు చినుకు పడుతుందేమోనని ఆశతో చూస్తోంది యీ ఎండిన కాసారం. కాని వాననీరు ఎన్నాళ్ళుంటుంది? లోపలగల జల యింకిపోయిందికదా. కేవలం వర్షాధారంవల్ల చెరువు నిండుతుందా?

మెఫిస్టోఫిలిస్

ఎందుకయ్యా వూరికే వాపోతావు? భారమయిన యీ చూపులతో నీకు యీ లోకసౌందర్యమేమి అర్థమౌతుంది? నేను తిరిగి యౌవనం ప్రసాదిస్తాను ఆ సవ్య రక్తంతో తప్ప నీ దృష్టి మాంద్యం తగ్గదు మార్పుకు తయారుకా, నీ జీవితమొక పూల పల్లకీ అయిపోతుంది. నాకు నేనేవచ్చి నీకు నవజీవనం ప్రసాదిస్తూ వుంటే ఎందుకీ సందేహం? నీ కండ్లలోకి తేజస్సు వస్తుంది నీ కాళ్ళు అప్పుడు నిటారుగా నిలబడతవి చేతులు వణకవు తలలో బూజుపట్టిన భావాలుపోయి, రమ్యమూ, రమణీయమూ అయిన తలపులు మొలకరిస్తవి అంతేకాదు, నీ హృదయమే ఒక నందనోద్యానవనమై పరిమళంతోపాటు నేత్రపర్వం అవుతుంది నీ సేవ చేసేందుకు సిద్ధంగా వున్నాడు యీ భృత్యుడు, నివు 'ఊ' అంటే చాలు. ఇంద్రియజ్ఞానం లేనిదే నీకు యీలోకం అర్థంకాదు నివు నిలోగల భౌతిక శక్తులను తూలనాడకు తర్జన భర్జన కొంతవరకే! నిరంతరమూ తర్జన భర్జన చేసేవారు ఎటూ కదలలేక ఒకేచోట వుంటారు చూటలే మిగిలి వారి బ్రతుకు వూసరక్షేత్ర మవుతుంది.

ఫౌస్ట్

సరేకాని ఎప్పుడు ప్రారంభిద్దాం - నువ్వు చెప్పే మధువు తాగితేనే ఆ నవజీవనం?

మెఫిస్టోఫిలిస్

నీవు ఎప్పుడు త్రికరణ శుద్ధిగా 'ఊ' అంటే అప్పుడే బయలుదేరుదాం. నా దృష్టిలో యీ నరలోకమొక నరక కూపము. మీ పాండిత్య ప్రకర్షతో యిక్కడికి వొచ్చే వాళ్ళను మీరు నలిపి పారేస్తున్నారు పండిత మండలిలో మిగిలిపోదలుచుకున్నవాళ్ళే యిక్కడ వుండాలి. నవశక్తులు మేల్కొలుపబూనిన వారికి యిది కాగు స్థలం. నా వెంటరా – గుప్త విద్యలతో నిన్ను తరుణ యువకునిగా చేస్తాను చూడు బాబూ! ఇకమీద నీకు తెలిసేది నువ్వు యితరులకు చెప్పకూడదు ఇది ప్రథమ నియమం బయట ఏదో సందడిగా వుంది మీ శిష్యగణం కాబోలు. లోపలికి వస్తామని తహతహలాడుతున్నట్లు వున్నారు వారు

ఫౌస్ట్

ఈ సమయంలో శిష్యుల నెక్కడ చూడగలను?

మెఫిస్టోఫిలిస్

పాపం! ఆ అబ్బాయి చాలాసేపటినుంచి మీ కోసం కాచుకుని వున్నాడు. వానిని సంతోషపెట్టకపోతే చిన్న నిందిస్తాడు ఏదీ నువ్వు వేసుకున్న ఆ కోటు పంట్లాం నాకియ్యి అవి నేను వేసుకొంటాను (మెఫిస్టోఫిలిస్ ఫౌస్ట్ యిచ్చిన దుస్తులు వేసుకొంటాడు)

మెఫిస్టోఫిలిస్

ఇక మన ప్రయాణపు ఏర్పాట్లు త్వరత్వరగా

చేయాలి వావుగింట వాలు (ఫౌస్ట్ నిష్క్రమిస్తాడు. మెఫిస్టో ఫలిస్ ఫౌస్ట దుస్తులతో)

మానవుడు తన సంపదలను అతిప్రియంగా దాచుకొంటాడు ఈ విజ్ఞానం, యీ శాస్త్రపాండిత్యం మొదలైన వాటిని తలచుకొన్న కొద్దీ నాకు కోపం వస్తుంది అవిమనుష్యులను వుక్కిబిక్కిరి చేయడం తప్ప దారిచూపవు. గుప్త విద్యలను నమ్మినవారికి దారి స్పష్టంగా కనబడుతుంది అట్టివారికి భూతగణం తోడుగా వుంటుంది. ఈ మహా ప్రపంచంలో సౌశీల్యమనే కర్పూరదీప మొక్కటే వెలిగించుకొని ముందుకు ప్రయాణించడం గొప్ప విషయం కావచ్చు గానివాలాదూరం నాగదుకదా! దగ్గరదారులు ఎన్నోవుండగా ఆరిపోయే దీపాన్ని అస్తమానమూ కాపాడుకొంటూ, అటు ఎవరు వెళ్ళమన్నారంటూ? అసలు నాకంటె, నా శక్తులకంటె, నాకు తెలిసిన సమస్తప్రాణులకంటె బలీయమైనది విధి విధికూడా కర్మబద్ధమై ప్రవర్తిస్తుంది. ఫౌస్ట్‌ను లోకవాసనలకు సన్నిహితం చెయ్యాలె మధువును రుచిచూచేదాకానే, పిమ్మట వదలిపెడతారా ఎవరైనా? అతనిలో గల వుపాధు లన్నిటికీ ఆశ్రయం కల్పించాలె ఈ మహాపండితుడు సకలకళాశాస్త్రపారంగతుడు, విజ్ఞానఖని, సౌజన్యమూర్తి. ఎన్ని గుణగణాలుంటే నేంగాక చివరికి శనేశ్వరుడివంటి నావలలో చిక్కాడు. నన్ను తన దానిసగా నమ్మకపోయినా, నమ్మడం తప్పనిసరిఅయింది. ఆ తెలిసీ తెలియని మైకంలో తనను నాకు అర్పించుకొంటు

న్నాడు. ఇతనికి నేను యివ్వగలదేముంది? సుఖానుభూతులు, ప్రేమపాశాలు, ఈ పుష్పమాలలే సర్వబంధాలై ఊపిరాడనీయవనీ, తన నిండు జీవితాన్ని విషపూరితం చేస్తాయనీ - యీ నిర్భాగ్యునికి తెలియదు.

---

# ఫౌస్ట్ గదిలో - 3

విద్యార్థి

ఈ మహానుభావునితో మాట్లాడడం మహా భాగ్యమని ఎందరో చెప్పగా విని ఈయన దర్శనానికి వచ్చాను.

మెఫిస్టోపిలిస

నీబోటి యువకులు నాపై వుత్సాహానికి చాలా సంతోషిస్తున్నాను నీవు వచ్చినపని వృథాకాదులే ఎవరిని కలుసుకోవలెననుకున్నావో నాకు ఎవరో ఎరుగుదువా?

విద్యార్థి

నన్ను తమ శిష్యునిగా స్వీకరించమని నా ప్రార్థన. మా అమ్మకు నేను ఇంతదూరం రావడం యిష్టంలేక పోయినా, ధైర్యోత్సాహాలతో మీ వంటి గురువుల శుశ్రూషయే నిజమగు విద్య అను నమ్మకంతో, కానుకల తీసుకొని మీ సన్నిధికి వచ్చాను

మెఫిస్టోఫిలిస్

రావలసినదగ్గరకే వచ్చావు.

విద్యార్థి

(నలుప్రక్కలా చూస్తూ) అలాగా - అలా అయితే నేను వెంటనే వెళ్ళిపోవడం క్షేమదాయకం. ఈ గోడలూ

యీ తీరూ నాకేమీ నచ్చడంలేదు. ఇంత కట్టి యిరుకులో ప్రసాదింపబడే విద్యాదానం అంతగా ప్రయోజనం యివ్వదు. పచ్చని ప్రకృతిలో, చెట్ల నీడలలో, పక్షుల పలుకులతో మన పాటలకి స్మృతి కలపాలి అక్కడ – గురువు చేసే విద్యాబోధ శిష్యునికి లాభిస్తుంది. మిగతా వాటివల్ల ప్రయోజనం సున్న.

మెఫిస్టోఫిలిస్

ఇంత చిన్నతనం నుంచి అంత పెద్ద ఆపేక్షమా? పరిసరాలకు అలవాటుపడడం నేర్చుకోవాలి. పుట్టిన పాపక కూడా తన మాతృక్షీరపురుచి తెలియడానికి కొంచెం వ్యవధి కావలసి వస్తుంది ఆ వ్యవధి వల్లనే మనిషి జ్ఞానం పొందుతాడు. ఏది పొందాలన్నా నిరంతర ప్రయత్నం అవసరం కష్టసాధన వల్లనే పొందిన వస్తువులోగల విలువ బాగా బోధపడుతుంది.

విద్యార్థి

మీరు మనస్సుకు నచ్చిన విధంగా చెప్పుతూవుంట మరొక అధ్యాపకునివద్దకు ఎందుకు వెడతాను? మీవద్దనే వుండి అన్ని విద్యలు నేర్చుకుంటాను.

మెఫిస్టోఫిలిస్

ఎందుకా సందేహం? ఇక్కడ నా శిష్యులతో కలసి మెలసి వుండటంవల్ల యీ వాతావరణం నీకు క్రమేణా అర్థమవుతుంది. నీవు వుండటానికి బస దొరికిందా?

విద్యార్థి

భోజనమూ బసా అనుకూలమైన చోట్ల దొరకాలె నని నా అభిలాష. విద్యార్థి దశలో ఏ కట్టుబాట్లులేనప్పుడె చదువు చక్కగా సాగుతుంది కొంచెం స్వేచ్ఛావాయు వులు గల చోటు ఏ దేనావుంటే మీరే శలవియండి.

మెఫిస్టోఫిలిస్

(తల తడుముకుంటూ) వుండడానికి చోటుకూడా లేని విద్యార్థి వన్నమాట

విద్యార్థి

ఎక్కడవుండాలె అన్న విషయం ఆలోచించుకొంటే కదా! ఏదో ఒకహోటల్లో బస ఏర్పాటు చేసుకొంటేసరి అక్కడ విద్యతో పాటు వినోదానికి కూడా లోటువుండదు, విలాసినులు కూడా అందుబాటులో వుంటారు

మెఫిస్టోఫిలిస్

జ్ఞానాను పుస్తకాలలో ఎంతవుంధో అంతకంటె ఎక్కువవుంది అక్కడ అనుకూలమైనచోటు లభించి నప్పుడే కదా, ఆటపాటలకు వీలు విలాసినుల సావాసం విషయంలో కొంచెం ముందు వెనుకలు ఆలోచించక పోతే, విలాసమే మిగిలి విద్య సున్న అవుతుంది. వారానికొకరోజు నాకు అతిథివిగా వుందుగాని. మిగతా ఆరురోజులూ నీదారి నీది.

విద్యార్థి

ఏమో, యీవూరు యీ వాతావరణం అన్నీ క్రొత్త గావున్నవి ఎవరేమిటో నాకేమీ తెలియడం లేదు

మెఫిస్టోఫెలిస్

ఇంతమాత్రానికే ఖంగారు పడడమా? ఈ క్రొత్త అంతా నీకు తొందరలోనే పాతదై పోతుంది ముందు చూచుకోవలసింది నీ బస పోనీ నేనొక వంటలక్క యిల్లు చూపించనా? ఆమె చాలా మంచిది యోగ్యురాలు. విద్యార్థులంటే ఎంతో ప్రాణం వాండ్ల కష్టసుఖాలు ఎరికె బాగా తెలుసు నీకు కావలసినవన్నీ ఏర్పాటు చేస్తుంది అందరూ యిచ్చేటట్లే నీవుకూడా యిస్తావుకదా!

విద్యార్థి

ఆమె బసకూడా మీ గదివలె యిరుకుగా వుంటే ఏమిచేయను?

మెఫిస్టోఫెలిస్

నీవు వూరి భయస్థుడివిలాగా వున్నావు సరేగాని, విద్య నేర్చుకునేందుకు ఎంత డబ్బు తెచ్చావు? అన్ని ఖర్చులకు సరిపోయేటంత తెచ్చుకొన్నావా?

విద్యార్థి

అంటే? చదువు పూర్తికావడానికి చాలుతుందా అనేనా మీ సందేహం?

మెఫిస్టోఫిలిస్

విద్యార్థులకు చదువు ఒక్కటేనా? ఇంకా ఇతర ఖర్చులు బోలెడు వుంటాయి మీ అమ్మగారు నిర్దేశించిన ప్రకారం నీవిక్కడ విద్యాభ్యాసం చేయకపోతే ఒక్కటీ వొంటబట్టదు చుట్టూగల నీ స్నేహితులని తృప్తిపర చాలె డబ్బుకి చాలడమంటూ వుండదు ఎంత వున్నప్ప టికీ యింకా కావాలనే అనిపిస్తుంది అందుచేత వున్నది సరిపెట్టుకోడం నేర్చుకోవాలె ఇకపోతే స్నేహితులకు పొరబాటుఁకూడా అప్పులు యివ్వకు భోజనానికేం ఖర్చవుతుంది? కావలసినదంతా బట్టలకే నీబట్టలు చూడ గానే నీ చుట్టూగలవారు నీ అంతస్తు నిర్ణయిస్తారు అధ్యా పకులకీయవలసినదానిసంగతి చెప్పనవసరంలేదుగదా!

విద్యార్థి

మీరిచ్చే సలహాలన్నీ బాగానే వున్నవి కాని యీ విద్యామందిరం ఎందుకింత సంకుచితంగా వుంది? ఏదో చీకటికొట్టులా వున్నదే! ఈ గాఢాంధకారంలోనుంచి జీవ చైతన్య ప్రకాశం ఎలా వుద్భవిస్తుంది?

మెఫిస్టోఫిలిస

విద్యామందిరం సంగతి నీకెందుకుగాని నువ్వు ఏఏ శాఖలలో కృషిచేయదలచావు?

విద్యార్థి

విద్యా విజ్ఞానాలు సంపూర్ణంగా తెలుసుకోవాలని నా కోరిక. మానవ మేధ తెలుసుకోగల జ్ఞానసంపదనంతా

గ్రహించాలని నా ఆరాటం. సర్వశాస్త్రాలూ, సమస్త కళలూ అవగాహనచేసుకోవాలనే నా తీవ్ర వాంఛ. నా మనసుని భాగ్యవంతంగా చేసుకొనేందుకు, ప్రకృతిమాత ప్రసాదించే సర్వ సాధనాలతోనూ, శ్రమించి విజయం పొందాలని నా కోరిక

మెఫిస్టోఫిలిస్

కోరికలంటే అలా వుండాలె చచ్చుకోర్కెలవల్ల ప్రయోజనమేమిటి? కాని నీ బ్రహ్మాండమైన కోరికను సాధించాలనే ఆదుర్దాతో శక్తిని చిందర వందర చేసుకో వద్దని ముందుగానే హెచ్చరిస్తున్నాను.

విద్యార్థి

సాధనలో నిరంతర కృషి చేయడానికి సిద్ధంగా వున్నాను. అప్పుడప్పుడు కొంచెం విశ్రాంతి మాత్రం అవసరమవుతుంది మధ్య మధ్య శలవురోజులుంటవిగా, అప్పుడు నా విద్యను సాధనగా మార్చి. ఏకాగ్రతతో కృషి చేస్తాను.

మెఫిస్టోఫిలిస్

నీవు ఏంచేసినా సరే! ఒక సంగతిమాత్రం గుర్తుంచుకో. కాలమనేది ఆగని మహారథం దాని గమన వేగాన్ని తగ్గించగలవారు ఎవ్వరూ లేదు ఆఖరుకు కాలాన్ని సృష్టించిన ఆ దేవుడుకూడా కాలప్రవాహవేగాన్ని తప్పించుకోలేడు. అందుచేత నీవు మొట్టమొదట తెలుసు

కోవలసిన దేమిటంటే, నీ జీవితంలో అన్నిటికంటె విలువ గలది కాలము అన్న సంగతి. నీ కాలాన్ని సక్రమంగా సద్వినియోగపరచుకునేందుకు, నిరంతర సాధనలో నీకు ఒక సోపానమై నిలిచేటందుకు ప్రథమములో తర్క శాస్త్రా ధ్యయనం సాగించు తర్కం నీ మేధకు పదును పెట్టి దానిని వీరుని ఖడ్గంలా తళతళ లాడిస్తుంది ఈ తర్క శాస్త్రమే నీ గ్రాహ్యతను సుస్థిరం చేస్తూ నిజశక్తుల వర్ధనమును సక్రమ మార్గాన నడిపిస్తుంది మేధ దానంతటది రాజ మార్గాన విహరించడం నేర్చుకొంటుంది అనుది నమూ నీవు చేయవలసిన కార్యక్రమమేమిటో ముందే నిర్ణయించుకో మనస్సును ఒక చిన్న కర్మాగారంవలె తయారు చేసుకో చేనేత మగ్గం దగ్గిర కూర్చున్న మనిషి రకరకాల కండెలని, మగ్గం మీదకు తెచ్చు కొని, అటూ యిటూ త్రిప్పుతూ, సునాయాసంగా అందమైనవస్త్రం తయారుచేస్తాడు అప్పుడతడు తన మెదడు నేమీ వుపయోగించకుండానే బహు చాకచక్యంగా, తనదైనందిన విధిని నిర్వహిస్తున్నాడు నీ జీవితం కూడా ఆ పోలికనే నడవాలె అనుదినజీవితవిషయాలకు చిత్త క్షోభ, మనోవ్యాకులత క్షేమం కాదు. నీవు ఎంతకావను కొన్నా ఒకానొక తాత్త్వికదృష్టి, నీ జీవనరంగంలో ప్రవే శించి, పనులు నడిపిస్తే తప్ప, స్వార్థాభిలాషలతో నీవు బాధ పడుతావు విద్యార్థి దశలో ఒక భావనాప్రపంచాన్ని స్వంతంగా సృష్టించలేవు స్వంతంగా సృష్టించుకోనవసరం

లేదు కూడాను. కాని ఇతరుల మహోదాత్తసృష్టిని అవగాహన చేసుకోదగిన మనోగతి అలవరచుకుంటే చాలు. సాధకుని కెప్పుడూ ఆత్మశక్తి ఒక్కటే సహాకారంగావుంటుంది అది తనకితానై వచ్చి, ఏపనీ జరపదు ఆత్మశక్తికి క్రియారూపం కలిపించేటందుకు ప్రతివ్యక్తీ ధైర్యమనే ఆయుధం ధరించాలె నివురుగప్పిన నిప్పువలె వుంటుంది ప్రకృతిశక్తి. పైకి ఆ నిప్పు కనబడదు. వేలుతో తాకితివా చుర్రుమంటుంది.

విద్యార్థి

మీరు చెప్పేదేమిటో అయోమయుంగా వుంది, తలాతోకా అంటటం లేదు.

మెఫిస్టోఫిలిస్

ఇప్పు డలాగేవుంటుంది క్రమంగా అర్థమవుతుంది కొన్ని పాఠాలు కంఠస్థం చేస్తేనేగాని మనసులో నాటుకోవు.

విద్యార్థి

మీరు చెపుతున్నదానిలో ఒక్కటీ నాకు అర్థంకావడం లేదు నాది మట్టిబుర్రేమో నాకు తెలియదు. ఈ మట్టిని ఎలా పదునుచేయడం?

మెఫిస్టోఫిలిస్

ఓపిక, ఆపైన సాధన ఇతరులమార్గం, 'మంచిది, చెడ్డది' అని ఎక్కడెక్కడి వారి మంచిచెడ్డలు తర్కించడానికి ముందుగా నీమార్గమేమిటో, నీవు చెయ్యవలసిన

దేమిటో తెలుసుకో తాను చేయవలసినది తెలుసుకోవడం లోనే మానవుని బుద్ధి వివేచనాజ్ఞానంతో పని చేయడం మొదలుపెట్టుతుంది అన్నం తినేందుకు, నీళ్ళు పోసుకునేందుకు, నిద్రపోయేటందుకు, నీవు ఆలోచిస్తున్నావా? ఆ కార్యాలు వాటంతటవి యధాతధంగా జరిగిపోతున్నవి. కాని నీ బుద్ధి పనిచేయడం మొదలుపెట్టగానే తాత్విక చింత అనునది నీ స్వభావంలో ప్రవేశిస్తుంది ఏ పనిలో నయినా సరే శ్రమలేకుండా ఫలితం లేదు. శ్రమను పట్టే ఫలితం నిర్ణయమవుతుంది. అది నీకు దృగ్గోచరం కాకపోవచ్చు, కాని ప్రకృతిలో గల ప్రధాన ధర్మసూత్రాల్లో అది మొదటిది రోజుకు ఐదుగంటల చొప్పున ఒక ఆరు నెలలు నీవు కష్టపడ్డతరువాత నీ విద్యకు అర్ధం కనిపిస్తుంది. గురు సమక్షంలో అభ్యసించిన విద్యే పూర్తిగా వంటపట్టుతుంది బట్టీపెట్టిన పుస్తకాలలో గురువు చెప్పినదంతా వుండకపోవచ్చు కాని విద్యాసంపత్తి ఈ గురువాక్యానికి, ఆ అచ్చుఅక్షరాలకు మధ్య వ్యక్తిగతమైన అనుభూతి పొందుతుంది, ఏ వ్యక్తి కావ్యక్తి అనుభవించతగిన రస సంధాన మేర్పడుతుంది

విద్యార్ధి

సరె కానివ్వండి. మీరు చెప్పినట్లు సాధన చేస్తాను. నా కృషికితగ్గం ఫలితం కనపడుతుందని మీరు హామీ యిస్తున్నారు. కనపడకపోతే నా దురదృష్టమనుకుంటాను

మెఫిస్టోఫిలిస్

ఇంతకూ నీవు ఏ శాఖలో కృషి చెయ్యాలని?

విద్యార్థి

నాకు న్యాయశాస్త్రం నేర్చుకోవాలని వుంది. అదంత కష్టమైనది కూడా కాదు

మెఫిస్టోఫిలిస్

అఁదేవద్దు ప్రతిదీ కష్టమైనదే దేనికష్టం దానిలో వుంటుంది ప్రతిశాస్త్రమూ ఆద్యంతరహితమైన జ్ఞానభాండరమే పదిపుస్తకాలు తిరగవేసినంతమాత్రాన, నీవు న్యాయశాస్త్రకోవిదుడివి కాలేవు ఆద్యంతాలు కానరాని శాస్త్రప్రపంచంలో ప్రయాణిస్తున్నాననే భావన నిన్నువదిలిననాడు, నీలో అహంకృతే మిగులుతుంది తప్ప శాస్త్రజ్ఞాన పరిశోధన పట్టుబడదు అంటువ్యాధి ఒకమనిషినుండి మరొకమనిషికి వచ్చినట్లు, ఒకవూరునుండి మరొకవూరికి ప్రాకినట్లు నియమరహిత జీవితం, దానిలోగల దుష్టవృత్తిని నల్గడలా వ్యాపింపజేస్తుంది నీవు న్యాయవాదివై యితరులను సన్మార్గవర్తనులుగా చెయ్యాలని నీ వుద్దేశం కాబోలు కోరుకోక కోరుకోక న్యాయశాస్త్రం కోరుకున్నావేమిటి?

విద్యార్థి

సరి మీకు అన్నిశాస్త్రాలూ ఒకేవిధంగా వున్నాయి మీరా మహా పండితులు - నేనా అల్పుడనైన విద్యార్థిని మీరే న్యాయంపట్ల నిరుత్సాహం కనపరిస్తే నేనేం చెప్పను పోనీ మత శాస్త్రం నేర్చుకోమంటారా?

మెఫిస్టోఫిలిస్

అబ్బాయీ నిన్ను హడలగొట్టాలని నాకెంత మాత్రమూ లేదు. నీవే నిష్కారణంగా బెదురుతున్నావు. న్యాయవాది నిజమైన న్యాయవాదిగా వుండగలడా చెప్పు? న్యాయమే ప్రధానమనుకొని చట్టప్రకారం, ప్రపంచ రీతి నీతులను, పరిశీలించ మొదలుపెట్టితే తనగతి ఏమవుతుంది? భార్యా పుత్రులని ఎలా పోషించగలడు? న్యాయవాది తాను నేర్చుకొన్న న్యాయ విద్యను, న్యాయ ప్రతిష్టాపన కోసంకాక, జీవనోపాధికై వినియోగించవలసి వున్నది. అప్పుడతడు తన ఆత్మకూ, తన విద్యకూ ద్రోహం చేస్తు న్నానని బాధపడక తప్పదు ఈ బాధవల్ల కొందరు సముద్ర తరంగాలపై తేలిపోవచ్చు, మరికొందరు అగాధంలో మునిగిపోవచ్చు. పండితుడెప్పుడూ మంచిని తన శిష్యులకు చెప్పాలని బాధపడుతూంటాడు గురువాక్యాన్ని నీకు అనువయినంత వరకు అనుసరించు.

విద్యార్థి

అంటే గురువులు చెప్పే వాక్యం అంత శక్తిమంతమన్నమాట

మెఫిస్టోఫిలిస్ :

గురువులో తేజస్సు లోపిస్తే, దానిని శిష్యునికెలా ప్రసాదింపగలడు? ఏ విషయమైనా ప్రామాణిక సత్యాలతో వీక్షించగలిగి నప్పుడే అధ్యాపక వచనాలకు గౌరవం

కలుగుతుంది. మాటలతో మార్గాన్ని వుక్కిరి బిక్కిరి చేయవచ్చు మార్గం పరిశుభ్రమైనా దానిలో కాల్పనిక కంటకాలని సృష్టించవచ్చు. తిరిగి కంటకావృతమగు మార్గాన్ని రాజవీధిగా ప్రదర్శించవచ్చు మాటలు కొంతవరకు పనిచేయగలవు అందుచే మాటలమీద కొంత నమ్మక ముంచడంలో పెద్ద నష్టమేమీ లేదు.

విద్యార్థి

మీరు మీతో మాట్లాడుకుంటున్నారో నాతో మాట్లాడుతున్నారో తెలియడంలేదు, క్షమించండి, యిలాంటి కుంటిప్రశ్న వేసినందుకు మీవంటి మహనీయులు నాకు విద్యాదానం చేయకపోతే నేనేమైపోతాను? పోనీ వైద్య శాస్త్రం నేర్చుకోమంటారా? అది నేర్చుకునేందుకు మూడేళ్లు పట్టుతుంది. వైద్యంద్వారా సోదర మానవుల దైహిక బాధ తగ్గిస్తున్నామనే తృప్తి అయినా మిగులుతుంది. ఏ శాస్త్రమయినా ఆద్యంతాలు లేనిదే అంటున్నారు. అయినప్పటికీ తమవంటివారు కరుణిస్తే నాకు వైద్యంలో ప్రావీణ్యాం లభించవచ్చు.

మెఫిస్టోఫిలిస్

(స్వగతంలో) ఇంతవరకూ యీ కుర్రకుంకను నేనొక మహా పండితుడనయినట్టుగా ఆడించాను. ఇంక యీ వేషం మార్చి అసలు వేషంలోకొస్తే? నాదికాని పాత్ర ఎంతసేపని ధరించగలను? (బిగ్గరగా) వైద్యం నేర్చుకో

వడం అంత కష్టమైన పనికాదు. వైద్యవృత్తిద్వారా ప్రపంచమంతా తెలుసుకోవచ్చు విధిదేవత మనలనెట్లు వెళ్ళమంటే అటు వెళ్ళవచ్చు. రోగి బ్రతికాడా అది మన ప్రతిభ, చనిపోయాడా అతని కాలం మూడింది. అందుచేత యీ వృత్తిలో విధాత మనకెప్పుడూ తోడునీడై వుంటాడు. అందువల్ల ఇది అంత గొప్పది కాదేమో! మనకుసాధ్యం కాదేమో అని నిరుత్సాహపడరాదు. అయినా అబ్బాయీ – నీకు ఏం నేర్చుకోవాలని వుంటే అది నేర్చుకో. నీ మనస్సు ఏది కోరుతుందో ఆ కోరిక తీర్చుకొనడానికి ధైర్య సాహసాలు నీ స్వభావానికి సాయమయేలాగ చూసుకో నీవు ఎటువంటివాడివయినా, యితరులు నీపట్ల భక్తి విశ్వాసాలు చూపెట్టేటట్లు మసలుకోవాలె. ముఖ్యముగా వైద్యుడన్న వాడికి, వైద్యుడిగా వృద్ధిలోకి రావటానికి ముందు, ఆడవాళ్ళతో సహచరించడం బాగా చేతనయి వుండాలె. వైద్యుని విషయమే తీసుకో. స్త్రీజన్మ కష్ట పరంపరలతో నిండివుంటుంది రోగాలూ, రొష్టులూ వారి జీవన ప్రయాణంలో ఒకభాగం. అవి నయమయేటందుకు బోలెడన్ని మార్గాలుండవచ్చు. కాని అంత తొందరలో నయమవడం కాదు వారికి కావలసింది. -వారి బాధలన్నీ ఎంతో వోర్పుతో వినాలె వారి మనస్సుకు వూరటకల్పించే మాటలు చెప్పి, మందు లివ్వాలి వారిలో కొందరు రామచిలుకలుంటారు వారితో మసలుకోవడమే ఒకవిద్య.

విద్యార్థి

మీ సలహాలన్నీ బాగానేవున్నాయి. కాని నాకు ఏది మొదలో ఏదితుదో తెలియడం లేదు.

మెఫిస్టోఫిలిస్

సిద్ధాంతమెప్పుడూ రసహీనంగా కనిపించేదయినప్పటికీ జీవితం మాత్రం స్వర్ణవృక్షమై పసిడికాంతులు వెదజల్లుతుంది. ఈ సిద్ధాంతభాష ఎప్పుడూ కఠినవాక్యాలతో యీ ప్రకారమే వుంటుంది నేనిప్పుడుసిద్ధాంత సారం చూచాయగా ప్రసంగవశాన చెప్పాను

విద్యార్థి

ఏమిటో ఇదంతా ఒక స్వప్నంలా వుంది, మరొకసారి మీతో సవిస్తరంగా మాట్లాడితేనే తప్ప, ముందు వెనుకలు తెలిసేటట్లు లేదు

మెఫిస్టోఫిలిస్

ఓ! తప్పక కలుసుకుందాం.

విద్యార్థి

మీ దగ్గిర సెలవుతీసుకొని వెళ్ళడానికిముందు యీ నా క్రొత్త పుస్తకంలో మీకు తోచినముక్క లేమైనా రెండు వ్రాయించుకొందామని కోరిక.

మెఫిస్టోఫిలిస్

తప్పకుండా వ్రాస్తాను

(విద్యార్థి యిచ్చిన పుస్తకంలో బరబరా వ్రాస్తాడు)

విద్యార్థి

(ఆ పుస్తకం పుచ్చుకొని అతను వ్రాసిన వాక్యాలు చదువుతాడు)

'సన్మార్గ దుర్మార్గాలు ఛేదించుకుంటూ నీవు దేవుడంతవాడవు అవుదువుగాక'

(కృతజ్ఞత చెప్పి వెళ్లిపోతాడు విద్యార్థి)

మెఫిస్టోఫిలిస్

శనైశ్చరుడు భగవంతుని కీర్తించడంకంటె అపహాస్యమేముంటుంది? సర్పరాజా, మొదట నిన్ను చూచి దేవుని ప్రతిబింబమో, ఏమో అనుకున్నాను.

(ఫౌస్ట్ ప్రవేశిస్తాడు)

**ఫౌస్ట్ :**

అంత హడావుడి చేస్తున్నావే ఎక్కడికి వెళ్ళాలని? నన్ను ఎక్కడకు తీసుకొనివెళ్ళదలిచావు?

మెఫిస్టోఫిలిస్ •

నీవు ఎక్కడికంటే అక్కడికి. మొదట సామాన్య లోకం చూపించి, ఆపైన రాజలోక సందర్శనం చేయిస్తాను. ఈ సామాన్యులమీద మత్తుమందు చల్లితినా, వారు నేను చెప్పినట్లు నడుచుకుంటారు. మనం చెప్పిన పనులు చేస్తారు.

ఫౌస్ట్

ఈ పెద్ద గడ్డంతో ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళిన

ఖాడనుకానే! ఇప్పుడిలా వెళ్ళితే యితరులు నన్నుచూచి ఎలా సహిస్తారు?

మెఫిస్టోఫిలిస్

అలా గాబరాపడతావెందుకు? ఈ కొత్త ప్రపంచం క్రమేణా అలవాటుకావాలె. ఆనందమయ జీవితం అలవాటుకాకపోతే అసలీ జీవితంలో సొగసులు ఎట్లా అర్థమవుతాయి?

ఫౌస్ట్

ఇప్పుడు మనం ఎలా వెళ్ళేది? వాహనాలున్నాయా, గుర్రాలున్నాయా? నౌకరులున్నారా?

మెఫిస్టోఫిలిస్

నీకెందుకు అదంతా? ఈ మాయ కంబలీ చూడు. ఇది పరచి దీనిమీద కూర్చొంటిమా మనం కోరినచోటికి పోయి వాలుతాము నీవింతకు ముందెప్పుడూ ఇటువంటి యింద్రజాలాలు చూచివుండవు

———

# విద్యార్థుల హోటల్లో

ఘోష్

ఏమిటలా వున్నారు? ఒకరిముఖానా దరహాసరేఖ లేదేం? అలా విచారగ్రస్తంగా వుండటం ఒంటికి మంచిది కాదు. ఎప్పుడూ నవ్వుతూవుండేవాళ్లు ఈనాడు అలా చప్పబడిపోయారేమిటి?

బాండర్

దీనికంతా కారణం నీవే. నీవేమయినా తమాషా చూపిస్తేకదా మేం నవ్వడం

ఘోష్

(శాగ్రిండర్ తలమీద ఒక గ్లాసు పానీయం అభిషేకం చేస్తూ) దీనికి వడ్డీతోకూడా యిప్పుడే ముట్టచెప్తాం కావాలంటే.

బాండర్

ఇలా చేయవచ్చా!

ఘోష్

మరి – మీరంతా ఏడుపుముఖాలతో వుంటే ఏంచేయమన్నావు?

సీబెల్

మనమిక్కడ కడుపునిండా త్రాగవచ్చు. కంఠ మెత్తి పాడవచ్చు. అంతేగాని తిన్నుకుంటే ఎలా?

ఆల్ట్‌మయిర్

నా చెవులు బ్రద్దలై పోతున్నాయి. కొంచెం దూది యివ్వండి - చెవుల్లో పెట్టుకొనేందుకు.

సీబెల్

ఇంటికప్పు లెగిరిపోయేటట్లు పాడాలంటే కొంచెం రాక్షసశక్తి కావాలె

ఫ్రోష్

అందరూ తత్వవేత్తలూ, సిద్ధాంతవేత్తలూను.

ఆల్ట్‌మయిర్

అలాగా? అలాగా?

ఫ్రోష్

నీకంటె బాగానే పాడగలనులే. నీపాట వినేందుకు రావలసింది గుడ్లగూబలేగా చూడండి అబ్బాయిలూ! యీ పాటలు అందరూ కలిసి బృందగానంవలె పాడితేనే రాణి స్తాయి. దైవసామ్రాజ్యం గురించిన పాట పాడదామా?

బ్రాండర్

ఈ రోజుల్లో సామ్రాజ్యపు పాటలు ఎవరికి కావాలె. రోమన్ సామ్రాజ్యమేమైపోతే ఎవరికి కావాలె?

సామ్రాజ్యం కలకాలం వుంటుందా? నాకు రాజు కావాలనీ లేదు, మంత్రికావాలని అంతకన్నా లేదు ఇప్పుడు మనకు కావలసింది ఒక నాయకుడు. మతాధికారి వంటి పోప్.

ఫ్రోష్

(కోకిలను వుద్దేశిస్తూ తన ప్రేమగాధను ప్రేయసికి తెలియజేయమని ఒక పాట పాడతాడు)

సీబెల్

ఈ ప్రేమలంటే నాకు మహా తలనొప్పి అవి నాకు నచ్చవు. ఆ పాటలు వినడమంటే మహా బాధ.

ఫ్రోష్

సుందరీమణులను కీర్తించని పాటలొక పాటలా? నా పాటల పల్లవిలో లావణ్యం నాట్యమాడాలె వారి నేత్రాలు అర్ధరాత్రులంత అగాధములై, వారి పెదవులు వెలుగురేఖలంత తీయనివై, వారి హస్తములు అమృత కిరణాలవలె నా జీవన భాండాన్ని ఆవరించాలె. ఈ కలలు విడిపోకుండా, ఈ స్వప్నం చెరిగిపోకుండా నా మనోహరి నన్ను తనకు బందీకృతునిగా చేసుకోవాలె.

సీబెల్

పాడు బాబూ పాడు. ఇదేగా అన్ని పాటల అడుగున వుండే అసలు పదార్థం. నీవు మోహించినపిల్ల అప్సరస. నీకేకాదు లోకానికంతా ఆమె అప్సరసకావాలంటావు! ఆమె నిన్ను చెవులు పట్టుకు ఆడిస్తూంటే, అది సరసమనీ, వినోదమనీ

అంటావు. ఆ అమ్మాయికి మరొక మిత్రుడున్నాడేమో!
నీతో మాట్లాడుతూ అతన్ని తలపోస్తున్నదేమో. ఈ
ప్రేమలు పొట్టేలు కొమ్ములవంటివి కొమ్ములెప్పుడూ పోడ
వడానికే నర్రా – అని చెప్పితే వినరు పోటుపడ్డాక విచారి
స్తారు.

బ్రాండర్

(బల్లమీద మద్దెలవేస్తూ) ఎందుకబ్బాయి ఇలా రణ
గుణధ్వని చేస్తారు. నేను చెప్పే మంచి మాటలు వినండి మీరు
బాగుపడతారు. మీరు జీవితాన్ని తనివితీరా చవిచూస్తేనే
తప్ప, వాంఛల పరమార్థం తెలుసుకుంటేనే తప్ప, మన
పాటలు పుష్టిగా వుండవు. లేకపోతే పిట్టల అరుపులవలె
వుంటవి. రసికుడు పాడే ప్రేమగీతం, యోగిపాడే భక్తి
గీతం చక్రనేమి క్రమంగాతిరుగుతూ, సామాన్యులకు వూరట
కలిగిస్తాయి. అనగా అనగా ఒక ఎలుకవుంది. ఆ ఎలుక
యింట్లో తిష్టవేసుకొని అదేపనిగా తినడంవల్ల బొర్ర పెరి
గింది. బ్రహ్మాండంగా బొజ్జ పెంచింది. ఒకరోజున వంటా
విడ దాచిన విషం దానికళ్ళబడ్డది. కనిపించినదల్లా తినడం
అలవాటు చేసుకున్న యీ ఘటం అది తినటంతోటే
బొజ్జేకాదు తనే కరిగిపోయింది, అలాగే వుంటాయి చాలా
ప్రేమలు.

ఆల్ట్‌మయిర్

ఆ ఎలుక ఎలా చనిపోయిందో నేను చెప్పనా?
దానికి చెప్పరానంత దాహం వేసింది లోపల మండి

పోయింది. అ మంటతీరే వుపాయం కనపడలేదు, అవతల బాగా వెలుతురుగా వున్నా లక్ష్యపెట్టకుండా వంటగది లోకి వచ్చింది. విషం మాటుపెట్టిన వంటావిడ 'నీకుమరణం కొద్దిసేపట్లోనే వుందని' నవ్వుకుంది. ఎలుకకు ఆ నవ్వు అర్థం కాలేదు, కాని బాధ పెంచిన ఆ ఎలుక గిలగిలా కొట్టుకొంటూ, తను బాధపడుతూ అంతమొందింది

సీబెల్

ఒక ఎలుకపిల్లను చంపడానికి యింత పన్నాగమా?

బ్రాండర్

ఆమెనే ఎందుకు అంటావు? మనదారికి అడ్డం వచ్చిన వాళ్ళను మనం మాత్రం నిలువనిస్తున్నామా?

ఆల్ట్మయిర్,

ఎలుకలో మీరు మీ నిజరూపాలు చూసుకొంటు న్నారు

(విద్యార్థు లీ విధంగా వాదులాడుకుంటూవున్న సమయాన, ఫౌస్ట్ మెఫిస్టోఫిలిస్ ప్రవేశిస్తారు)

మెఫిస్టోఫిలిస్

ఇలా సంతోష సాగరంలో మునిగివున్న మనుష్యుల దగ్గిరకు, నిన్ను తీసుకొనిరావడం ఎందుకనుకొంటున్నావు? వాళ్ళు తమ జీవితాన్ని తేలికగా తీసుకొంటూ సరససల్లాపా లతో కాలం ఎలా గడిపివేస్తున్నారో నీకు ప్రత్యక్షంగా చూపించడానికి. వీళ్ళకు ప్రతిరోజూ పండగరోజే. పిల్లి

తోకతో ఆడుకొనే బాలకుని విధంగా వీరు ఎంతకాలమైనా నవ్వులతో, కేరింతాలతో గడిపివేయగలరు. హోటల్ యజమాని వీళ్ళని యిక్కడ వుండనిచ్చినంతకాలమూ, తాపత్రయాలనుమరిచిపోయి వీళ్ళు ఖుషీగా గడిపివేయగలరు

(ఫౌస్ట్, విద్యార్థులు ఒకరికొకరు ప్రతి నమస్కారాలు చేసుకొంటారు)

బ్రాండర్

వీళ్ళవాలకం చూస్తే దేశదేశాలూ తిరిగే మనుష్యులకుమల్లె వున్నారు. బాగా చదువుకున్నవాళ్ళలా కనిపిస్తున్నారు కూడా. ఇప్పుడిప్పుడే యీవూరు వచ్చినట్లుంది.

ఫ్రోష్

నిజమే. మనవూరంటే మాటలా? పారిస్ అంతది. మనవూరంటే మనకుకాక గర్వమెవరికుంటుంది? పారిస్‌తో తులతూగకలిగింది కాబట్టే, యిక్కడివాళ్ళకు వుత్తమ సంస్కృతి అలవడింది.

సీబెల్

ఇంతకూ వీళ్ళు ఎవరంటావు?

ఫ్రోష్

అది నేను చూచుకుంటాను గాని – ఒక్క గ్లాసు యిలా యియ్యి. ఆ గ్లాసు నోట్లో పోసుకొన్నానా వీళ్ళ పుట్టుపూర్వోత్తరాలు క్షణంలో తెలిసిపోతాయి. ఆ బట్టలూ, అవీ చూస్తూంటే ధనికకుటుంబంలోని వారికి మల్లే

వున్నారు. ఆకారంలోమట్టుకు రీవిగా వున్నారు ముఖాల్లో మాత్రం తృప్తిలేదు.

సీబెల్

వీళ్ళు నాటకాలమనుష్యులేమో?

బ్రాండర్

చూడగా చూడగా అలాగే వుంది

ఆల్ట్మయిర్

నాకూ ఆలాగే కనిపిస్తున్నది.

ఫ్రోష్

ఆ సంగతి నాకు వదిలిపెట్టండి.

మెఫిస్టోఫిలిస్

(మెల్లగా ఫౌస్టతో) భూతశక్తి ఇక్కడ ప్రవేశిస్తున్నట్లు వీళ్ళకి తెలియదు. మనమూ మామూలు మనుష్యులమే అనుకుంటున్నారు

సీబెల్

(ఫౌస్ట్ నుద్దేశించి) ఆయన ఎందుకలా కుంటుతూ వున్నాడు?

మెఫిస్టోఫిలిస్

ఏమ్ - మీా దగ్గిర కూర్చోవచ్చా? ఈ వూళ్లో మంచి పానీయాలు దొరికే చోటే కనపడలేదు.

ఆల్ట్‌మయిర్

మీ రేదో వింత మనుషుల్లా వున్నారు.

ఫ్రోష్

వాళ్ళు ఎక్కడ నుంచి వచ్చింది, పసికట్టి తెలుసుకొంటాను వుండు. మీరు వస్తున్నది 'రిప్పాకే' నుంచి కదూ! హాన్స్ యింట్లో భోజనం చేసినవాళ్ళు మీ రేకదూ?

మెఫిస్టోఫిలిస్

ఈవేళ ఆయనను కలుసుకోడం పడలేదు క్రితం సారి ఆయన దగ్గిర కూర్చుని కొంతసేపు పిచ్చాపాటి మాట్లాడుకొన్నాం. తన సోదరులను గురించి ఆయన ఎంతో చెప్పారు. వాళ్ళను మేము కలుసుకుంటె, తన యోగక్షేమాలు తెలుపమన్నారు (ఫ్రోష్ కేసి చూస్తూ మందహాసం చేస్తాడు)

ఆల్ట్‌మయిర్:

(తన మిత్రులతో) మనం కొంచెం జాగ్రత్తగా మసలడం అవసరం. ఆయనకు మన సంగతంతా తెలిసినట్లు వుంది

ఫ్రోష్

మనం మరీ నిషాలోపడక కొంచెం వాళ్ళ దగ్గిర పెట్టుకోవడం మంచిది

సీబెల్

వీరు దక్షిణ ప్రాంతాలనుంచి వచ్చినట్లున్నారు. ఈ

రోజున యీ వేళప్పుడు, మీరు మా అతిథులుగా రావడం మా అదృష్టం మాతో పాటు మీరుకూడా యీ పానీయం సేవించి మమ్మల్ని ఆనందింపజేయండి.

మెఫిస్టోఫిలిస్

ఆ! తప్పక. నేను అటువంటి మర్యాదలెప్పుడూ కాదనను.

సీబెల్

(తన మిత్రులతో) పానీయ సేవనంలో యీాయన సిద్ధహస్తుడుగా వున్నాడురా

ఫ్రోష్

అయితేయేం నేనున్నానుగా విషయం రాబట్టేందుకు.

మెఫిస్టోఫిలిస్

మీరంతా పాటలు పాడుకుంటూ ఖుషీ చేస్తున్న ట్లుందే. సంగీతం బాగా వచ్చినవాళ్ళయి వుండాలె. లేకపోతే మీ కంఠాలంత ఖంగున ప్రతిధ్వనించవు బయటకు

ఫ్రోష్

మీ కాలాలాటి గానమంటె ఇష్టమన్నమాట. మీకు న్నంత శిక్షణ మాకు లేదు. అయితేనేం నలుగురితో పాటు పాడుతాం.

ఆల్ట్‌మయిర్

మీరొక్క పాటపాడండి.

ఫ్రోష్

పాటకొక పాత్రచొప్పున నింపడం మా సంప్రదాయం.

మెఫిస్టోఫిలిస్

మీరు పాట పాడమంటే కాదంటానా? తప్పక పాడుతాను

ఫౌస్ట్

నా కంఠం బాగుండదే!

సీబెల్

ఏదేనా కొత్త పాడండి విని ఆనందిస్తాం

మెఫిస్టోఫిలిస్

నా కోసం నేను ఒక పాట పాడుతాను. నా నేస్తం తరఫున రెండు పాడుతాను మీకవి నచ్చాయంటే నూరు పాటలు పాడేందుకైనా సిద్ధంగా వున్నాను. మేమిప్పుడు స్పెయిన్ దేశం నుంచి వస్తున్నాము అది ఎంత శ్రేష్ఠమైన దేశమో - మీకు తెలుసుగా! మహా రుచికరమైన పానీయాలు పుష్కలంగా లభిస్తాయి. పానీయాలకి రెట్టింపు సంఖ్యలో పాటలు వున్నాయి ఆ దేశాన. ఆకాశ వీధిలో తారకలెన్నివున్నాయో అక్కడి వారివద్ద పాటలన్ని వున్నాయి గానమాధుర్యం వారికి తెలిసినంతగా మరొకరికి తెలియదు

బ్రాండర్.

తప్పతాగి నిద్రపోతున్నపుడు నాకు అలాటివి నచ్చు తాయి. కాని మెలుకువతో వున్నపుడు అవి వినాలంటే తేళ్ళూ జెర్రులూ ప్రాకినట్లు వుంటుంది, వారు వాయించే వాద్యాలు కూడ నా కిష్టంలేదు నిద్రబట్టక, వెన్నెలను చూస్తూ కిటికీదగ్గిర నిలబడ్డ యువతీ యువకులకు తప్ప నావంటివారికి అవి బొత్తిగా నచ్చవు

ఆల్ట్మయిర్

మనం కొంచెం జాగ్రత్తగా వుండటం మంచిది. మన గుట్టూ మట్టూ ఆయన గ్రహించాడా ముందు ముందు ఇబ్బందులకు లోనవుతాం.

మెఫిస్టోఫిలిస్

మీరంతా పాటలు పాడుతూ కాలక్షేపం చేస్తున్న ట్లుందే. మీరు బృందగానంలో ఆరితేరినవాళ్లైవుండాలె. మీ కంఠాలు గాలిలో తేలియాడుతూ, బయటకి వినిపిస్తూ న్నాయి.

ఫ్రోష్

గానం అంటే మీ కిష్టమేనన్నమాట.

మెఫిస్టోఫిలిఫ్

ఏదో సరదాగా పాడటం నాకూ ఇష్టమే.

ఆల్ట్మయిర్

మరి ఒక్క పాట పాడండి

**మెఫిస్టోఫిలిస్ :**

ఒక చేమిటి కావలసినన్ని పాడుతాను.

ఫౌస్ట్

నా కంఠం బాగుండదే.

సీబిల్

మాకు తెలియని పాట ఏదైనాపాడితే సంతోషిస్తాం.

మెఫిస్టోఫిలిస్

'రాజూ జోరీగా' పాట పాడనా?

బ్రాండర్

ఏదో ఒక పాట పాడండి పాటలకు తపించి పోతున్నాం.

మెఫిస్టోఫిలిస్

(పాట పాడుతాడు)

సీబెల్,

మీకు మధుపానీయపు లోతులు తెలుసునన్న మాట

మెఫిస్టోఫిలిస్

మధుపానీయంలో రుచి ఎక్కువా, మధుర గానంలో రుచి ఎక్కువా? - అనేది చాలకాలం నుంచీ వివేకులనే వేధిస్తూన్న సమస్య

ఆల్ట్ మయిర్

గానంగానీ, మధువుగాని మరీ ఎక్కువయితే తల తిరుగుతుంది.

సీబెల్

నా విషయంలో ఆ ప్రమాదం లేదు.

ఫ్రోష్:

అయితే యిదుగో యీ గ్లాసు పుచ్చుగో. ఏపనైనా చిన్న ఎత్తున కాదు, పెద్ద ఎత్తున కావాలె.

ఆల్ట్‌మయిర్

మీరు రైన్ నదీ ప్రాంతాలనుంచి వచ్చిన వారని ముందే అనుకున్నాను.

మెఫిస్టోఫిలిస్

మరొక్కపాత్ర తెప్పించండి.

ఫ్రోష్

మీకు ఏ పానీయం కావాలి?

మెఫిస్టోఫిలిస్

నేనిప్పుడొక తమాషా చేస్తాను ఈ మర చూడండి. దీనిలో నేను పోసిన పానీయం మీకు ఏవిధంగా కావాలంటే ఆవిధంగా తయారవుతుంది.

ఫ్రోష్

నాకిప్పుడు రైన్ దేశపు ద్రాక్షరసం కావాలి చూదాం, అది మీరు తయారుచేయగలరేమో. అంతకు మించే రుచికరమైన పానీయ ప్రపంచంలో ఎక్కడా లేదు.

మెఫిస్టోఫిలిస్

(ఫ్రోష్ కూర్చున్న బల్లకు మూలగా కన్నంచేసి)
దీని అడుగున మైనం పూయకపోతే ద్రాక్ష రసప్రవాహం ఆపలేరు

ఆల్ట్‌మయిర్:

మైనానికేం కావలసినంత వుంది మా దగ్గర. బ్రాండర్ నీకెటువంటి పానీయం కావాలి?

బ్రాండర్

ధగధగా మెరిసే సారాయి సాకిష్టం

మెఫిస్టోఫిలిస్

(బల్లకు మరో రంధ్రంచేసి, ఆ కన్నం మూయడానికి మైనం వుపయోగిస్తాడు.)

బ్రాండర్

మన దేశంలోవాటికంటే, ఇతర ప్రాంతాలలో తయారయిన పానీయాలే బహు రుచికరంగా వుంటాయి

ఆల్ట్‌మయిర్:

నెత్తురు కాలువలగా కనపడే ఆ ద్రాక్షరసం నిశ్చయంగా ఫ్రాన్సులో తయారుచేయబడ్డదే ఫ్రెంచి ప్రజలంటే నాకు మహా చికాకు కాని ఫ్రెంచివైన్ అంటే ప్రాణాలిస్తాను

సీబెల్

పులిసిన సారాయం టే నాకు పరమ అసహ్యాం. పానీయమెప్పుడూ నాలుకకు తియ్యగా తగలాలె.

ఫ్రోష్

(అందరినీ వుద్దేశిస్తూ) మీరు చేస్తున్నదంతా ఏమిటి? మీకు కావలసిన పానీయం సమకూర్చేందుకు ఇదుగో పక్కన ఈయన వున్నాడుగా!

మెఫిస్టోఫిలిస్

మీరు కోరిన దేశపు ద్రాక్షరసం ప్రవాహమై పారుతూంది చూడండి.

ఆల్ట్ మయిర్

ఇదంతా మాయకాదుకదా! ఇది నిజమైన పానీయమేనా? లేక రంగునీళ్ళా? కాని మీవంటి పెద్దమనుషులు మమ్మి మోసం చెయ్యరని భావిస్తున్నాము

మెఫిస్టోఫిలిస్

మీరూ మర్యాదస్థులే — మేమూ మర్యాదస్థులమే. మర్యాదస్థులు ఒకరినొకరు, అనుమానించుకోరు. మీరు కోరిన సరుకును ఇవ్వడమే మా లక్ష్యం.

ఆల్ట్ మయిర్

అయితే ఎవరు కోరుకున్నవి వారికి ప్రసాదిస్తారన్న మాట.

మెఫిస్టోఫిలిస్

(బల్లలపై కన్నాలుచేసి వాటిని మైనంతో పూసి ఏదోవింత అంకెలు బల్లపై వ్రాస్తూ) పొట్టేళ్ళు కొమ్ములను మోస్తున్నట్లు, ద్రాక్షతీగెలు ద్రాక్షపండ్ల గుత్తులను మోస్తాయి ఈ కొయ్యబల్ల ఒక ద్రాక్షవనమై మీరు కోరిన మధువు నిస్తుంది. స్థూలంగా కనిపించే యీ రంధ్రాలు మీ కనులకు మైకం కలిగించేందుకుకాదు-ద్రాక్ష మధువు స్రవించేటందుకు.

ఆల్ట్‌మయిర్

ఇదంతా మాయరా బాబూ మాయ! ఈయనగారొక మాయలమారిలాగా వున్నాడు

(ఎవరిగ్లాసు వారు నింపుకొని పానీయం బయటకు తీసుకొంటున్నారు ఎంత త్రాగినా ఇంకా వస్తూనేవుంది ఆ ద్రాక్ష మధువు)

మెఫిస్టోఫిలిస్

యువకులారా కొంచెం జాగ్రత్త అవసరం గ్లాసు నింపుకొన్నతర్వాత రంధ్రం మూయడం మరిచిపోవద్దు.

(అందరూ వెర్రిగా పాటలు పాడుతూ తాము నరులో వానరులో తెలియనిస్థితిలో వుంటారు. అందరూ - మీవంటి అతిథికి స్వాగతం-అని మెఫిస్టోఫిలిస్‌ని అభినందిస్తారు)

మెఫిస్టోఫిలిస్

అటుచూడు మహాపండితుడా! ఆ యువకులు చీకూ చింతా లేక ఎలా ఆనందిస్తున్నారో. ఈ చింతలన్నీ నీరసమైన మెదడు కల్పించేవి సుమా!

ఫౌస్ట్

ఇక్కడ వుండటం నాకు యిష్టంలేదు ఇక బయలు దేరుదాం పద.

మెఫిస్టోఫిలిస్

కొంచెం వోపిక పట్టు. జిహ్వా చాపల్యం వారిని, వారిమాటను, మనసును ఏవిధంగా మార్చివేస్తుందో ప్రత్యక్షంగా చూడు వారి నిజరూపాలు యిటువంటప్పుడే బయటపడతాయి

(తమ ఆనందాన్ని కీర్తిస్తూ అందరూ బిగ్గరగా పాట పాడుతూంటారు సీబెల్ చేతులో వున్న పాత్ర గభాలున నేలమీద పడటంతో అగ్ని రగులు కొంటుంది. అది సీబెల్ చుట్టూ వ్యాపిస్తుంది)

సీబెల్

నరకమనగా ఏమిటి? ఈ మంటలే కదా! మంట లారా నన్ను చుట్టు ముట్టివేయండి.

బ్రాండర్

ఇదంతా ఏదో గారడీ. మనం త్రాగినది మాయా జలం.

మెఫిస్టోఫిలిస్

ఇదొక అగ్నిజ్వాల మహాగ్నిలో ఇది ఒక చిన్న కణము. దీనికింత భయమెందుకు?

సీబెల్

మే మెవరిమో మీకు తెలియదు. తెలిస్తే మీ రిట్లా ప్రవర్తించేవారు కారు

ఫ్రోష్

భయం దేనికి – మరో తమాషా చెయ్యండి

ఆల్ట్‌మయిర్

వాళ్ళు ఇంకా కొంచెంసేపు ఇక్కడవుంటే మించి పోయిన దేమిటి?

సీబెల్

ఇటువంటి మోసగాళ్ళకు మనం అవకాశం యివ్వ కూడదు.

బ్రాండర్

కొంచెంవోపిక పడదాం. ఏం జరుగుతుందోచూదాం

(ఆల్ట్‌మయిర్ బిరడా తీయగా, అందులో నుంచి నిప్పువచ్చి అతన్ని చుట్టివేస్తుంది వాళ్ళందరూ కత్తులు చేతపుచ్చుకు మెఫిస్టోఫిలిస్ మీాదకు వస్తారు.)

మెఫిస్టోఫిలిస్

అంతా మాయ. జగమే ఒక గారడీ. మీ మెదడె మీ చుట్టూ భ్రమలు పన్నుతోంది.

ఆల్ట్ మయిర్

ఇంతసేపూ నే నెక్కడ వున్నాను?

ఫ్రోష్

ఈ కొండకోనలకు ద్రాక్షతీగెలతో నిండుతనం వచ్చిందే?

సీబెల్

ఎంత అందమయిన పండ్లు.

ఆల్ట్ మయిర్

ద్రాక్షపండ్ల గుత్తులకంటె వాంఛింప తగ్గవి ఏమున్నవి?

మెఫిస్టోఫిలిస్

చూడండి నే నిదంతా గారడీ అనీ, మాయఅని అంటే మీకేమి నమ్మకం కలుగలేదు మనచుట్టూ అదృశ్య భూతాలు పచార్లు చేస్తున్నాయి ఆ భూతాలు మిమ్మలను సుఖదుఃఖాల వుయ్యాలలో పడుకోబెట్టి వూపుతున్నాయి.

బ్రాండర్

గారడీవాళ్ళు చూస్తూండగానే మాయమయ్యారు. (మెఫిస్టోఫిలిస్, ఫౌస్ట్ వెళ్ళిపోతారు.)

ఆల్ట్ మయిర్

క్రింద గదిలోకి వారు వెళ్ళడం చూశాను. అక్కడి నుంచి ఎలా పారిపోయారో! నా కాళ్ళేమిటి? ఇనుప పాదాలై పోయాయి.

బ్రాండర్

ఇక మనం ఇండ్లకు చేరుకుందాం.

ఫ్రోష్

రాణాలో ఈ సంగతి ఫిర్యాదుచేసి ఆపైన యిల్లు చేరుకొందాం.

ఆల్ట్ మయిర్

(బల్లకేసి చూస్తూ) ఇంకా ద్రాక్షరసం పూరుతూనే వుంది.

సీబెల్

అంతా మోసం ఇదే కనికట్టు

ఫ్రోష్

మీరు పోతేపోండి నేను మాత్రం కడుపునిండా తాగుతాను

ఆల్ట్ మయిర్

మనమిప్పుడు అనుభవించిందంతా నిజమా? కలా?

---

# మంత్రకత్తె యింట్లో

(లోపలవున్న పొయ్యిమీద ఒక పెద్ద అండా. పైకి పొగ లేస్తున్నది. ఎన్నో రకాల విగ్రహాలు కనబడు తున్నవి. ఒక కోతి పెద్ద అండా దగ్గిర కూర్చొని పొయ్యి మీది అండా లోపలి పదార్థం పైకి పొర్లిపోకుండా తెడ్లతో కలుపుతుంటుంది ఆడకోతి తన పిల్లలతో ఆ ప్రక్కగా చలికాచుకుంటున్నది. గోడలమీదా, కప్పు క్రిందా మంత్రిగాళ్ళు వుపయోగించే వస్తువులు అమర్చ బడి వున్నాయి. మెఫిస్టోఫిలిస్ ఫౌస్టను వెంటబెట్టుకొని వస్తాడు)

ఫౌస్ట్

ఇదంతా మంత్రగాళ్ళ వాతావరణం. నన్నిక్కడికి ఎందుకు తీసుకొని వచ్చావు? ఏదో కొంపమునిగిపోయినట్లు వెంటపెట్టుకొనివచ్చావు నాకు కావలసిన శాంతి యిక్కడ లభిస్తుందా? ఈముసలితొొక్కు నాకీయగలిగిందేమిటి? అది ఒట్టి మాయావివిలె ఉన్నది

మెఫిస్టోఫిలిస్

ఎందుకీ తొందరపాటు? నిన్ను నవయౌవనునిగా

చేయగల కాయకల్పరసాయనం యీ మంత్రకత్తెవద్ద వుంది.

ఫౌస్ట్

ఈ ముసలిదానిదగ్గరా?

మెఫిస్టోఫిలిస్

నీవు చేతిలో పార పుచ్చుకుని అక్కడ ఆస్థలం త్రవ్వి

ఫౌస్ట్

పార చేతితో పుచ్చుకోవడమా? అది నా చేతనయ్యే పనికాదే!

మెఫిస్టోఫిలిస్

నీవు కాయకష్టం చేసిన మనిషివి కావని నాకు తెలుసును. కనుకనే యీ మంత్రకత్తెవద్దకు తీసుకునివచ్చాను ఆమె యిచ్చే ఔషధం నీవు సేవింగావా

ఫౌస్ట్

ఈమె తెలివితేటలమీద నాకేమీ నమ్మకం కుదరడం లేదు.

మెఫిస్టోఫిలిస్

నీవు ఓపికపట్టు ఈ ముసలిది పిశాచగణాన్ని సేవించి ఎన్నో ఓషధులు సాధించి గుప్త విద్యాబలంతో యీ రసాన్ని తయారుచేసింది చూడు, ఆ వానర మూక ఆమె చెప్పుచేతల్లో ఎలా మసలుతూ వున్నదో!

వానరములు

మంత్రగత్తె కనబడడం లేదేమని అడుగుతున్నారా?
భోజనం వేళయి పై కప్పులో నుంచి చక్కా-దూరిపోయింది

మెఫిస్టోఫిలిస్,

ఎంత సేపటికి వస్తుందో మీ అమ్మగారు?

వానరములు

ఇదిగో మా చేతినిండా పని పెట్టిందిగా పని పూర్తి చేసేవేళకు ఆవిడ ప్రత్యక్షమవుతుంది

ఫాస్ట్

కోతుల జాతిలో కూడా యింత వికారపు జంతువులను నే నెక్కడా చూడలేదు.

మెఫిస్టోఫిలిస్

కోతుల్లారా! ఆ కాగే పదార్థంలో ఏమేమి వేశారో చెప్పరూ?

జంతువులు

బీదసాదలకు అనుకూలమైన అమృతరసం తయారు చేస్తున్నాము.

మగకోతి

(మెఫిస్టోఫిలిస్‌ను సమీపిస్తూ) ఎప్పుడూ ఆటలో నీవే గెలవాలెనని కాంక్షించడానికి బదులు నాకుకూడా ఒక

నారి అవకాశ మివ్వకూడదా? డబ్బుగలవాండ్లను చూస్తే నాకు చాలా ఏడుపుగా వుంటుంది. చదరంగమాడదామా?

మెఫిస్టోఫిలిస్

మీరాడుతూవుండండి నేను చూస్తాను

కోతి

(ఒకబంతి తెచ్చి ఆడుతూ) ఈ బంతికి మల్లెనె లోకం క్రిందకీ – మీదికీ – ఎగురుతూ, గిరగిర తిరుగుతూ, వుంటుంది గాజువలెనే చప్పుడు చేస్తూ, గాజువలెనె పగిలి పోతూ, గాజులో శూన్యమువలె తళుకుబెళుకుమని మెరుస్తుంది. అబ్బాయీ! శూన్యంలోకి వచ్చావా చనిపోతావు ఈ పాత్రను గాజుతో చేశారు మట్టిపాత్రలాగా ముక్కలై పోతావు తధ్యం.

మెఫిస్టోఫిలిస్

అ జల్లెడ ఎందుకండీ కోతిగారూ?

మగకోతి

ఈ జల్లెడ ముఖానికి అడ్డుపెట్టుకుని చూస్తే – నీవు దొంగవో దొరవో, దగాకోరువో మంచివాడవో ఒక్క-క్షణంలో తేలిపోతుంది

మెఫిస్టోఫిలిస్

ఆ అండాలో ఏమున్నదో స్పష్టంగా చెప్పారుకాను

ఆడకోతి, మగకోతి

ఆ అండాలో వున్నది ఏమిటో నివే గుర్తు పట్టలేకపోయావా! భేష్ భేష్! (గంతులు చేస్తాయి)

మెఫిస్టోఫిలిస్

పెద్దవాణ్ణి - నాతో పరియాచకాలాడవచ్చా?

మగకోతి

ఘనత వహించిన పెద్దమనిషీ! ఆ చీపురుకట్ట చేత పుచ్చుకొనివచ్చి యీ కుర్చీలో ఆశీనులుకండి

(మెఫిస్టోఫిలిస్ కోతులతో సంభాషిస్తున్న సమయాన ఫౌస్ట తనకు సమీపమున ఒక అద్దం వుండడము చూచి అందులో ప్రతిబింబము చూసుకోడానికా అన్నట్లు అటుకేసి వెళ్తాడు)

ఫౌస్ట్.

ఈ కనబడుతున్నదంతా ఏమిటి? ఇది నిస్సందేహంగా యింద్రజాలమే. ఈ అద్దం కూడా ఏదో మాయామయమైనదే! ఈ అద్దంలో వున్న ప్రతిబింబాన్నికదా నేను ప్రేమిస్తున్నది. ఏమిటిది! ఇందులో నా రూపం కనబడటంలేదే! ఎవ్వరో అప్సరస ఈ గాజుముక్క వెనుక నుండి నన్ను అహ్వానిస్తున్నది ఏమి ఆ దివ్యసుందర విగ్రహం! ఆ మంగళమూర్తి సాన్నిధ్యంలో సంశయాలన్నీ పటాపంచలయిపోతాయే! నాకే ఆ మనోహరమూర్తి ముందు నిలబడగల శక్తి వుంటేనా? ఇటువంటి రూపలావణ్యరేఖ, ఈ అత్యద్భుతాల తటిల్లత, ఈ దీర్ఘ జీవితంలో ఒక్కనాడూ తటస్థపడలేదే! ఇంతటి సౌందర్యవతులు ఈ లోకంలో వున్నారా?

మెఫిస్టోఫిలిస్

సోదరా నీ మనోభీష్టం నాకు తెలుసు. నీ మనః ఫలకంపై చోటు చేసుకొంటున్న ఆ సుందరమూర్తి ఎవరో కూడా నాకు తెలుసు ఆమెను నీదానినిగా చేస్తాను. దేవుడు యీలోకంలోకి పంపిన అమృతభానువును, ఆ అందాల బాలను నీ అరచేతులలో నిలబెడతాను. నీ వాంఛలో తప్పేమీ లేదు ప్రేమోపాసన మానవ స్వాభావిక లక్షణము. ఇన్నాళ్ళకు నీ ప్రణయదేవతను నీవు గుర్తించావు ఈ సేవకుడు నీ కోర్కె నెరవేరుస్తాడు నీవిప్పుడు పెండ్లికుమారుని దుస్తులతో ఆమె ముందు ప్రత్యక్షం కావాలె. సింహాసనంమీద రాజు ఎంత ఠీవిగా కూర్చుంటాడో నేనీ కుర్చీలో అలా కూర్చున్నాను. రాజ దండంలాగా చేతిలో చీపురుకట్ట వున్నది. ఇక నెత్తిమీదికి కావలసింది ఒక్క కిరీటమే

(ఇంతవరకూ వారిముందు తారట్లాడుతున్న జంతువులు వింత సూచనలతో లోనికిపోయి కిచకిచ లాడుతూ ఒక కిరీటాన్ని తీసుకువస్తాయి)

జంతువులు

ఇదుగో! ఇది స్వేదజలంతో, రక్తబిందువులతో నిర్మితమైన అపరంజి కిరీటము. (కిరీటాన్ని ముందుకు విసురుతాయి. ఆ కిరీటం రెండుముక్కలవుతుంది) అనుకొన్నది అయిపోయింది చెప్పాలసింది చెప్పేశాము.

చూడవలసింది చూచాము. వినవలసింది విన్నాము. పాడవల సింది పాడుతున్నాము.

ఫౌస్ట్

(రెండు చెవులూ మూసుకొని అద్దంకేసి చూస్తూ) నాకు మతి చెడేదాకా నీవు వూరుకునేటట్లు లేదు. ఇక్కడ యింకా కొంతసేపువుంటే నేను పిచ్చివాణ్ణయిపోతాను.

మెఫిస్టోఫిలిస్

(జంతువులని అల్లరిచేయవద్దని సైగచేస్తూ) నీకేమిటి, నాకూ తలతిరిగిపోతూవుంది.

ఫౌస్ట్

భరించలేని తాపం నన్ను దహించివేస్తున్నది. తక్షణం పోదాం యిక్కడినుంచి పద.

మెఫిస్టోఫిలిస్

ఈ జంతువులు మాట్లాడే మాటల్లో ఎటువంటి పరమ రహస్యాలున్నాయో నీవు గ్రహించలేక ఖంగారు పడుతున్నావు. మానవులకు వలెనే వాటికీ కవితా వూహాలూ ఉన్నాయి. (అండాలోని ద్రవ పదార్థం మసలి పోతోంది దానిలో నుంచి ఒక మంటవచ్చి ఇంటికప్పు అంటుకొంటుంది. మంత్రకత్తె ఆ కప్పులోంచి హాహాకారాలు చేస్తూ క్రిందకు వస్తుంది)

మంత్రకత్తె

చవటదద్దమ్మలారా! అది పొంగిపోతూంటే చూస్తూ గంతులు వేస్తున్నారా? మంట సరిచెయ్యాలని అది పొంగి మంట లోపడితే అంటుకుంటుందని మీకు తెలియదూ? మీకింకా ఎప్పటికి బుద్ధివస్తుంది మీవంటి సోమరిపోతులు జన్మ జన్మాలకూ బాగుపడరు (మెఫిస్టోఫిలిస్ - ఫౌస్టల వైపు చూసి) ఎవరయ్యామీరు? ఇక్కడికి ఎలావచ్చారు? ఏంకావాలె బాబూ మీకు? (వాళ్ళ సమాధానంకోసం నిరీక్షించకుండా, తెర్లిపోయే పదార్థాన్ని తెడ్లతో తిప్పుతుంది. కోతులు కిచకిచలాడుతాయి)

మెఫిస్టోఫిలిస్

(చీపురుకట్టతో మంటలార్పుతూ) ఏయ్ ముసలీ! అండా పగలకొట్టి అదంతా నేలపాలు చేస్తాను. నేననర్నో గుర్తుపట్టలేక పోయావనుకొంటా నీ పితృసమానుణ్ణి నీ ప్రభువును, పిశాచగణ పరిపాలకుణ్ణి. మారువేషంలో వున్నంతమాత్రాన గుర్తుపట్టలేనంత మందబుద్ధివయి పోయావా నువ్వు? ఈ కోడిపెట్ట ఆనవాలు పట్టీయలేవా?

మంత్రగత్తె

క్షమించురాజా! క్షమించు గుర్రపు డెక్కలూ, నల్లకాకులూ కనబడక గుర్తుపట్టలేక పోయాను అపచారం చేశాను మన్నించు ప్రభూ, మన్నించు

మెఫిస్టోఫిలిస్

సరి. క్షమించాం. మనం కలుసుకొని ఎన్నాళ్లో

అయింది. ఏమిటి? ఈ చుట్టుపక్కల చాలా అరాజకంగా వుందని మాకు ఫిర్యాదు వచ్చింది. నీవూ వుత్తరాది భూతమూ కలహించుకొన్నారట నిజమేనా? నేనీ మధ్య మానవలోకంలో ఎక్కువ తిరుగుతున్నాను. అందుచేతనే మచం వేషంకూడా మార్చేసుకొన్నా. ఇక్కడ పని తగిలింది.

మంత్రకత్తె

(సంతోషంతో గంతులువేస్తూ) మిమ్మలను ఒక ప్రభువుగా యీ రూపంలో చూడటంతో నా చిన్ననాటి తలపులన్నీ ప్రజ్వరిల్లుతున్నాయి

మెఫిస్టోఫిలిస్

ఊఁ! అవన్నీ కట్టిపెట్టు.

మంత్రకత్తె

తమ ఆజ్ఞ.

మెఫిస్టోఫిలిస్

చెడునుండి బయటపడాలని – యీ మానవులు ఒకే పట్టున తాపత్రయపడుతున్నారు. ఈలోకంలో చెడ్డది లేకపోతే మంచిది ఫలానిదని ఎలా నిరూపణ అవుతుంది. ఇప్పుడు నేనొక చిన్ననాటకం ఆడుతున్నాను. ఆ నాటకంలో నీవుకూడా యథోచిత పాత్ర నిర్వహించాల్సివుంది.

మంత్రకత్తె

నాటకాలు వేయడంలో నాకు మీరు చిన్నప్పుడే తర్ఫీదు యిచ్చారుగా

మెఫిస్టోఫిలిస్

(ఫౌస్ట్‌తో) వింటున్నావుగా మా సంభాషణ. ఈ మంత్రకత్తెల దగ్గరకు ఇలా దబాయిస్తూరావాలె లేక పోతే వాళ్ళు మాట వినరు

మంత్రకత్తె

నేను మీకు ఏవిధంగా సేవ చేయగలనో చెప్పి నన్ను సంతోషపెట్టరూ?

మెఫిస్టోఫిలిస

నిండు యౌవనాన్ని ప్రసాదించే ఆ పానకం మాకు గ్లాసునిండా యివ్వాలె. జవసత్వాలను ద్విగుణీకృతం చేస్తూ, జీవితమే ఒక వసంతఋతువుగా చేయగల మధుర రసం మాకివ్వాలె

మంత్రకత్తె

అంతకంటేనా! తయారుగానే వుంది ఈ సీసాలో నేను రుచిచూచాను కూడా చాలా బాగుంది వాసనా గీసనా వుండదు. ఇద్దరూ చెరోగ్లాసూ నింపుకోండి ఈపానీయంలో గల కిటుకులు మీ మిత్రునికి చెప్పేరా?

మెఫిస్టోఫిలిస్

నీ కదంతా ఎందుకు? అప్పుడప్పుడే పాకమయిన సరిక్రొత్త పదార్థం, అక్కడికక్కడే పుచ్చుకొందామని ఇలా వచ్చాం అతిథి మర్యాద నిలబెట్టుకోవాలె.

(మంత్రకత్తె సంజ్ఞలతో తన [?] పనంతా చేసుకొంటుంది. ఒక గీతగీసి దానిమధ్య వింతవస్తువులు పెట్టుతుంది.

గ్లాసులు చప్పుడవుతాయి. అండా చప్పుడుచేస్తుంది. ఆ ధ్వనులనుండి ఒక వికృతమైన సంగీతం వుద్భవిస్తుంది. కోతులువచ్చి ఆ గీతలోపల వాటిమీద కూర్చుంటాయి. వాటిమీద మంత్రగ్రంథం వుంచుతుంది మరికొన్ని కోతులు కిటికీలలో దివిటీలు పట్టుకొని నిలబడతాయి బల్ల వెనుక నున్న మంత్రకత్తె ఫౌస్ట్‌ని దగ్గిరకు రమ్మని సైగచేస్తుంది)

ఫౌస్ట్:

(మెఫిస్టోఫెలిస్‌తో) ఇదేమీ నాకు నచ్చడం లేదు. ఆ వికారపు చేష్టలు చూడడానికి కూడా అసహ్యంగా వున్నాయి ఎప్పటికి కిక్కడనుండి తెమలడం?

మెఫెస్టోఫెలిస్

వైద్యుని వద్దకువచ్చి రోగం దాచుకొంటారా ఎవరైనా? నీ గాంభీర్యం అర్ధరహితంగా వుంది. ఆమెకు మూలికా వైద్యం తెలుసు కనుక జపతపాలతో ఆపానకం తయారుచేసి యిస్తున్నది

(మెఫిస్టోఫెలిస్ - ఫౌస్ట్‌ను మంత్రమండలంలోకి సంపుతాడు ఆవిడ మంత్రాలు చదువుతూవుంటుంది)

మంత్రకత్తె

నీవు తెలిసికొనవలసింది ఇదే? ఏకత్వం నుండి - దశాంశని నిర్మిస్తూ, దానినుంచి రెండు తీసెయ్యి. అదేవిధంగా మూడును కూడా తీసెయ్యి మరి మూడింటిని వదలిపెట్టు. అక్కడితో సౌభాగ్యమంతా నీదే అవుతుంది. ఇవి

మంత్రకత్తె మాటలు నాలుగు విషయంలో జాగ్రత్తగా వుండి అయిదులో నుంచి ఆరులో నుంచి, ఏడు ఎనిమిది చెయ్యి అప్పుడంతా అయిపోయినట్లే! తొమ్మిది అంటే ఒకటి - పది అంటే పూజ్యం. (మంత్రం ఒకసారి వేస్తుంది) ఇది నా మంత్రకట్టు దీనికి నీవు బద్ధుడవు.

ఫౌస్ట్

ఈ ముసలిది ఉన్మాదినివలె వాగుతోంది.

**మెఫిస్టోఫిలిస్ :**

ఓపిక పట్టవోయీ మహానుభావా! తదంగమంతా యింకా పూర్తికాలేదు. మంత్ర శాస్త్రంలో నీకు తెలిసింది చాలా స్వల్పం. గుప్త విద్యలు కొందరికే పట్టుబడతాయి. ఇది పండితుల కర్ధమయ్యే విద్యకాదు భూత భవిష్యత్ వర్తమానాలనేవి - ఒకే నిలువు గీతలోని మూడు విభాగాలని గుర్తించినది యీ గుప్త విద్య ఒక్కటే మానవుడు నిర్మించిన కళలద్వారా నీ కర్ధమయ్యేది సంప్రదాయ జ్ఞాన మొక్కటే. మూడు ఒకటిద్వారా అనడంలో సంకేతార్థం అదే సత్యమనే సూర్యుడ్ని మాయ అనే మబ్బులతో, చాలా కాలంపాటు కప్పవలసి వుంటుంది. అది నీవూ నేనూ చేయడంలేదు. విశ్వ ప్రభువు చేస్తున్నాడు మానవులు నిత్యమూ - తాము ఏమో ప్రజ్ఞావంతులమనుకొంటూ, తమలోగల మూర్ఖతను గుర్తించరు, శబ్దం ఎంతకూ అర్థం చెప్పదే అనుకొంటారు గాని శబ్ద తరంగాలలో కొంత పటుత్వముందని, ఆ శబ్ద జపమువలన తమ కర్థంకాని

కొన్ని నిద్రాణశక్తులను సన్నిహితంగా ప్రయాణము చేస్తు న్నామని భావించరు.

మంత్రకత్తె

సిద్ధాంతమొక శక్తి. లోకాన్నంతనూ బలమైన భావాలతో కట్టివేయడమే దానిలోగల శక్తి వుత్పాదనకు కారణం ప్రజలు అజ్ఞానులైనంత మాత్రాన బాధ లేదు. ఎవరి మెదడు యీలోక సుఖదఃఖాలను అర్థం చేసుకోవడానికె భద్రంగా వుంటుందో, ఎవరి మేధాకవాటాలు ఏనాడూ తెరవబడకుండా వుంటాయో – వారికే సిద్ధాంత పరమైన గుప్త విద్యలు అలవడగల అవకాశమున్నది.

ఫాస్ట్

దీని పిచ్చివాగుడుతో నా బుర్ర పగిలిపోతోంది. ఈలోకంలో వున్న లక్షలకొలది వెర్రిబాగులవాళ్ళు ఏక కంఠాన మాట్లాడుతున్నట్లుంది

మెఫిస్టోఫిలిస్

సుంత్రసారికా! ఇక ఆలశ్యం చేయకు. మాకు అవతల బోలెడంతపని వుంది. ఆ పానీయమేదో నా మిత్రునికి తొందరగా అందించు ఈయన జగదేక పండితుడు. ఇటువంటివానికి నవజీవనం ప్రసాదించి నివు నాకు మేలు చేస్తున్నావు.

(మంత్రకత్తె ఫాస్ట్‌కు పాత్ర యివ్వబోతూండగా ఆ పాత్రలోనుండి చిన్న మంట వెలువడుతుంది)

మెఫిస్టోఫిలిస్

ఆ అగ్నికీలపై కన్నులుంచి ఆ పాత్రలో వున్నది గొంతులో పోసుకో. నేను పుచ్చుకొంటున్నట్లే పుచ్చుకో. నీ గళంలోంచి అది లోపలికి వెళ్ళడమేమిటి నీ రక్తమూ, శరీరమూ, యావత్తూ మారిపోవడమేమిటి, నిమేష మాత్రంలో జరుగుతాయి (ఫౌస్ట్ ఆ పదార్థం పుచ్చుకొంటాడు)

మెఫిస్టోఫిలిస్

ఇక నీవు విశ్రాంతి కోరవు బయలుదేరుదామా మన ప్రయాణంమీద? నీలోగల శక్తి నలువైపులకీ ప్రసరించడానికి ఇక తహతహలాడుతుంది.

మంత్రకత్తె

నా ఔషధం మీకు దివ్యంగా పనిచేస్తే మా ప్రభువు నన్ను కనికరిస్తాడు.

మెఫిస్టోఫిలిస్.

ఓ! నీ కోరికలు తీర్చడానికేం! నిరభ్యంతరంగా. వాల్‌పర్గీస్ పర్వతంమీద కలుసుకొందాం. (ఫౌస్ట్‌తో) ఇకనుండి నువ్వు పూర్తిగా మారిపోతావు. నీ హృదయ ధర్మము, నీ దేహ లావణ్యము మారిపోతవి. నీ కన్నులలో ఒక తేజము, నీ రక్తంలో వెచ్చదనం వస్తాయి. ఈ నవ జీవన శక్తి నీలో రసికత్వాన్ని మేల్కొలుపుతుంది. జలపాతంవంటి రసికత్వంలో విద్యుద్వాహికవి అయిపోతావు.

ఫాస్ట్

అయితే ఆ అద్దం మరొకసారి చూపించు. నాకా అద్దంలో వెనుకటి స్త్రీ కనబడుతుందా?

మెఫిస్టోఫిలిస్

ఇప్పుడుకాదు. ఆ అప్సరసాంగన అందం నీకు ప్రతి స్త్రీలోనూ కనబడుతుంది. హెలెన్ వంటి అందగత్తెలు ఎందరెందరో నీకు తారసబడుతారు నీకోసం తారట్లాడుతారు.

---

# బజారు వీధిలో

(సాయం సమయాన రాజవీధిలో సామాన్య కుటుంబానికి చెందిన లావణ్యావతి మార్గరెట్ వెళ్లు తూవుంటుంది. ఫౌస్ట్ ఆమె వెనక వస్తూవుంటాడు.)

ఫౌస్ట్

నీవు నిజంగా అందాలరాసివి నీవెంట నేను అలా కొంతదూరం నడువవచ్చునా?

మార్గరెట్

(స్వగతం) ఏమి నమ్రత, ఏమి పొగడ్త. నేను అందగత్తెనా? ఇంతవరకూ ఆ ప్రకారం నన్ను ఎవరూ అభినందించలేదు. (ప్రకాశంగా) మాయింటిదారి నాకు తెలుసు. మీరు నావెంటవచ్చి – నన్ను దిగబెట్టనక్కరలేదు. (ఫౌస్ట్ నుంచి తప్పించుకొని వెళ్ళిపోతుంది మార్గరెట్)

ఫౌస్ట్

ఆమె ఎంత అందంగా వున్నది! అటువంటి అపురూపమైన అందాన్ని ఇంతవరకూ ఎక్కడా చూడలేదే! ఆ మాటలు ఆమె కులీన కుటుంబానికి చెందినట్లుగా వ్యక్తమయినవి అయినా ఎంతటి వొరవ. లేడిపిల్ల సొగసువలె

వున్నది ఆమె సౌందర్యం. అధరముల అరుణ వర్ణమూ, చంద్ర బింబమువంటి ముఖకాంతీ, లావణ్య శోభలు వెద జల్లే అవయవ సౌకుమార్యం ఈ లోకాన్నే మరిపింప చేస్తున్నాయి. నును సిగ్గుతో కూడిన ఆమె వాలు చూపులు - నా హృదయ పత్రంపై గాఢంగా ముద్రిత మయ్యాయి. నన్ను ఈ దీనస్థితిలో వొదిలి ఆమె ఎలా వెళ్ళ గలిగిందో? నునుసిగ్గుతో ఆమె తలవంచుకొంటే నాహృదయం కాస్తా ఆ సౌందర్యరాసి పాదాలపై పడిపోయిందా అన్నట్లు తోచింది

(మెఫిస్టోఫిలిస్ ప్రవేశం)

ఫాస్ట్

మంచి సమాయానికి వచ్చావు. ఏది కోరినా తెచ్చి యిస్తానని డంభాలు పలికేవే! ఆ సౌందర్యమూర్తి నన్ను కటాక్షించేటట్లు చేయగలవా?

మెఫిస్టోఫిలిస్

ఎవరా సౌందర్యమూర్తి మహానుభావా!

ఫాస్ట్

అదుగో అలా ఇప్పుడు వెళ్తున్నదే అటుచూడు ఆ కన్యకారత్నం

మెఫిస్టోఫిలిస్

ఆ కన్యకా? ఆమె తిన్నగా చర్చిలోంచి వస్తోంది. ఫాదర్ ఆమెను ఆశీర్వదించి యింటికి పంపాడు, నేనదంతా

ఒక కంట కనిపెడుతూనే వున్నాను ఆమె స్వభావం ఎటు వంటిదో నాకు తెలియదు. కాని దేవుని కొలిచేవారిపట్ల నా మంత్రశక్తి సరిగా పనిచేయదే.

ఫౌస్ట్

ఆ అమ్మాయి లేజవ్వని. ఇప్పుడిప్పుడే జీవనోద్యాన వనశోభలు ఆమె శరీరాన్ని పులకాంకితం చేస్తున్నాయి

మెఫిస్టోఫిలిస్

వెనకటికి ఒక పడుచువాడు వుండేవాడు. కనపడ్డ ప్రతిపువ్వు తనకి కావాలని ఆరాటపడేవాడుట. కాని ఆ పువ్వు కోసుకోడానికి ధైర్యం వుండేదికాదు. నీ స్థితీఅలాగే వుంది.

ఫౌస్ట్

ఇదుగో చెప్పుతున్నాను. నీవేదో గొప్పశక్తి కల వాడినంటూ, నీ తంత్రాలతో నన్ను బంధించావు. ఈ రాత్రిలోపుగా ఆ అమ్మాయికీ నాకూ సంధానం కుదర్చలేక పోతివా, మనిద్దరం ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోదాం?

మెఫిస్టోఫిలిస్

ఇదేమిటోయి పండితుడా! చిన్నపిల్లలకి మల్లే మారాం చేస్తే పనులవుతాయా? కనీసం ఒక పక్షంరోజు లైనా గడువియ్యాలె, అపుడు నేను నీకోర్కె తీరుస్తాను.

ఫౌస్ట్

మానవులకైతే పక్షంరోజులు కావాలి. భూతశక్తులీ

పనులు కొన్ని గడియలకాలంలో చెయ్యగలవు. నాకు తెలుసు నన్ను మభ్యపెట్టలేవు.

మెఫిస్టోఫిలిస్

చూడు యిటువంటి విషయాల్లో కొంచెం వాపిగ అవసరం నిరీక్షణలేకుండా అనుభవించే అనుభవం సారహీనమైనదై పోతుంది ఆ అమ్మాయిని నీ వలలో వేసుకునేందుకు కట్టుకథల్లో చెప్పే మంత్ర తంత్రాలవంటివి ఎన్నో ప్రయోగించాలసి వుంటుంది

ఫౌస్ట్

తంత్రమార్గాన కాక, ఋజుమార్గానపోయి ఆమెని పొందాలని నాకోరిక

మెఫిస్టోఫిలిస్

నీవెంతసేపటికీ నిన్నుగురించేగాని, ఎదుటివారిని-గురించి ఆలోచించవు అటువంటప్పుడు నీతో తర్జన భర్జన చేసి ప్రయోజనం లేదు అయినా చెప్పవలసింది నిర్మొగమాటంగా చెబుతున్నాను తొందరపడి సిద్ధాన్నం పాడు చేసుకోకు ఆమెను నీవు పొందగలగడమనేది ఆమె మనోభావాన్ని పట్టివుంటుంది ఆమెబొమ్మకాదు, మనిషి. ఆమె మనసు నీపై లగ్నంకావాలె. ఆమె మనసు నీపై మళ్ళింప చేసేందుకు కొంతకథ జరగాలె.

ఫౌస్ట్

భూతలోక స్నేహితుడా, నీవు ఏవిధంగా కార్యభారం నిర్వహిస్తావో - నీ విధానాలతో నాకు ప్రమేయం

లేదు పర్యవసానం ముఖ్యం. ఆమె నాకుదక్కాలె. ఆమె వుండేచోటుకు నన్ను తీసుకొని వెళ్ళు అది నీ శక్తికి మించినపని అయితే ఆమె ధరించే మెడరుమాలో, మేజోడో, ఆమె చిహ్నంగా నాకు తీసుకొనివచ్చి యియ్యి, ఆమె పొందు లభించేదాకా.

మెఫిస్టోఫిలిస్

సరిసరి, ని పరితాపం చూస్తూవుంటె సంహో తమా షాగా వుందిలే. రాజవీధిని ఒక కన్యకనపడడం ఏమిటి – ఆమె చుట్టూ ఒక సుందర స్వప్నాల మేడ నిర్మించుకోవడ మేమిటి? ఆ ఆశాసౌధం గాలి మేడ కాదుసుమా – అని ని మనసుకు నీవే ధైర్యం చెప్పుకోవడం. బాగుంది–బాగుంది నీ కోర్కెను తీరుస్తానని మాటయిచ్చానుగా! అందుచేత ఏ మాయోపాయంచేతనో ఆ అమ్మాయిని ని దగ్గిరకు చేరు స్తాను.

ఫౌస్ట్

ఆ లతాతన్విని నా కళ్ళారా చూచినంతమాత్రాన నా కోర్కె చల్లారదు నావశం కావాలి నాదై పోవాలి.

మెఫిస్టోఫిలిస్

వాంఛలు అలా గుర్రాలై పరుగెత్తితే ఎలా? గుర్రానికి కూడా కళ్ళెముండాలి. ఆ అమ్మాయిని నివు వాళ్ళ యింటిలోనే ఒక గదిలో వంటరిగా వున్నప్పుడు కలుసుకోవచ్చు. ఆ ప్రశాంత వాతావరణంలో మీరు భవి ష్యత్ మీకై దాచిపెట్టిన భాగ్యరాసుల గురించి, తలపోస్తూ

కొంతసేపు గడుపవచ్చు సేపు తొందరపడ్డావా అంతా చెడిపోతుంది.

ఫౌస్ట్

ప్రేయసిని చూడ్డానికి వెళ్తున్నప్పుడు ఏదేనా బహుమతి లేకుండా వట్టి చేతుల్తో ఎలా వెళ్ళేది? ఆ బహుమతి కూడా నీవే తెచ్చియియ్యి.

(ఫౌస్ట్ నిష్క్రమణ)

మెఫిస్టోఫిలిస్

అప్పుడే బహుమతులు కూడా కావాలట రాజకుమారుల డాబూదర్పం మాత్రం అలవడ్డాయి లూసిఫర్‌ని అడిగి ఆ అపూర్వాభరణాలు ఎక్కడ వున్నాయో తెలుసుకొని, ఆ రహస్య స్థలం నుంచి, వాటిని తీసుకొని వచ్చి ఈ ఫౌస్ట్‌కి స్తేసరి ఇతను అ నగలు తన ప్రియురాలికి బహుమతిగా సమర్పిస్తాడు

---

# సూర్యాస్తమయ సమయం

(పరిశుభ్రమైన చిన్న గదిలో మార్గరెట్ తల దువ్వుకుని జడ వేసుకుంటూవుంటుంది)

మార్గరెట్

ఈవేళ దారిలో ఎదురుపడ్డ ఆ పెద్దమనిషి ఎవరో తెలుసుకోనివుంటే బాగుండేది. చూడడానికి పైకి మర్యాద గానే వున్నాడు. ధరించిన దుస్తులనుబట్టి ఘరానా కుటుంబంలో పుట్టి పెరిగినవాడని చెప్పవచ్చు. అయితే నడిరోడ్డు మీద నన్నలా అతడు పల్కరించడమేమిటి! ఏమైనా మహా సాహసశాలిగా వున్నాడు లేకపోతే, పరిచయంలేని ఆడ పిల్లను 'నీవెంట రావచ్చా' అని అలా అడుగుతారా? లోపలికి వెళ్ళుతుంది)

(మెఫిస్టోఫిలిస్, ఫౌస్ట్ ప్రవేశం)

మెఫిస్టోఫిలిస్

చడి చప్పుడూ కాకుండా లోపలికి అడుగుపెట్టాలె.

ఫౌస్ట్

(కొంచెంసేపు నిశ్శబ్దంగా వుండి) ఇక నువ్వు వెళ్ళ వచ్చు.

మెఫిస్టోఫిలిస్

(నలుప్రక్కలా కలయచూస్తూ) ఆహా-ఏం ఘరానా మనిషి పరాయి యింట్లో ఒంటరిగా కన్నెపడుచు గదిలో తనను వదిలేసి వెళ్ళిపొమ్మంటున్నాడు. కాని నాకేం? (నిష్క్రమణ)

ఫౌస్ట్

(గది కేసి సంభ్రమంతో చూస్తూ) నా జీవన ప్రభాత శోభవి నీవే! నీకు స్వాగతం యీయకుండా ఎలా వుండ గలను? నీవు నా హృదయాధి దేవతవు నీకోసం ఈ గుండెలు ఎలా కొట్టుకొంటున్నాయో నీకు వినపడటం లేదా? నా తపన నీకు అర్థం కావటంలేదా? ఈ ఆశా పాశాలకు, విషాద మధురానుభూతిని కల్పించేది ప్రణయ బంధం ఈ గదిలో ఎంతటి ప్రశాంతత! ఎంతట సక్రమ విన్యాసం! ప్రతివస్తువూ నిర్దేశింపబడిన స్థలంలో ఒదిగి కూర్చున్నట్లు వుంది ఇది సామాన్యుల యిల్లు అయితేనేం, లేమి అనునది ఏమూలా కనబడదు (మంచం పక్కనున్న వాలు కుర్చీలో కూర్చుంటాడు) సుఖదుఃఖాలు సమానంగా పంచిన శయన మందిరమా, నన్నుకూడా నీలోనికి తీసుకో. ఈ కుర్చీలో యీ యింటిపెద్ద కూర్చునేవాడు ఆయన చుట్టూ యీ యింట్లోగల పిల్లలు కేరింతలు కొట్టుతూ చేరేవారు ఆ యింటి పెద్దా, పిల్లలూ దివ్యప్రభువు క్రీస్తును దినమూ స్మరిస్తూవుండేవారు నా హృదయం దోచుకొన్న

నా ప్రేమరాశి కూడా యిక్కడ తన పాలబుగ్గలతో హొర్లాడి వుంటుంది ముద్దు మాటలతో తన తల్లితండ్రులను రంజింపజేస్తూ, ఆ మాతాపితరుల ఆజ్ఞానుసారం,నడుచుకొని వుంటుంది ఇంటి పొందికనుబట్టి యింట్లోవారి మన స్తత్వం చెప్పవచ్చు. ఆ బల్లమీద పరచిన తివాచీ ఎంత ధగధగ లాడుతోంది నా ప్రియురాలు సర్దిన ప్రతివస్తువూ ఆమె హస్త స్పర్శవల్ల నూతన లావణ్యం పొందినట్లు వుంది ఆమె నివసించడం వల్ల ఈ సామాన్యగృహం ఒక దేవతా మందిరమయి పోయింది. (పక్కమీదవున్న శాలువ చేతులలోకి తీసుకొంటూ) ఇది ఆమె శాలువ కాబోలు. ఎంత మెత్తగావుంది ఈ శాలువా ముట్టుకొన్నపుడు నా చేతులు వణుకుతున్నాయే. గంటలకొలదిగా ఎదురుచూచిన యీ మధుర సన్నివేశం, నిరీక్షణ – నాలో కంపం పుట్టిస్తున్నది ఎందుచేత? ఈ వణుకు ఎక్కడనుంచి వస్తున్నది. తెలియని భయమా లేక పట్టలేని ఆనందమా? లేక తొణికిసలాడే అమృతభాండం పట్టుకొన్నపుడు చేతులు వణుకుతాయా? అలా వణకడం. స్వభావలక్షణమా? ప్రకృతిలోని వినీలకాంతులు, సౌందర్య దీప్తులూ యీ చిన్నిగదిలో నాకు కనబడుతున్నాయి ఈ కన్య జననసమయాన ఆమె మాతృమూర్తి ఎటువంటి కలలు కన్నదో ఎంత నిర్మలమూ, తీక్షణమూ అగు కలలకు ప్రతిబింబమో యీ కన్య! ఇటువంటి సుఖమయ వాతావరణంలో, ప్రేమ మూర్తులగు తల్లితండ్రుల మధ్య, కిశోరివలె, పుష్పంవలె,

మయూరివలె ఎలా పెరిగిందో యీమె నావూహకు అందడం లేదు ఇక నేనా? నేనెందుకీ అమరలోకంలోకి అడుగు పెట్టాను ఈ ప్రశాంతమందిరంలో కలతలు లేపడానికి నేను ప్రవేశించానా? ఇక్కడికి నేను ఎందుకువచ్చినట్లు? దేనికొరకు? ఎవరికొరకు? యీ నిట్టూర్పులకు అంతమెక్కడ? ఈ హృదయభారానికి నిష్కృతి ఎక్కడ? ఫాస్ట్ నీవు వట్టి మూర్ఖుడివి, అమాయకుడివీనోయీ – నిన్ను నివే అర్థంచేసుకోలేవు ఈ అమృతమయమైన పరిసరాలను అర్థంచేసుకొనేశక్తి నీలో వున్నదా? ఓహో! యిదేదో యింద్రజాలంలా వుంది. నాకు తెలియని కిరణప్రసార మేదో నా నరాలలోకి చొచ్చుకొనిపోతున్నది నాలో ప్రవహిస్తున్న రక్తం ఏదో నూతన గానగతిని అందుకుంది ప్రేమ అనగా యిదేనా? బ్రహ్మాండమయిన ఏదో కలను పట్టుకొని ప్రేమ అంటున్నారా? నా స్వస్థతను హరింపచేస్తూ – గట్లు తాకుతూ ప్రవహిస్తున్న నది విధంగా–నాలో అలజడి కలిగిస్తున్న యీ రక్త ప్రవాహ వేగమే – యీ యింద్రజాలమయకాంతిరేఖే–ప్రేమ నాటకానికి నాందివాక్యమా! ఇది కూడా కరిగిపోయే కలే కావచ్చు. కాని ఎంత అద్భుతంగా ప్రారంభమవుతున్నదీ ప్రథమాంకం నీవు ఆ వనితను ఏకాంత సమయాన ఆమె ముఖ లావణ్యమునూ, దేహ శోభలనూ ఆరాధిస్తూ, నిజంగా ఒక దేవతగా సేవింపగలవా? ఆమెను ఒక దేవతా ప్రతిమగా ఆరాధించగలననుకొంటావు నీవు ఎలా మారిపోతావో, నీలోని ఏ

అనాది శక్తులు నిన్ను జంతువుగా మార్చివేస్తాయో నీకు తెలుసునా? (మెఫిస్టోఫిలిస్ హడావుడిగా ప్రవేశిస్తూ) పరుగెత్తుకుపోవాలె ఇప్పుడు వాళ్ళు యిటుకేసి వస్తారు

ఫౌస్ట్

ఎవరు? ఎందుకు? నే నిక్కడినుంచి యిప్పట్లో రాదలచుకోలేదు

మెఫిస్టోఫిలిస్

ఇక్కడే కాపుర ముందువుగానిలే ఈ నగల పెట్టె నీకోసమే తీసుకొనివచ్చాను. ఎంత బరువుగా వుందో చూడు. తమ రాణీగారికోసమే పట్టుకొనివచ్చాను ఈ నగలను వాళ్ళ బీరువాలో జాగ్రత్తగా పెట్టు. ఇది చూచిందా, ఆ అమ్మాయి లోకాన్ని మరిచిపోతుంది. ఈ నగలు ఆమె హృదయాన్ని పిండేసి, నీ కాళ్ళముందు పడేస్తాయి. ఈ అమూల్యాభరణాలని చూచిన కన్య వాటి ఆధీనంలోనుంచి బయటపడటం కల్ల. వనిత హృదయాన్ని ఒక్క వలపు మాటలతో ఆకర్షించలేవు ఈ నగల పెట్టెతో ఆ అమ్మాయి మనస్సు మారిపోతుంది, చూడు.

ఫౌస్ట్

మిత్రమా! నాకీ విషయాలేమీ తెలియవు. నాకు తెలిసినదల్లా ప్రేమ ఇప్పుడీ పెట్టెను ఏంచెయ్యమంటావు?

మెఫిస్టోఫిలిస్

ఓహో! ఇంత ఖరీదైన నగలు ఈ ఆడపిల్ల కివ్వడ మెందుకు, మనదగ్గిరే వుంచుకొందామనా ఏమిటి నీ

స్తాను? నీ మాటలనిబట్టి నీది భారీచెయ్యి అనుకొన్నాను. మన మిక్కడ వుండడం మంచిదికాదు. నానా రభసాపడి నగల పెట్టె తెస్తే నివు అంతా ధ్వంసంచేసేట్టున్నావు. సరి ఆ పనేదో నేను చూచుకొంటాను (మెఫిస్టోఫిలిస్ నగల పెట్టెను బీరువాలో పెట్టి, బీరువా తలుపు మూసివేస్తాడు) మై డియర్ ఫౌస్ట్! ఇక యిక్కడ వుండడం ప్రమాదకరం. మనం వెంటనే నిష్క్రమించాలె ఆమె నీకు పూర్తిగా స్వాధీనమైపోయినట్లే నీకు ప్రేమగోడవలు ఏమాత్రం తెలియవు. నీ వాలకం చూస్తూవుంటే నివిప్పుడు ప్రకృతి శాస్త్రంమీదనో, తత్వశాస్త్రంమీదనో పెద్ద వుపన్యాసం దంచేటట్టు వున్నావు ఇది వుపన్యాస మందిరంకాదు, భాయీ. పద! పద! (ఇరువురూ నిష్క్రమిస్తారు)

(మార్గరెట్ లాంతరు పుచ్చుకొని లోపలికి వస్తుంది)

మార్గరెట్

ఈవేళ యిదేం వుక్కబాబూ, వూపిరి ఆడడంలేదు. ఇంత వుక్కగా వుందేమో! (కిటికీ తలుపులు బార్లగా తెరుస్తుంది) బయట కొంచెం చల్లగా వుంది ఈ వుక్క వాతావరణంలోనే గాక, నా హృదయంలో కూడా. ఏదో వూపిరాడనట్టుగా వుంది తొందరగా అమ్మవస్తే బాగుం డును. చీకటిపడ్డా యింకా యింటికి వచ్చిందికాదు. ఎందుకీ వేళ భయం భయంగా వుంది. ఒక్కర్తెనే వున్నాననీ, పైగా భయంగా వున్నదనీ తలుచుకొన్న కొద్దీ దేహం

వణుకు తున్నది. ఒట్టి వెర్రిశాగుల దానిని ఇన్నాళ్ళబట్టి లేనిది యివాళ కొత్తగా ఏమొచ్చింది? (బట్టలు మార్చు కొంటూ ఒక జానపద గేయం ఆలాపిస్తుంది. బీరువా తెరిచి బట్టలు సర్దుకొంటూ వుండగా నగలపెట్టె కంటికి కనపడుతుంది) ఇంత మంచి పెట్టె ఇక్కడికెలా వచ్చింది? ఇందాక బీరువా మూసివెళ్ళింది నేనేగా! ఏముంది చెప్మా ఆ పెట్లో? బహుశా ఎవరైనా అమ్మదగ్గిర తాకట్టు పెట్టా రేమో! తాళం చెవికూడా పెట్టెనే వున్నదే! తెరిచి చూద్దాం, తప్పేముంది నా బీరువాలో వున్నపెట్టె నేను తెరిచి చూడటం తప్పని ఎవరంటారు? ఏమిటీ మాణి క్యాలూ రత్నాలూ! ఇటువంటి నగలు నేనెక్కడా చూడ లేదే! ఏదో స్వప్నంలా వుంది. గొలుసు భలేగా వుంది. ఒకసారి వేసుకొన్నంత మాత్రాన కొంప మునిగిపోదుగా! ఎవరివో పాపం. ఎవరివో నేను వేసుకోవడ మేమిటి? అయినా ఒకసారి వేసుకొని చూస్తే ఏం పోయింది? (నగ లన్నీ పెట్టుకొని అద్దం ముందుకువచ్చి నిలబడుతుంది) ఈ కమ్మలు నావే అయివుంటేనా ఎంత బాగుండేదో! ఈ కమ్మలు పెట్టుకోవడంతో నా రూపమే మారిపోయింది. బంగారం కావాలనే తహతహ నావంటి సామాన్యులకు మంచిదికాదు కాని కాంచనంమీద కాంక్ష చంపుకోవడ మెలా? ఈ లోకంలో స్త్రీ పురుషులందరూ ఆరాధించేది కాంచనమునేగా! అయినా నా వంటిదానికి ఇంత బంగారం ఎక్కడి నుంచి వస్తుంది?

# ఊరి బయట

(మెఫిస్టోఫిలిస్, ఫౌస్ట్ ప్రవేశం)

మెఫిస్టోఫిలిస్

అందరూ ప్రేమ కావాలని ఎగబడతారు. ప్రేమ — ప్రేమ. ఇది ఒక జబ్బు ఫౌస్ట్‌కుకూడా ప్రేమ వ్యాధిపుట్టింది. అతనికీ జబ్బు పుట్టించడంలో నా తప్పుకూడా కొంతవుంది. ఇప్పుడు అనుకుని ఏం లాభం!

ఫౌస్ట్

ఎందుకు ఆ చికాకు? ఏమి వచ్చిందిప్పుడు, మొగం అలా కొరకంచులా పెట్టుకొన్నావేం?

మెఫిస్టోఫిలిస్

ఎందుకట్లా కసురుకొంటావు? నాకు మాత్రం మనసు లేదా, నాకుమాత్రం బాధలు లేవా? చచ్చి చెడి మార్గరెట్‌కు ఆ నగలు అందజేయాలని కదా నే పడ్డ శ్రమంతా. మార్గరెట్‌కు సంతోషం కలిగితే నీవు సంతోషిస్తావని నీవేమిటో నన్నుద్ధరిస్తున్నట్లు మాటలు చెప్తూతావు. ఇప్పుడు సంభవించిన వుపద్రవమేమిటో విన్నావా? ఈ నగలరహస్యం కాస్తా మార్గరెట్ తల్లికి తెలిసిపోయింది. అలాంటి ముసలావ్పకు ప్రేమతత్వం ఏమీ తెలియదు ఆ వస్తువులు నిజమైన

వస్తువులా లేక ఐంద్రజాలికవస్తువులా అని ఆవిడ బాధ అంతకీ కూతుర్ని చేరదీసి 'ఇవి మంచినగలుగా కనిపించడం లేదు. ఏదో దుష్టగ్రహం వీటిని ఇక్కడ పారేసినట్లుంది ఇటువంటి సరుకు మనము వాడకూడదు. ఒంటిమీద పెట్టుకో కూడదు. వాటిని జగన్మాత కర్పించడమే అన్నివిధాల మంచిది' అన్నదట తల్లిమాటలకు మార్గరెట్ తెల్లబోయింది. ఆమె అన్నది గదా 'ఇంత అమూల్యమైనవి దేవతలు తప్ప మరొకళ్ళు ఎందుకు యిస్తారు' అని కాని మాతృశ్రీ, మార్గరెట్ అభిప్రాయాన్ని లక్ష్యపెట్టక, మతగురువును వెంటనే పిలిచి, వీటిని ఏం చేయడం మంచిదని ఆయనను అడిగిందట ఆ వజ్రవైఢూర్యాలని చూచిందే తడవుగా ఆయనకండ్లు చెదిరిపోయాయి 'నీవు నన్ను పిలవడం సలహాకోరడం బాగానే వుంది. ఆభరణాలమీద మనుష్యులకు ఆశ వుండకూడదు, ఎవరైతే వాటిని త్యాగం చేయగలరో-వారే ధర్మజీవనులు ఇవి చేరుకోవలసిన చోటు జగన్మాత ఆలయం. వీటిని మేరీమాతకు అర్పితంచెయ్యాలి వీటిని అ తల్లి స్వీకరించి మీకు తగుమార్గం చూపుతుంది. ఈ బంగారు నగలు భగవత్ సాన్నిధ్యంలో పవిత్రమవుతాయి' అన్నాడు ఆ మతగురువు

ఫౌస్ట్

ఈ పూజార్లమాటకేం? వారు స్వంతం చేసుకోనేందుకు కమ్మటి మాటలు అనేకం చెబుతారు. దేవుని పూజార్లందరూ ఒకేజాతి.

మెఫిస్టోఫిలిస్

అలా అంటూ ఆ పెద్దమనిషి ఏం చేశాడో తెలుసా? కాయగూరలు నేవళంగా వున్నాయో లేవో అని తడిమి చూస్తారే, ఆ ప్రకారం చూచి, వాటిని అవలీలగా జేబులో పడేసుకొంటూ, 'భగవంతుని కరుణా కటాక్షం మీామీాద వుంటుంది సుమా!' అని వాళ్ళకు ధైర్యం చెప్పి తను చక్కా పోయాడు. వారు ఆ మాటలకు వుబ్బిపోయారు.

ఫౌస్ట్

ఆ అమ్మాయికూడా ఇది అన్యాయమని అనలేక పోయిందా?

మెఫిస్టోఫిలిస్

లోపల విచారపడ్డా పైకి ఏమనగలదా అమ్మాయి? ఆమె ధ్యానమంతా ఆభరణాలమీాదనే వుంది నగలమీాద మక్కువలేని నారీ రత్నాలు వుంటారా? రేయింబవళ్ళు వాటిని గురించే ఆలోచిస్తూ విచారంలో మునిగిపోయిందామె

ఫౌస్ట్

నగలు పోయినందుకు నాకు బాధగాలేదు – ఆమె విచారం ఎలా పోగొట్టడమా అని? క్రొత్త నగలు అంతకంటె మంచివి పట్టుకొని వచ్చి ఆమె కన్నీళ్ళు తుడవాలె ఎలాగయినా!

మెఫిస్టోఫిలిస్

చచ్చిచెడి నేను పట్టుకొని వచ్చిన నగలు అలా గంగపాలయ్యాయి. నీకేదో ఆటలా వుందే! నగలు గాలిలో నుంచి కోసుకురాగల ననుకొంటున్నావా?

ఫౌస్ట్

అబ్బాయ్, ఈ అధిక ప్రసంగం నాదగ్గిర పనికిరాదు మన ఒప్పందమేమిటి? నీ వైఖరిఏమిటి? నేను ఆదేశించిన కార్యం నెరవేర్చడమే నీ కర్తవ్యం నీ వొక భూతానివని నాకు తెలుసు, భూతాలు ఎంతలేసి పనులైనా చేయగల వనీ నాకు తెలుసు నేను చెప్పినట్లుచెయ్యి నీవు నా సేవకుడవు. నేను నీ యజమానిని.

మెఫిస్టోఫిలిస్

ఆహా! ఎన్నాళ్ళకు విన్నానామాట. చిత్తం తమరు యజమానులు. వీడు తమభృత్యుడు ఆజ్ఞ (ఫౌస్ట్ నిష్క్రమిస్తాడు) ఈయనగారికి ప్రేమపిచ్చి నశానికి ఎక్కుతోంది. ఆహా! ప్రేమ అనగానే కండ్లు బైర్లు కమ్ముకుపోతాయికదా! చుట్టూ మనుష్యులూ, లోకమూ వింత రంగులు దాలుస్తూ వెర్రితలలేస్తాయి.

---

# ప్రక్కవాళ్లయింటిలో

మార్త

(ఒంటరిగా వుంటుంది) మా ఆయన చేసిన పాప కృత్యాలకు భగవంతుడాయన్ను క్షమించాలె. నన్ను లోకువ చేయడం ఆయనకు మొదటి నుంచి అలవాటే ఎంతకూ తన కాయుష్యం - తన కారోగ్యం అని రోజులు గడపడంతో పుణ్యాకాలం కాస్తా వెళ్ళిపోతోంది నన్ను ఏకాకిని చేసి ఆయన హుషారుగా లోకంమీద బలాదూర్ తిరుగుతున్నాడు చచ్చేకోపం వస్తోంది తల్చు కుంటే కాని ఎదటి పడినప్పుడు తిట్టలేను. బహుశా యిదే నేమో ప్రేమంటే? ఆయన మనసు మారాలని - నన్ను ప్రేమతో చూడాలని నేను ఎంత తపనపడుతున్నానో ఆ దేముడొక్కడికే తెలుసు. (కంట తడిపెడుతూ) ఆయన ఈ యింటి ముఖం చూచి చాలా రోజులయింది

ఆయన ఎక్కడైనా అయ్యో బాబోయ్! అంతపని జరిగితే బ్రతకగలనా - నిజమేకాని ఆయన సజీవుడో, విగత జీవుడో కూడా తెలియకపోవడం మరీ బాధగా వుంది ఉంటే వున్నవాళ్ళల్లోనూ జమకాదు. లేడని తెలిస్తే ఒక్కసారి పెద్దపెట్టున ఏడ్చి-నా ప్రాప్త మింతేనని

గుండె రాయి చేసుకోందును. ఇటూ అటూ కాని ఈస్థితి ఎన్నాళ్ళు భరించేది?

(మార్గరెట్ ప్రవేశం)

మార్గరెట్

మార్తా! మార్తా!

మార్త

ఏం కావాలమ్మా, ఏమిటి?

మార్గరెట్

నా కాళ్ళు నిలవడం లేదు నేను నిలుచో లేకుండా వున్నాను ఏమిటీ వింత? నా బీరువాలోకి మరొక దంతపు పెట్టె వచ్చింది ఈ నగలు వెనుకటి నగలకంటె ఎంత బాగున్నాయనుకున్నావు! ఈ సంతోషం భరించలేకుండా వున్నాను నా కేవుపాయమూ తోచడం లేదు.

మార్త

ఉపాయంమాట తరువాత చూదాం కాని యీ దంతం పెట్టె మీ అమ్మకళ్ళ పడిందా మళ్ళీ అపాయమే. ఆవిడగారు వీటిని తిన్నగా మళ్ళీ మత గురువుకే అర్పిస్తుంది ఆయనేమో వీటిని మనం చెయ్యాని పాపాలకు పరిహారంగా జమకట్టుకొంటాడు

మార్గరెట్

ఇదిగో నీకు చూపించాలని వచ్చాను వీటికేసి చూడు, ఒక్కసారి. (మార్తా వాటిని పుచ్చుకొని వింతగా చూస్తుంది)

మార్త

అమ్మాయీ నీవు చాలా అదృష్టవంతురాలివి ఇంత అందమయిన నగలు అదృష్టవంతులకుతప్ప సామాన్యులకు లభిస్తాయా?

మార్గరెట్

ఏమి అదృష్టమో! అవి వేసుకుని బయటకు రాకూడదుకదా! పెట్లో అడుగున దాచుకోవలసిన నగలు అదృష్ట చిహ్నాలా?

మార్త

నాకు తెలుసునోయ్ నీ మనసు. మా యింటికి వచ్చినపుడు యిక్కడ రహస్యంగా వేసుకొంటూ వుండు. అద్దం ముందు గంటల తరబడి కూర్చుని నీ రూపురేఖలకు నీవే ముగ్ధురాలవుకా పండగపబ్బాలప్పుడు యిక్కడికి వచ్చి నీవు వేసుకుందువుగాని ఒకసారి గొలుసు వేసుకో చూస్తాను ఆ ముత్యాలదుద్దులెంత మనోహరంగా వున్నాయి! నీవు మామూలుగా పెట్టుకున్నా మీ అమ్మ అంత తొందరగా గుర్తుపట్టలేదు.

మార్గరెట్

అది సరేగాని మార్తా యీ నగలు ఎవరు తెచ్చి వుంటారంటావు? ఇటువంటి వస్తువులు నేను ధరించడం మంచిదంటావా? (తలుపు తట్టిన శబ్దం) ఎవరై వుంటారు. అమ్మగాని వచ్చిందా?

మార్త

(బయటికి చూస్తూ మార్గరెట్‌తో) ఎవరో కొత్త మనిషి. (అవతలి వ్యక్తితో) రండి లోపలికి రావచ్చు.

మెఫిస్టోఫిలిస్

మీ ప్రశాంతతకు భంగపాటు కలిగించినందుకు క్షంతవ్యుణ్ణి (మార్గరెట్ వైపు ఎంతో మర్యాదగా చూస్తూ) మార్తా సీడ్‌లైన్ అనేవారి ఇల్లు ఎక్కడో చెప్పగలుగు తారేమోనని తలుపు తట్టాను.

మార్త

నేనే మార్తాని ఎక్కడి నుంచి వచ్చారు? ఏంపని? ఏం విషయమో చెప్పండి

మెఫిస్టోఫిలిస్

(మెల్లగా) మిమ్మల్ని చూదామని వచ్చాను. ఇది మీ యిల్లే అయివుండడం యింకా సంతోషం. ఎవరో కులీనులతో మీరు మాట్లాడుతున్నప్పుడు, నేను చొరవ చేసుకొని మీకు యిబ్బంది కల్గించినందుకు క్షమించమని మరొకసారి వేడుకుంటున్నాను తర్వాత కలుసుకొంటాను

మార్త

ఇదిగో అమ్మాయీ! ఆ పెద్ద మనిషి ఏమంటు న్నాడో విన్నావా? నీవు వున్నత కుటుంబానికి చెందిన దానివట. నీపట్ల ఎటువంటి మన్నన కనపరుస్తున్నాడో చూడు.

మార్గరెట్

నేనా! కలవారి కుటుంబంలో పుట్టినదాన్నా? ఆయన ఎవరో పెద్దమనిషి. పెద్దమనుష్యులెప్పుడూ మాటలో మన్ననలో అలానే వుంటారు. నేను వేసుకొన్న నగలు నావికావండోయ్ ఇవి ఎరువు సొమ్ములు.

మెఫిస్టోఫిలిస్

ఒకరి గొప్పతనం తెలుసుకొనేందుకు నగలు ముఖ్యమా! మీ విగ్రహంలోనే, మీ రూపు రేఖలలోనే ఒక ప్రత్యేకత వుంది. మీచుట్టూ వెలుగుతున్న సౌందర్య దీప్తి మీకు తెలియదు. ఇక్కడికివచ్చి మిమ్ములను దర్శించ గలగడం నిజంగా నా అదృష్టం

మార్త

తర్వాత మళ్ళీ కలుసుకోవచ్చు కాని యిప్పుడు మీరు ఎందుకు వచ్చారో చెప్పకూడదూ? అంత వరకూ నన్ను ఆదుర్దాలో వుంచడం మీకు భావ్యమా!

మెఫిస్టోఫిలిస్

శుభవార్త అందించగల భాగ్యమే నాకుంటేనే నెంత ఆనందించేవాణ్ణి! నేను చెప్పేది సంతోషవార్త కాదే. అందుకని తటపటాయిస్తున్నాను. మీరు కృంగి పోవద్దు కాని ఘోరవార్తే యిది మీఆయన చనిపోయారు చివరి క్షణాలలో, ఈ విషయం మీకు తెలియచేయమని నన్ను ఆదేశించారు.

మార్త

ఆ! ఏమిటి? ఆయన చనిపోయారా? నా దైవం - నా ప్రాణం - ఆయన చనిపోయేరా? నమ్మలేను. ఇంత కఠోర వార్త పట్టుకువచ్చేరా మీకు? ఆయన పోయాక ఇక నే నెందుకు?

మార్గరెట్

పోయినవాళ్ళతో మనం పోగలమా మార్తా?

మెఫిస్టోఫిలిస్

ఈ దుఃఖవార్త అందజేయడంతో, అవసానదశలో ఆయనకిచ్చిన మాట నిలుపుకొన్నట్లయింది.

మార్గరెట్

ప్రేమ అంటే నాకు తెలియదు. కాని ప్రాణేశ్వరుడు గతించినమీదట జీవితమే నిరర్థకముకదా!

మెఫిస్టోఫిలిస్

ఎవరి జీవితానికీ మీరు చెప్పిననిరాశ వర్తించదు, కష్టంలో సంతోషమూ, సంతోషంలో కష్టమూ ఒకదాని కొకటి పెనవేసుకొని వుంటాయి

మార్త

ఆయన ఎందువల్ల చనిపోయానో చెప్పగలరా?

మెఫిస్టోఫిలిస్

మృత్యువుకు కారణమా! అది కాలధర్మం. పిలుపు వచ్చింది. ఆయన వెళ్ళిపోయాడు. అంత్యక్రియలు యథా

తథంగా జరిగాయి. పాడువా నగరంలో ఆయన సమాధి చేయబడ్డాడు.

మార్త

నాకు చెప్పమన్నది గాని, చెప్పవలసింది గాని యింకేమీ లేదా?

మెఫిస్టోఫిలిస్

అంత్యకాలంలో ఆయన చెప్పమన్నది ఒకటి వున్నది తన ఆత్మతృప్తికోసం పెద్దఎత్తున సంతర్పణ చేయించమన్నాడు మతగురువుతో చెప్పి. కూడబెట్టిన దేమైనా వున్నదేమోనని జేబు తడిమిచూశాను. అంతా ఖాళీ

మార్త

అంటే నాకేమీ పంపలేదన్నమాట. ఆఖరుకు తన జ్ఞాపకార్థం ఒక చిన్నవస్తువైనా పంపలేదన్నమాట.

మెఫిస్టోఫిలిఫ్

అంత్యకాలాన ఆయన పశ్చాత్తాపంతో కృంగిపోయాడు. ఈ భౌతికవిషయాలు ఆయనకు తట్టినట్టులేదు.

మార్గరెట్

మనుష్యుల కీలాటి బాధలు తప్పవు కాబోలు. ఆయనకోసం నేనుకూడా ప్రార్థనచెయ్యాలె.

మెఫిస్టోఫిలిస్

మార్గరెట్! మీవంటి వాళ్ళు సుఖంగా పెళ్ళిచేసుకొని – ఆనందంగా వుండాలె. ఉత్తమగృహిణికాగల లక్షణాలు మీలో కనబడుతున్నాయి.

మార్గరెట్

నాకు పెండ్లా! అలాంటి వేమీవద్దు.

మెఫిస్టోఫిలిస్

ఎందుకమ్మా అలా అంటావు? మనసు యీపాటికఎవరిమీదా లగ్నమయి వుండకపోతే ఎవరైనా వీరుణ్ణివెతుక్కొని అతనిపై లగ్నంచేయి ఈశ్వరుడు ప్రసాదించిన వరాల్లో ప్రేమను మించిన దేముంది? ప్రేమానుభవమనగా అమృతోపమాన మేకదా?

మార్గరెట్.

మా దేశంలో అలాంటి ఆచారాలు లేవు.

మెఫిస్టోఫిలిస్

పద్ధతులు ఎటువంటివైనా, ప్రేమభావం సర్వత్రా ఒకటే. ప్రేమలేని జీవితంలో సార మేమున్నది?

మార్గరెట్

ఆయన గురించి చెప్పవలసిందేమీ లేదా యిక?

మెఫిస్టోఫిలిస్

లేకేం. ఉంది. కాని అదంతా చెప్పి మిమ్మల్ని బాధపెట్టడం మంచిపని కాదు, నాకు యిష్టమూ లేదు. బాధ

పెట్టే ఘట్టాలు పలుమార్లు తలవడమెందుకు? ఆఖరు క్షణా
లలో ఆయన దైవనామం స్మరించుకొంటూ కనులు
మూశాడు. అవసానదశలో అన్నాడు 'ఇంత వ్యర్థపు జీవి
తాన్ని గడుపుతాననుకోలేదు చేజేతులా చేసు
కొన్నాను అంతా నేలపాలైపోయింది నాకుగా నాదని
మిగిలింది నాభార్య ఒక్కర్తే, ఆమె దీనస్థితిని తలుచుకొంటే
గుండెలు పగిలిపోతున్నాయి. ఆమె నన్ను క్షమిస్తేగాని
నా పాపానికి పరిహారం లేదు'

మార్త

(ఏడుస్తూ) పాపం ఎంత మంచివారు. ఆయన నాకు
అన్యాయం చేయడమా, ఎప్పుడూ లేదు ఏదో జరిగిపోయింది.
ఆ రోజులన్నీ అలా తెల్లవారిపోయాయి.

మెఫిస్టోఫిలిస్

ఇంకొక్క ముక్క అన్నాడు. 'నేను తప్పులు
చేసిన మాట నిజమే నాకంటే పదింతలు తప్పు లెక్కువ
చేసిందావిడ' అని

మార్త

నిజంగా అంతమాట అన్నాడా! ఆయనకు అంత్య
సమయాన ఆ మాట అనడానికి నోరెలా వచ్చిందో?

మెఫిస్టోఫిలిస్

తన తప్పులు నెమరువేసుకొంటున్నప్పుడు మనస్సు
పరిపరి విధాల పోయివుంటుంది. తన జన్మంతా మీకు

వ్యాడిగం చేయడంతోనే గడచిపోయిందని భావించి వుంటాడు. శాంతి అనేది అతనికి కరువై పోయిందట.

మార్త

అయితే రాత్రిం బవళ్ళు నేను చేసిన చాకిరీ అంతా మరిచిపోయాడన్నమాట అసలు అటువంటివాళ్ళకు విశ్వాస మన్నది ఏకోశానైనా వుంటుందా అని

మెఫిస్టోఫిలిస్

అలా అనవద్దు. అతనికి భార్యాబిడ్డలమీద చాలా ప్రేమ వుంది తను ఏ దూర దేశం వెళ్ళినా వారి యోగ క్షేమాల గురించే ప్రార్థన చేసేవాడట దూరం తీరాలకు ఈ ప్రయాణమంతా దారాపుత్రాదుల కోసం కాక ఎవరికోసమన్నాడు. మానౌక తుర్కీ సముద్ర ప్రాంతాల వెళ్ళేటప్పుడు, వాళ్ళ నౌక మాకు వశమైంది అందులో ఎంత ధనముందని. అదంతా మాచేత చిక్కింది. ఆ సంద ర్భంలో నేను చేసిన సహాయానికిగాను నాకు సక్రమ భాగం పంచి యిచ్చాడు.

మార్త

ఎంతొచ్చిందేమిటి? అది ఎక్కడ వుంది? అయితే మీతోబాటు ఆయనకు బాగానే గిట్టివుండాలె

మెఫిస్టోఫిలిస్

అవును ముట్టినమాట నిజమే ఆ గుట్టంతా ఎవరికి తెలుస్తుంది? ఆయన చెప్పిన మాటలప్రకారం, నేను

వూహించేదేమిటంటే నేపిల్స్ నగరంలో మకాం చేస్తున్న ప్పుడు ఆయనకు ఒక చక్కని చుక్కతో పరిచయ మయింది. ఆమె యీాయనగారిని గాఢంగా చివరిదాకా ప్రేమిస్తూ వచ్చిందట.

మార్త

ఆ! అలాగా! ఎంత మోసగాడు నా గొంతు, పిల్లల గొంతు పరపర కోసివేశాడే! ఎంత పాపిష్టివాళ్ళు వుంటా రీలోకంలో! దిక్కులేనివాళ్ళమని తెలిసికూడా ఇదా తను మాపట్ల చూపవలసింది. ఇదేనా!

మెఫిస్టోఫిలిస్

పాపాలకు పరిహారంగా చనిపోయాడుగా! ఒక సంవ త్సరంపాటు ముసుగు వేసుకు కూచుని ఆతరువాత ఇదంతా మరిచిపోయి, నిక్షేపంగా మరొకరిని పెండ్లి చేసుకో

మార్త

అలాటి మాటలు నేను వినలేను. నాకు మళ్ళీ పెండ్లా? ఆయన చెడ్డవాడవుగాక – కానీ అటువంటి పురు షుడు మళ్ళీ లభస్తాడా? దేశాటనమంటే ఆయనకు సరదా. అలాగే విలాసవతులూ, పానీయాలూ అంటే యిష్టం. కాని ఇవేవీ ఆయన హృదయాన్ని తాకవు. ఆయన హృదయం ఎంత సున్నితమైందో మీాకేం తెలుసు – నాకు తెలుసును.

మెఫిస్టోఫిలిస్.

ఆయనగురించి మీకు తెలుసు మీ గురించి ఆయనకూ తెలుసు మధ్యన నాకెందుకుగాని ఏదో అడిగేరు, చెప్పేను నాబాధ్యత తీరిపోయింది ఇక ఆ విషయం మర్చిపొండి. ఒక్కటే చెప్పదలచుకొన్నాను మీరు మనసు మార్చుకొని వివాహమాడదలిస్తే – అందుకు నేను సిద్ధంగా వున్నాను నేను చెప్పదలచుకొంది అదొక్కటే

మార్త

మీవంటి పెద్దవాళ్ళు నాతో పరిహాస మాడటమా?

మెఫిస్టోఫిలిస్

(తనలో) ఇక మన పని అయిపోతోంది. మనం యిక్కడినుంచి వుడాయించాలె (మార్గరెట్‌తో) అమ్మాయీ నీ సంగతి?

మార్గరెట్

అంటే?

మార్త

ఎందుకయ్యా పెద్దమనిషి అలా ఖంగారుపడుతున్నావు? మా అయన పోయాడంటున్నావుకదా, ఆయన మరణం యొక్క ధృవపత్రిక కావాలె నాకు ఇటువంటి విషయాలన్నీ సవ్యంగా లేకపోతే ముందుముందు గొడవలు వస్తాయి. ఆ పత్రం నాకందేక అ మరణవార్తను మా వూరు పత్రికలో వేయించాలె.

మెఫిస్టోఫిలిస్

నాకూ యిలాటి విషయా లెప్పుడూ క్రమప్రకారం జరగడమే యిష్టం. పత్రం నేను పుట్టించలేను కాని, మరణ సమయాన, నా వెంట ఒకసాక్షి వున్నాడు. ఆయనిప్పు డీ వూళ్లోనే వున్నాడు అవసరమైతే న్యాయాధిపతి సమక్షంలో హాజరు పెట్టగలను పోనీ యిప్పుడు మీదగ్గరకు తీసుకు రమ్మన్నారా?

మార్త

అలా చేయగలిగితే చాలా సంతోషం. మీకు జన్మంతా కృతజ్ఞురాలినై వుంటాను.

మెఫిస్టోఫిలిస్

నా స్నేహితుడెంతో మంచివాడు. ఎన్నెన్నో దేశాలు చూచి వచ్చాడు. సరస సద్గుణ విలాసుడు. మాట నేర్పరి తనానికి అతనినే చెప్పాలి.

మార్గరెట్

అటువంటి పెద్దవాళ్ళముందు నేను నిలబడలేను. నాకు చాలా భిడియంగా వుంటుంది. నేను లోనికి వెళ్ళి పోతాను

మెఫిస్టోఫిలిస్

మీరు భిడియపడడమా! రారాజులు కూడా మీ సౌందర్య దీప్తి ముందు కాంతి తరిగి కనబడతారే, అటు వంటి మీరు, సౌందర్య దేవత వరాన పుట్టిన రూప వంతులు, ఒక పౌరుడు వస్తున్నాడంటే జంకడమా?

మార్త

ఆ విషయం మేమిద్దరమూ చూచుకొంటాం కాని మా వెనక ప్రక్కన తోట వున్నది. అక్కడికి చీకటి పడ్డాక ఆ పెద్దమనిషిని తీసుకొనిరండి. శ్రమ యిస్తున్నా ననుకోక తీసుకొని రండి. మీ ఋణం మేముతీర్చుకోలేము

——

# బజారులో

(ఫౌస్ట్ - మెఫిస్టోఫిలిస్)

ఫౌస్ట్

కాయా పండా? ఎంతకాల మీ నిరీక్షణ?

మెఫిస్టోఫిలిస్

స్థయిర్యంతో వుండవలసిందేగాని దూకుడు పనికి రాదు. కొంచెం ఓపిక పట్టాలె. ఇది ప్రణయ కావ్యమా మరొకటా! ఈ సాయంకాలం మార్తా యింటివద్ద నీవు - నీ సౌందర్య రాశిని - నేత్రోత్సవంగా చూస్తావు మార్తా మనకు పనికొచ్చే మనిషి

ఫౌస్ట్

అంటే ఆవిడ మనకు ఈ విషయంలో సహాయం చేస్తోందా?

మెఫిస్టోఫిలిస్

ఎందరి కాళ్లు పట్టుకోకపోతే ఇలాటి పనులవుతాయి?

ఫౌస్ట్

మనకు సహాయం చేసేవాళ్ళకు మనం తప్పక ప్రత్యుపకారం చెయ్యాలె.

మెఫిస్టోఫిలిస్

అదిగో అలా అన్నావు బాగుంది. కొంచెం ప్రపంచ జ్ఞానం కావాలె. ఇప్పుడు ప్రస్తుతం ఆవిడకు సాక్షులు కావాలె. ఆమె భర్త 'పాదువా' నగరంలో మరణించాడనీ, ఆయన కళేబరం సమాధి చేయబడ్డదనీ మనంసాక్ష్యం యివ్వాలె. ఇది చాలా చిన్నవిషయం అందుకే ప్రపంచ జ్ఞానం అన్నాను. మన పబ్బం గడుపుకొనేందుకు కొంచెం నాటకం ఆడక తప్పదు

ఫౌస్ట్

అయితే అతను నిజంగా చనిపోలేదా?

మెఫిస్టోఫిలిస్

నీవింత అమాయకుడివేమయ్యా - పండితప్రకాండా! మనమిప్పుడు పాదువా నగరానికి పడవమీాద ప్రయాణం చేసి వెళ్ళి - ఆ సమాధి చూచివచ్చి, ఇక్కడ సాక్ష్యం చెప్పడమనుకొన్నావా? నిన్నెలా పుట్టించాడో ఆ దేముడు!

ఫౌస్ట్

కూట సాక్ష్యం చెప్పడం తప్పనిసరే అయితే నే నీ వ్యవహార మే వదలుకొంటాను

మెఫిస్టోఫిలిస్

ఏదో సాధువువలె మాట్లాడుతున్నావేమిటి? ఈ లోకంలోని సాక్ష్యాలన్నీ నిజాలనీ, అబద్ధాలు కావనీ నీకు తెలుసా? అదీగాక తమ రింతవరకూ అబద్ధపు సాక్ష్యమే

చెప్పలేదా? దేవునిగురించీ లోకాన్ని గురించీ, ఈ లోక భ్రమణాన్ని గురించీ. మీ పండితులు ఎన్ని సిద్ధాంతాలు లేవదీయలేదు? అదే కడపటి నిజమయినట్లు, పరమ సత్యమయినట్లు, ఎన్నిసార్లు బల్లగుద్దలేదు మీ పండితులు? బుద్ధి బలమేగాని గుండెకాయ పనిచేస్తుందా మీ కెప్పుడైనా? ఆత్మ లోలోపల మూలుగుతున్నా - మీరు దాన్ని ఎన్నిసార్లు కూకలేసి వూరుకోబెట్టలేదు? మనపని ముఖ్యంగాని ఇక్కడ తాత్త్వికచింత కాదు. ఆవిడ భర్త పరలోకానికి ప్రయాణం కట్టాడనీ - మనమిద్దరం అది ప్రత్యక్షంగా చూశామనీ, సాక్ష్యం చెప్పితే అన్నిపనులు చకచకా సాగిపోతాయి.

ఫౌస్ట్

నీవు యింత దగాకోరువనీ, నీ నిలువెల్లా అబద్ధాలే నని అనుకోలేదు అవును నీ జాతే అటువంటిది ఆ వాసన నిన్ను ఎలా వదిలిపెట్టుతుంది?

మెఫిస్టోఫిలిస్

అనవయ్యా అను, మిత్రమా. మనుష్యుల హృదయ ధర్మం, కొంచెం లోతుపాతులు తెలుసుకొనివుంటే, నీవు శుష్కసిద్ధాంతాలు పట్టుకొని దేవుళ్ళాడవు ఆ అమాయకురాలు, ఆ బంగారుకాంతుల కన్య, ఆమెను మోసపుచ్చడమూ, ప్రేమించడమూ ఏంకావాలి నీకు? ఆమె నీకు కావాలన్నప్పుడు నీకు నీవుగా కొన్ని పనులు చేయకపోతే ఎలా? ఇంతకూ నీకు ఆమెమీద ప్రేమవున్నదా పోయిందా?

ఫౌస్ట్

హృదయజనితమైన ప్రేమకూ నీవు పన్నే కుతంత్రాలకూ పోలిక ఎక్కడైనా వున్నదా?

మెఫిస్టోఫిలిస్

మహాప్రభూ మడికట్టుకొని కూచుంటే ఈలోకంలో ఏపనులూ జరగవు. నీవు నీ ప్రియురాలికి ప్రేమగురించి నీకు శోషవచ్చేదాకా వుపన్యాసమియ్యి, నేను కాదనను. కాని యీ ప్రేమ ప్రవాహమంతా హృదయంలోనుంచి ప్రవహిస్తూవస్తూవుందని యిదేదో మహోదాత్తమయిన విషయమని

ఫౌస్ట్

ఆ ప్రవాహధర్మం అనుభవజ్ఞానానికిగాని అర్థం కాదు. ప్రేమోద్రేకంలో, ప్రేమోత్సాహంలో, ప్రేమానురాగంలో మేధ సరిగా పనిచేయదు ఆ భావ తీవ్రతకు పేరేమిటో కూడా దొరకదు. మనోవాక్కాయకర్మలు మూడింటినీ నిద్రనుంచి మేల్కొలిపి పైకెగసన స్రోస్సే అగ్నికీలవంటిది ప్రేమ. ఆ అగ్నిజ్వాలకు ఆద్యంతాలు లేవు. మదిలో రేగే యితర భావములన్నీ శలభములై, ఆ అగ్ని జ్వాలలలో, ఆహుతి అవుతాయి. ఆ అగ్నిజ్వాల ఆరేదికాదు. అది అమరమూ అమృతమూ అయి, శాశ్వతమూ నిశ్చలమూ అయినది. అచ్చే ఈ మాటల అర్థం నీ బుర్రకు వచ్చినా ఎక్కదు.

మెఫిస్టోఫిలిస్

కార్యవాదిగా నేను సూచించిన పద్ధతిలో తప్పేమున్నది చెప్పు?

ఫౌస్ట్

నా మనోభావం అర్థం చేసుకోకుండా ఎందుకు నన్నిలా చీల్చివేస్తున్నావు? పైగా కార్యవాదినంటావు 'ఫలానా లక్ష్యం చేరటానికి నీవీపనులన్నీ చెయ్యాలి, ఇవి చేస్తేనే నీవక్కడికి చేరుతావు' అని నాకో వారం చెబుతావు. నాకేమీ పాలుపోవడంలేదు నీ గుప్పెట్లో ఇరుక్కొన్నాను నీ యిష్టం వచ్చినట్లు కానియ్ నేను నీతో వాదించి లాభంలేదు. ఇంతకూ మార్గరెట్ ఎక్కడ వుంది? ఆమె దర్శన భాగ్యం ఎలా కలుగుతుంది? ఏమిటో ఇదంతా అయోమయంగా వుంది.

మెఫిస్టోఫిలిస్

నీవు ఏ గోతిలోనూ పడలేదు నా వెంబడి వస్తున్నావు



# తోటలో

(తోటలో ఒకవైపు మార్గరెట్ ఫౌస్టు చేయి పుచ్చు కొని తిరుగుతూ వుంటుంది మార్త, మెఫిస్టోఫెలిస్ మరోవైపు వుంటారు)

మార్గరెట్:

(తనలో) యీయనకు నామీద ఎందుకింత అభిమానం? (పైకి) ఏమండీ మీవంటివారు నా పట్ల ఇంతటి అభిమానం చూపడం నాకు సిగ్గుగా వుంది. మీరు దేశదేశాలూ సందర్శించిన ప్రముఖులు. పెద్దలతో కలిసిమెలిసి తిరగగల సమర్థులు నావంటి అజ్ఞానురాలు మీతో ఏమి మాట్లాడగలదు?

ఫౌస్ట్

ఒక్కసారి యిటువైపు నాకేసిచూడు. నీవు అజ్ఞానురాలివా? ~~ఈ~~లోకపు విజ్ఞానమంతా నీలో యిమిడి వున్నట్లున్నదే.

(ఆమె చేతిని ముద్దుపెట్టుకొంటాడు)

మార్గరెట్

మీ స్థితిని మీరు మరిచిపోతున్నారు మీ మృదు పెదవులతో పునీతం కాగల మెత్తదనం నా చేతికిలేదు ఇది

ఎంత కఠినమైనదో మీకు కనబడటంలేదా? ఇంటి పనులు చేసి చేసి వేళ్ళూ చేతులూ తమ లాలిత్యాన్ని కోల్పోయాయి

(ఇద్దరూ ముందుకు నడుస్తారు)

మార్త

మీ పని ఎప్పుడూ దేశాలు చుట్టిరావడమేనా?

మెఫిస్టోఫిలిస్

నా వృత్తి అదేగా, అప్పుడప్పుడు ఒక్కొక్కచోట వుండిపోవలసివస్తుంది. కాని నావంటివాడికి అది సాధ్యం కాదు.

మార్త

యౌవనంలో చీకు చింతలు లేకుండా దేశదేశాలూ తిరిగిరావచ్చు, కాని కాలమెప్పుడూ ఒక్క తీరున వుండదు. యౌవనంతోపాటు సుఖాలు చెయిజారిపోతాయి.

మెఫిస్టోఫిలిస్

ఆ సంగతి నాకు తెలుసు. అది తల్చుకునే అప్పుడప్పుడు బెదురుతూంటాను

మార్త

అందుకనే అన్నిటికీ ముందు జాగ్రత్త మంచిది.
(ఇద్దరూ ఒక ప్రక్కకు తొలగిపోతారు)

మార్గరెట్

కండ్లతో చూడని దానిని మనసు అతి తొందరగా

మరచిపోతుంది. కాని మీవంటి సుజనుల మంచితనమూ ఆ పరిచయ భాగ్యమూ మరపురానివి.

ఫౌస్ట్

ఎందుకలా అనుకొంటావు? సామాన్య జనులకు సాధారణంగా కావలసినవి పటాటోపమూ, డాబూ దర్పాలు. వాటితో మనసులోగల సంకుచితాలన్నిటిని దాచుకోవచ్చు. ఈ సంకుచిత స్వభావులే తెలివిగల వాళ్ళుగా చలామణి అవుతారు.

మార్గరెట్

అంటే?

ఫౌస్ట్

దైవికశక్తి ఎప్పుడూ అమాయకులలో నివశిస్తుంది. భక్తీ వినయమూ అనునవి ప్రకృతిమాత ఎంతో ఆప్యాయంగా తన సంతానానికిచ్చే ప్రశస్త వరాలు.

మార్గరెట్

నేను మీకు జ్ఞాపకముంటానా?

ఫౌస్ట్

నీవుగాక నాకు జ్ఞాపకముండతగిన దేమున్నది?

మార్గరెట్

మాది అంతపెద్ద సంసారం కాదనుకోండి. బోలెడంత యింటి చాకిరీ పరిచారకులను పెట్టుకోగలతాహతు మాకు లేదు. ఇంటిపని, బయటపని, అన్నీ నేనే చూచు

కోవాలె క్షణం కూర్చో నివ్వదు మా అమ్మ. అలా ఒట్టినే కూచోడం వంటికీ, మనసుకూ మంచిది కాదట. మా అమ్మ సంకుచితమైనది కాదుగాని, చాలా ఖచ్చితంగా వుంటుంది. నాన్న ఏదో కొంచెంగా ఆస్తి యిచ్చిపోయినాడు. ఒక చిన్న యిల్లు వుంది ఊరవతల చిన్నతోట ఏదో గుట్టుగా సంసారం వెళ్ళిపోతోంది అన్న ఏమో సైన్యంలో చేరాడు మా చెల్లెలు అనుకోకుండా ఏదో జబ్బుచేసి అమాంతం చనిపోయింది ఆమె మరణం మా యింట్లో అందరికీ గొడ్డలి పెట్టయింది అంత ప్రేమించిన పిల్ల మనకు కాకుండా పోయేసరికి అందరికీ ఏదో శూన్యత పైన పడ్డది.

ఫౌస్ట్

మీ చెల్లెలుకూడా నీకు మల్లేనే ఒక దేవత అయి వుండాలి

మార్గరెట్

మా చెల్లెలు ఎంతో మంచిది దానిని పెంచి పెద్ద చేయడమంతా—నాచేతులు మీదనే జరిగింది నాన్నపోయిన నాలుగు నెలలకు చెల్లిపుట్టింది ఆ అవస్థల్లో ఆ కష్టాల్లో అమ్మ బ్రతుకుతుందనుకోలేదు ఆమె అటుయిటుగానే వుండేది. ఈ బుల్లి చెల్లిని రోగిఅయిన తల్లిని సాదుకు రావడం నామీద వుండేది. అమ్మ నెమ్మది నెమ్మదిగా మనుష్లల్లో పడ్డది.

ఫౌస్ట్

తల్లివలె చెల్లెన్ని పెంచావన్నమాట. చిన్నపిల్లలను పెంచడం ఒక మధురానుభూతి సుమా!

మార్గరెట్

చిన్నతనంలో రాత్రి నిద్రపోయేదికాదు. అర్ధరాత్రివేళ లేచి అలా వుయ్యాలూపుతూ ఎంతోసేపు కూచునేదాన్ని. మరీ చిన్నతనంలో వుయ్యాలూపడం, ఆపైన ఖబుర్లు చెప్పడం, తరువాత కోరినబట్టలు తెచ్చియివ్వడం, ఈప్రకారం నాకాలమంతా, చెల్లిని పెంచి పెద్దను చెయ్యడంలోనూ, దాన్ని సాదుకు రావడంలోనూ, గడిచిపోయింది, ఇక వంటయింటిపని ఎప్పుడూ వుండేదే నాకూ వంటయింటికీ ఏదో గట్టిముడి వున్నట్లు వుండేది అంతకూ గుండె దిటవు చేసుకొని గోఁబలు నెట్టుకొని వచ్చాను ఎంత కష్టపడ్డా చెల్లెలు దక్కిందికాదు.

(ఇద్దరూ ముందుకు నడుస్తారు)

మార్త

స్త్రీల కష్టాలు యిన్నని చెప్పగలమా. ఈ మగవాళ్ళను మార్చడం సాధ్యమా?

మెఫిస్టోఫిలిస్

మగవాళ్ళను సంస్కరించాలనీ, మార్చాలనీ మీలాంటి వాళ్ళకు ఒక ఉన్నతాభిప్రాయం వుండడం తెలుసుకోదగ్గదే.

మార్త

అదేమిటి అలా మాట్లాడుతున్నారు? ఇంతవరకూ మీమనసుకు నచ్చిన స్త్రీ తటస్థపడలేదా! పురుషుని మార్చాలనుకోని స్త్రీ ఎక్కడైనా వుంటుందా? చూడగా చూడగా మీరు మీహృదయాన్ని యింతవరకూ ఏస్త్రీకి యిచ్చినట్లు లేదే?

మెఫిస్టోఫిలిఫ్

ఒని సొమెత వుంది లెండి సొంత యిల్లూ, చతుర మతి అయిన భార్యా, లభించిన తర్వాత ఇక వజ్ర వైఢూర్యాలెందుకు?

మార్త

మీ మనస్సును ఆకట్టుకోగల స్త్రీని వెదకాలనే ధ్యాస యింతవరకూ కలగనే లేదా? విచిత్రంగా వుందే!

మెఫిస్టోఫిలిస్

ఎక్కడికెళ్ళినా అందరూ గౌరవ మర్యాదలతో ఆదరించేవారే అయితే - ఆ ప్రేమ అంటారు చూడండి .

మార్త

మీకెవరిమీద అభిలాష కలగలేదా? ఇదంతా నాకు తెలియక అడుగుతున్నాను.

మెఫిస్టోఫిలిస్

స్త్రీలున్నారే - వారిపట్ల, అభిమానం చూపడంలో మెలుకువతో మసలుకోవాలోయ్, అని పెద్దలు చెప్పగా విన్నాను.

మార్త

అబ్బే మీరు వొట్టి మట్టి బుర్ర. నేచెప్పేది మీక అర్థం కావడం లేదు.

మెఫిస్టోఫిలిస్

మీరలా అనుకొంటే నాకెంతో దిగులుగా వుంటుంది అయినా అర్థం చేసుకోవాలనే నా కోరిక నీకు నాపట్ల ఏదో కొంచెం 'యిదిగా' వున్నదని కొంచెం కొంచెం తెలుసుకొంటున్నాను.

(ఇద్దరూ వెళ్ళిపోతారు ముందుకు)

ఫౌస్ట్

ఈ ఉద్యాన వనంలోకి నేను వచ్చీ రాగానే– నన్ను గుర్తించగలిగావా రాణీ!

మార్గరెట్

మిమ్మల్ని చూచీ చూడగానే నా కనురెప్పలు సిగ్గుతో వాలిపోయాయి. అది మిమ్మల్ని గుర్తించానని అర్థం కాదా?

ఫౌస్ట్

చర్చినుంచి నీవు యింటికి వెళ్ళుతున్నప్పుడు నీ వెంట నన్ను నడవనీయమని, అంత ధైర్యం చేసి చనువుగా అడగడం తలచుకొంటే నాకు చిన్నతనంగా వుంది.

మార్గరెట్

పోనీ లేద్దురూ! ఆ క్షణాన నేను మట్టుకు హడలి పోయినా ఎప్పుడూ నన్నెవరూ అలా తెగించి అడగలేదు.

అడిగేపాటి ధైర్యం ఎవరికీ లేదు ఈ ఊళ్లో. మీ రేదో అంత అభిమానంతో అడిగితే మీమీద విసుక్కున్నానని, మనస్సు ఎంత తపనపడిందో ఎలా చెప్పగలను నేను ఒక విధంగా తెలివి తక్కువదాన్ని మీవంటి కులీనులు అలా అమాంతం అడిగినప్పుడు అవునన్నా-కాదన్నా రెండు విధాలా కష్టమే. 'అలాగే నావెంట రండి' అని ఒక వేళ నేను మీతో అన్నానే అనుకోండి. మీరు నా విషయం ఎలా భావిస్తారు? ఈమెకు నీతి నియమాలు లేవని అనుకోవచ్చుగా మీరు ఏమైనా మీవంటి పెద్దవారిని అవమానం చేసినందుకు నన్ను మన్నించవలసినదని మన స్ఫూర్తిగా ప్రార్థిస్తున్నాను

ఫౌస్ట్

ఆహా! నేనెంత అదృష్టవంతుణ్ణి ఈ సృష్టిలోని ప్రేమలత నా కండ్ల ముందు పుష్పిస్తోంది

మార్గరెట్

కొంచెం ఆగండి (ప్రక్కన కనపడ్డ నక్షత్రపు పువ్వులు కోస్తుంది)

ఫౌస్ట్

ఏమిటదంతా? ఎందుకలా చేస్తున్నావు?

మార్గరెట్

ఇదొకవిధమైన ఆట.

ఫౌస్ట్

అంటే!

మార్గరెట్

పోండి. నన్ను చూసి ఎందుకలా నవ్వుతారు?

(పూలరెక్కలను పార వేస్తూ ఏదో గొణుక్కుంటుంది)

ఫౌస్ట్

ఎందుకలా గొణుక్కుంటావు?

మార్గరెట్

(అర్ధోక్తిలో) నన్ను ప్రేమిస్తున్నారో ప్రేమించడం లేదో, ప్రేమిస్తున్నారో లేదో (ఒక్కొక్క రేకే అలా త్రుంచుతూ దానికేసి చూస్తూ) ఆ! నన్ను ప్రేమించారు.

ఫౌస్ట్

అక్షరాలా నా ప్రేమ దేవతవు నీవే! నా కోసం నీవీ భూమిమీద అవతరించావు భగవంతుడు నిన్ను ప్రేమించాడు. ఆ కరుణామయుడు తన ప్రేమామృతాన్ని నా మీద చిలికాడు

(మార్గరెట్ చేతుల్ని గట్టిగా పట్టుకొంటాడు)

మార్గరెట్

ఒళ్ళంతా గడగడ వణికి పోతున్న దేమిటి?

ఫౌస్ట్

అలా వణికిపోతున్నా వెందుకు? ఏదీ! ఇటు నా కేసి చూడు. మన ఈ స్పర్శానుభూతి ఎంతో మాధురీ సుఖ రంగా వుండవలసింది. ఇక మనం మాటల్లో చెప్పకోవలసిన దేదీ లేదు మనస్సులే మాట్లాడుకొంటాయి శాశ్వతమూ, నిశ్చలమూ, అయిన అమృతక్షణం ఆద్యంతాలు లేవిది.

(మార్గరెట్ అతని చేతిని గట్టిగా నొక్కుతూ అక్కడినుంచి తొందరగా వెళ్లిపోతుంది ఒక నిముషం పాటు అతను ఏదో ఆలోచనాప్రవాహంలోకొట్టు కొనిపోయి తరువాత ఆమెను వెతకడానికి వుపక్రమి స్తాడు) (మార్త ప్రవేశిస్తూ) చీకటి ముసురుతున్నదే!

మెఫిస్టోఫిలిస్

ఆ! ఇంక మనం వెళ్ళాలె

మార్త

మీరు కొంచెంసేపు యిక్కడ వుండి తర్వాత రావడం మంచిది ఈ పరిసరాలు అంత శ్రేష్టమైనవికావు ఇరుగుపొరుగు వాళ్ళ నోళ్ళు కట్టివేయలేము అవును కాని ఆ ప్రేమ పక్షులు ఎక్కడ వున్నాయి?

మెఫిస్టోఫెలిస్

ఎప్పుడో ఎగిరిపోయాయి సీతాకోక చిలుక మాదిరి, ఎంత ధైర్యంగా ఎగిరిపోతుందో అలానే వాళ్ళూను

మార్త

అయితే ఆయన ఆ కన్యను గాఢంగా ప్రేమించా రంటారా మీరు?

మెఫిస్టోఫెలిస్

నీవెంతకూ ఆయన సంగతే చెబుతావు. ఆ కన్య కూడా అతన్ని అంత గాఢంగానే ప్రేమించింది లేకపోతే అనురాగాన్ని ప్రేమఅంటారా ఎక్కడేనా?



# పొదరింటిలో

(మార్గరెట్ గబగబా లోపల ప్రవేశించి, తలుపు వెనుక దాకొంటుంది నోట్లో వ్రేళ్ళు పెట్టుకొని తలుపు సందులోనుంచి బయటికి ఆత్రంగా చూస్తూ వుంటుంది)

మార్గరెట్

ఆయన ఇటుకేసి వస్తున్నాడు

ఫాస్ట్

(తలుపు తోస్తూ) నాతో ఎంతకు దాగుడు మూత లాడుతావు. దొంగను పట్టుకోలేననుకొన్నావా? ([illegible] ఆమెని కౌగలించుకొని ముద్దుపెట్టుకొంటాడు మార్గరెట్ తన చేతులు అతని బుజాలపైన వేసి ముఖంలోనికి చూస్తుంది)

మార్గరెట్

దొంగని నేనా మీరా? మనసు దొంగిలించిన మీరు (వక్షంమీద వాలుగుతూ) ఎన్నాళ్ళకు నా పంట పండింది.

(మెఫిస్టోఫిలిస్ బయటనుంచి తలుపు తట్టుతూ వుంటాడు)

ఫౌస్ట్

(మండిపడుతూ) ఎవరూ – ఎవరు వారు?

మెఫిస్టోఫిలిస్

చెలికాణ్ణి–స్నేహితుడ్ని

ఫౌస్ట్

నీవొక పశువ్వి

మెఫిస్టోఫిలిస్

అట్లకేంగాని, ఇక మనం వెళ్ళిపోవాలె

మార్త

(ప్రవేశిస్తూ) ఇప్పటికే చాలా ఆలశ్యమయింది. మీరిక్కడ ఉంటే ప్రమాదం

ఫౌస్ట్

(మార్గరెట్ మార్తాలతో) నేను మీ వెంట రావచ్చుగా!

మార్గరెట్

అమ్మో బాబోయ్! అమ్మ గాని చూస్తే ఇంకేమైనా వుందా!

ఫౌస్ట్

అంటే నేను మీ యింటికి రాకూడదా, ఇక్కడి నుంచే నన్ను పంపిస్తున్నారా? కాని ఎన్ని ఒడుదుడుకులు వున్నా – ప్రణయకావ్యం పూర్ణమవుతుంది

మార్త

జాగ్రత్తగా వెళ్ళిరండి.

మార్గరెట్

(ఫౌస్ట్‌తో) మనం మళ్ళీ త్వరలోనే కలుసుకొందాం. (ఫౌస్ట్, మెఫిస్టోఫిలిస్ నిష్క్రమణ)

మార్గరెట్

ఆయన ఎంత మంచివాడో, ఎంత గొప్పవాడో అటువంటి మహనీయుల తలంపులు ఎంత వుదాత్తంగా వుంటాయో నావంటి సామాన్యులకు తెలియదు కదా! ఆయన మాటలలో అమృతధారలు, ఆయన చూపులలో కరుణరస తరంగిణి! ఏమీ తెలియని మూర్ఖురాలిని నేను. ఆ పర్వత శిఖర సౌందర్య దీప్తులు నావంటిదానికి ఏ మర్థమవుతాయి? అర్థముకాగల సావకాశ మేది!

---

# అడవుల్లో - కొండల్లో

(ఫౌస్ట్ మనశ్శాంతికోసం అడవుల్లోకి వెళ్తాడు. ఎటుచూచినా కొండలూ, లోయలూ, ప్రకృతిలో గల ఔన్నత్యాన్నిచూస్తూ ప్రకృతి సౌందర్యంతో శల్మికలిపి ఆత్మశాంతికై ఆరాటపడుతూ వుంటాడు.)

ఫౌస్ట్

నీవు నిజంగా లోకేశ్వరుడవు. నాకోరికలన్నీతీర్చి, నాజన్మను పావనం చేశావు నాకోరికలు పూరిస్తూ ఈ దారి చూపడంలో ఏదో దివ్యరహస్యమున్నదని భావిస్తూ వున్నాను ఇది నాకొక అగ్ని పరీక్ష రాజభోగాలను మించిన నీదివ్యమంగళ విగ్రహదర్శనం నాకు ప్రాప్తించదా? ఆ నేత్రానందకరమైన దృశ్యాన్ని చూడగల అవకాశం నాకు ఘటింపచేయవా? నీ దర్శనము సామాన్యమైనదికాదు లాంఛనప్రాయమైనదీ కాదు నీ స్వరూపాన్ని అవగాహన చేసుకోవడంకోసం చేసే ప్రయత్నం, మన సరిగిన స్నేహితుని హృదయసీమలో విహరించడం వంటిది ఉపాధుల నిచ్చావు నాకు. వాటిని తృప్తిపరచవలసిన భారం నిమీద లేదా? అడవుల్లో నివసించే ప్రాణులు, గగనంలో విహరించే ప్రాణులు, జలగర్భంలో విహరించే ప్రాణులు, ఇవన్నీ

సి ఆజ్ఞానుసారంగా తమ జీవితములు వెళ్ళబుచ్చుతున్నాయి సముద్రంమీద వీచే తుపానులతో నేలమీదనున్న అడవులు తారుమారై బ్రహ్మాండమయిన ఆ తుపానుగాలిపులకు కలకాలంగా పెరిగిన వృక్షరాజాలుకూడా వ్రేళ్ళ పెకలి నేలమీద వాలిపోతున్నవి. ఎక్కడి సముద్రపు గాలి! ఎక్కడి వృక్షరాజము! ఈ రెంటినీ ఎంత అద్భుతంగా కట్టివేస్తున్నావు! శతాబ్దులుగా జీవిస్తున్న మహా వృక్షం తన ఆశ్రయగత జీవులను సంక్షోభపెట్టుతూ, నేలకు ఒరిగి పోవడంచూచి ప్రక్కనవున్న పర్వతరాజులు ముక్కుమీద వేలువేసుకొంటున్నాయి అటువంటి బీభత్స సమయాన నావంటి అల్పప్రాణులను గృహాల లోపల దాచావు. ఈ ప్రకృతి లీలలు చూడమన్నావు చూచి విభ్రాంతిని కమ్మన్నావు చంద్రోదయ మవుతున్నది చంద్ర కిరణాలలో ఎంతటి ప్రశాంతత! ఎంత సౌకుమార్యం! ఈ శీతాంశు రేఖలలో గతాన్ని వెళ్లగించగల ఏదో సామర్థ్యమున్నది కొండ రాళ్ళనూ రెల్లుపొదలనూ కిలకిలా నవ్వించే ఈ చంద్ర కిరణాలు తమ అపూర్వ కాంతులతో, [illegible] కేదో చెప్పరాని ధైర్యాన్ని, సాహసాన్ని ఇస్తున్నవి. చంద్రుడెప్పుడూ హృదయ సాగరంతరంగాలపై తుఫాను సృష్టిస్తాడు మానవుడు తాను పరిపూర్ణుడనని [illegible] అనుకొంటాడు ఆ సంపూర్ణత్వం అతనిలో లేదు. ప్రకృతితో ఐక్యమైతేనేతప్ప ఆ పరిపూర్ణత అతనికి లభించదు నన్ను లోకపు ఆనందాలకు సన్నిహితునిగా చేశావు దేవతా

గణము నా కోర్కెలు తీర్చేటందుకు సాయపడడం, నా అదృష్టమవి చెప్పాలె

కాని, ఆ మెఫిస్టోఫిలిస్ కార్యసాధకుడైనా కర్కశ స్వభావుడు. ఒట్టి రాతిగుండె ప్రాణాలమీద అతనికి అనుభూతి లేదు. ఎంతటివాడిని కించపరుస్తాడు. నాముందే నన్ను ఎన్నిసార్లు అవమానం పరచలేదు? జీవితకాలమంతా, ఏకోన్ముఖధ్యానంతో నీ కరుణాకటాక్ష వీక్షణాల కోసం నా నిండు జీవితాన్ని, నీ పాదపద్మాల ప్రేమాల వాల్చిన నన్ను, ఒక్క క్షణంలో ధ్వంసం చేసి వెలుగు కానరాని అగాధంలోకి విసరడానికి సిద్ధంగా వున్నాడు. నా మనసులో కోర్కెలను రగిలింపచేసి, వాటి వికృతాకారాలతో విస్తృత చేస్తూ, నా వాంఛా సౌధాలను ఆకాశమెత్తు పెంచుతున్నాడు. ఆ గాలి మేడలకు నాలో నేను భ్రమసి, నా ప్రశాంత హృదిని చిందరవందర చేసుకొంటున్నాను

మెఫిస్టోఫిలిస్

(ప్రవేశిస్తూ) ఎందుకా ఆలోచన? బండి నడవటం లేదనా? రానున్న అదృష్టాన్ని తలచుకుని సంతోషపడటం లేదా? ఏం? నీకు అక్కర్లేనిమాటే చెప్పు. ఆనందాన్ని కాలదన్నుకొనే మహానుభావులు ఎందరు లేరు? సిరిరా మోకాలడ్డు వారుంటారా? వారినే మూర్ఖులంటారు నీవంటివారు వేరు గనకనా? స్వర్గసౌఖ్యాలు యీ భూమిమీదనే అనుభవమవుతున్నప్పుడు అడ్డుచేవారిని ఏమని అనాలో తెలియటం లేదు

ఫౌస్ట్

నన్ను స్థిమితంగా వుండనియ్యక, నా ప్రశాంతతను భగ్నం చెయ్యడమే నీ లక్ష్యంగా వున్నది. ఏదో పోయినది దొరుకుతున్నట్లు మనసు శాంతపడుతున్న సమయాన - నీవెందుకిలా దాపరించావు?

మెఫిస్టోఫిలిస్

వెర్రివాడా నేను నీ అండవుండగా నీకు కలవరపాటెందుకు? నీ చిత్తశాంతి చెదరగొట్టటం నాకెంతమాత్రం ఇష్టం లేదు. నీకు చిత్తశాంతి లభించేందుకే నేనీ పథకాలు వేస్తున్నాను. నీ ఆశలూ, కోరికలూ నెరవేరే క్షణం దగ్గరలోనే వున్నది నన్నెందుకు ఆడిపోసుకొంటావు? నామీద ఎందుకలా చికాకు పడతావు? నేను నీకు చేస్తున్న సహాయానికి ఇదా నీవు చూపవలసిన కృతజ్ఞత! పోనీలే నీవు చీదరించుకొన్నంత మాత్రాన నా కొచ్చిన నష్టమేమీ లేదు. నేనెప్పుడూ స్నేహానికి ప్రాణమిస్తాను. నీ మాటలకంటే నీ మనోభీష్టం నాకు ముఖ్యం. స్నేహితుని ధర్మమే నెరవేరుస్తాను

ఫౌస్ట్:

అలా మెల్లగా చెప్పడంలో ని పట్టుదల ఏమిటో నాకు తెలుసు. నీవు నన్నిలా వెంటాడటం నాకెంతమాత్రం ఇష్టంలేదని నీకూ తెలుసు అయినా వొప్పుకోవు. నీవు కార్యసాధకుడివి. నన్నేదో వూబిలో దించితేనేకాని నివ్వు ఆనందించలేవు

మెఫిస్టోఫిలిస్

మిత్రమా! ఎంత అమాయకుడివయ్యా, బహి ప్రాణాన్నే సంశయిస్తున్నావు? నీ జీవన రథాస్త్వాలను నాకు ఒప్పగించి, ఎందుకలా కలవర పడతావు? ఈ రథాన్ని దరికి చేరుస్తాను. నేను నీకు సహాయంగా వచ్చి వుండకపోతే, నీకు ఈ ఇహలోకపు వాసనల నుంచి, విముక్తి కలిగేదా! కోరికలు వుచ్చులై నిన్ను బంధించేవి కాదా! వీటిమధ్య నీవు వలలో చిక్కుకొన్న మృగరాజువలె గిలగిల్లాడే వాడివి కాదా! నేను నిన్ను బయట పడేస్తాను. ఈ జీర్ణ శిలలమీద కూచుని, కొండ గుహలలోకి తారకా వీధుల్లోకి చూస్తూ, ఆ శూన్యతతో హృదయాన్ని నింపుకొని, పరితాపం చెంద డం ఎందుకు? ప్రకృతిని మానవుడు అర్థం చేసుకోలేడు. అది మానవునిలోని ఆరాటాన్ని మాత్రమే పెంచుతుంది. నీవు మహా పండితుడవు. సమస్త శాస్త్రాలూ తెలిసిన వాడవు. నేను నీకు చెప్పదగినవాడిని కాను కాని ఎంతటి ధీరుడూ ఒక్కొకప్పుడు తన వివేకాన్ని కోల్పోతాడు.

ఫౌస్ట్

ఈ చుట్టూగల చైతన్య ప్రకృతీ, ఈ జీవధాతువుల సమూహ నృత్యం నీకు ఊసర క్షేత్రంలాగా కనిపిస్తున్న దంటే అది నీ దృష్టి దోషం ఆ మహాసంగీతంలో నా హృదయమొక చిన్న రాగమై, ఆ పయోధిలో నా మనస్సొక చిన్న కెరటమై, ఆ చైతన్య స్రవంతిలో ఒక చిన్న కదలికై, ఆనందాబ్ధిలో మునగ గలుగుతున్నప్పుడు

ఇదంతా ఒట్టి శూన్యమని నీవంటే మాత్రం నా మనస్సు వొప్పుతుందా? భూత ప్రేత పిశాచాలకు మాత్రమే ఈ చైతన్య కాంతులు అర్థంకావు, నీవొక రాక్షసుడివి, ఒక భూతానివి. నీకెలా తెలుస్తుంది ఈ సుకుమార సుందర సౌశీల్య కాంతి?

మెఫిస్టోఫిలిస్

ఓహో అలాగునా? నాకు తెలియదు. తమరు లోకాతీతమైన వాటి కోసమై కృషిచేస్తున్నారని నాకేం తెలుసు? అర్థరాత్రివేళ మంచులో కొండరాళ్లమీద పండుకోడం, ఎముకలు కొరికే చలిలో భూమి ఆకాశాన్ని స్పృశించే చోట్లు చూస్తూ వెర్రిగా ఆలోచించడం అదంతా ఆనందోపాసన అనీ, దైవత్వంకోసం ప్రాకులాట అనీ అంటే నాకు బోధపడదు ఏ ఆనంద విశేషాలయినా ఈ భూమిమీదనే, ఇహలోకంలో మనం వుండగానే సాధ్యపడాలి భూమ్యాకాశాలవంక వెర్రిగా చూస్తూ, యీలోకమంతా ఆరు రోజుల్లో నీవే సృష్టించినట్లు, భ్రమిస్తూవుంటే తృప్తి అనునది ఎలా లభిస్తుంది? ప్రకృతి ఆరాధనలో నిమగ్నమగుటనని గర్వం పెంచుకోవచ్చు కావలిస్తే నాకందులో ఏమీ ఘనత కనిపించదు దైవచింతనలో మానవత్వం మరిచిపోతే, నీవు మనిషివనే భావన నీలోనుంచి మాయమైపోతే, నీ తెలివితేటలూ వ్యక్తిత్వమూ, నిష్ఫలమని నీకనిపిస్తే, ఇక 'నివు' అంటే ఏమిటి? కొండరాళ్ళమీద మంచులో

పండుకుని, ఆలోచించే పండితుడివి. నీవే ఆలోచించుకో నేను చెప్పిన విషయాలు!

ఫౌస్ట్

నిది ఒకేధోరణి. మరొకదారి నీకు వచ్చినా అర్థం కాదు

మెఫిస్టోఫిలిస్

అవును బాబూ ఈరోజుల్లో వున్న సంగతి కట్టెదుటగా చెప్పితే ఎవరికి బాగుంటుంది? నీవు విద్యావంతుడివి కనుక నన్ను ఎన్నిమాటలైనా అనవచ్చునని నీవుద్దేశం. నీ అభీష్టం ఎటువంటిదో, నీ మనసు దేనికోసమై ప్రాకులాడుతున్నదో, కనీసం నీకైనా తెలుసునా? అది తెలిస్తే బాధలేదు లేకపోతే నీమార్గమే, నీజీవితమే ఒక భ్రమ. అసలే అలిసిపోయిన వ్యక్తివి. భ్రమలో ఎంతకాలమని వుండగలవు? మెదడు చెడిపోదూ! భయభ్రాంతులతో భ్రమకు జీవం పోస్తావా? అయిందేదో అయిపోయింది. ఇక ఈ వుయ్యాలాట కట్టిపెట్టి కర్తవ్యం ఆలోచించడం అన్నివిధాలా మంచిది ఈ ప్రకృతిమధ్యపడి నీ ప్రియురాలు విషయమై మరిచిపోయినట్లున్నావు ఆ అమ్మాయి నీకోసం నిరీక్షిస్తూ కూచుంది. ఒక ప్రాణిని అలా బాధపెట్టడం భావ్యమా! నీవే సర్వస్వమని నమ్మి తన సమస్తం నీ కర్పించిన ఆ అమ్మాయిని అన్యాయం చేస్తావా? నీ ప్రేమకు ప్రారంభంలో దోహదమిచ్చి, ఆమె హృదయంలో అను

రాగ కుసుమాన్ని వికసింపజేసి, ఇప్పుడు పిరికిపందలా పారి పోతావా? నీవు పెద్దమనిషివి, నలుగురిలో తిరగవలసిన వాడివి. మానవధర్మమనగా కొండల్లోకి, గుహల్లోకి తప్పు కోవడంకాదు. తన సహజీవుల సముచితరీతిగా ఆదరించడం ఆమెవద్దకు రా మీరిద్దరూ సుఖంగా వుండండి చూడు, ఆకాశ వీధిని పయనిస్తున్న ఆ మేఘమాలికలు నీ ప్రియురాలి కిటికీవద్దనుంచి ఏ సందేశాలను తీసుకు వస్తున్నాయో విను "నేనే ఒక పక్షినై వుంటే నా ప్రియుని హస్తాలలో వాలి వుండేదాన్ని" అని ఆ అమ్మాయి పాడే పాటను, మేఘకన్యలు ఆలాపిస్తున్నాయి రాత్రింబవళ్ళూ నీ ధ్యాసతప్ప మరొకటి లేదు ఆ అమ్మాయికి. ఒక తడవ చిత్తస్థయిర్యాన్ని కోల్పోయి, కన్నీరు కాల్వలు కట్టేటట్టు రోదిస్తుంది. ఒకో తడవ కండ్లలో జ్యోతులు వేసుకొని, నీవు వస్తున్నావేమోనన్నట్లు చూస్తుంది ఆ అమర ప్రేమ కంటే యీ కొండ శిలలమీద ఏమున్నదయ్యా వెర్రివాడా!

ఫౌస్ట్

అది అమరప్రేమో, అమరగానమో నాకు తెలియదు. నాకు వినబడుతున్నది అపస్వరాలు మాత్రమే.

మెఫిస్టోఫిలిస్

(తనలో ఈ పిట్ట జారిపోయేటట్లుంది. గట్టిగా పట్టుకోవాలె)

ఫౌస్ట్

రాక్షస సంభూతా! నన్నింక వదిలిపెట్టు. ఆమె

పుణ్యముంటుంది. ఆమె ప్రస్తావన నా దగ్గర తీసుక రాకు. ఆమె సౌజన్యవతి. సౌజన్యవతుల ప్రేమ నీవు చెప్పిన విధంగా ఉండదు కన్నీళ్ళు సమ్మరించినా ఆ కన్నీళ్ళు నీకు కనబడవు ఎందుకనవసరంగా ఆమెను అవమానాల్లోకి లాగుతావు. బాబూ! నన్ను వదలిపెట్టు.

మెఫిస్టోఫిలిస

నవ్వు అవేమిటో నాకు బోధపడటం లేదు. నేను కల్పించానంటావా? నాకేమవసరం కల్పించేందుకు? కంట్లో నిలిచే ప్రియుడు, ఆమాంతం మాయమయితే ఏ కన్య హృదయం ఆందోళన పడదు? ఆమె ఆందోళనపడడం తప్పా - నేను చెప్పడం తప్పా? ఏదో తెలవు యియ్యండి తెలుసుకొంటాను

ఫౌస్ట్

ప్రేమ అనేది ఉద్భవించిన తర్వాత దూరమూ - దగ్గిరా అంటూ వుండదు నేను ఆమెవద్దనేవున్నాను. ఆమె నాలో వున్నది నేను ఆమెను యీ జన్మలో మరిచిపోనని - మా ప్రేమ మాయనిబంధమని నాకు తెలుసు. ఆమెకు తెలుసు. ఈ ప్రేమానుభవానిక నేను నిజంగా గర్వపడుతున్నాను.

మెఫిస్టోఫిలిస్ :

ఆ! అది! అలా దోవలోకి రా మీ యిద్దరి ప్రేమా చూస్తుంటే నాకు ఒకసారి ఏడుపు వస్తుంది.

ఫౌస్ట్

నిన్ను ఎన్నిసార్లు మందలించినా అధిక ప్రసంగం చెయ్యకుండా వుండవు నీకదొక జబ్బు.

మెఫిస్టోఫిలిస్

పుర్రెతో పుట్టిన జబ్బయ్యా యిది మధ్యన నా మీదెందుకలా విరుచుకొనిపడతావ్ నీ చిరాకు చూస్తూంటే నాకు నవ్వొస్తూంది ఈ దేవుడున్నాడుచూడు, ఆయనగారు, యువతీయువకులను జీవన మధుభాండం గ్రోలమని సృష్టించాడు. ఇద్దరిమధ్యా బ్రహ్మాండమయిన ఆకర్షణ కల్పించాడు. ఆయన పనితనానికిది నిదర్శనం అదంతా పెద్ద కథలే! ఇప్పుడు వద్దు గాని ఆ కథ! నీవు తిన్నగ ఆమె వద్దకురా.

ఫౌస్ట్:

మహానుభావా! నేను ఆమెవద్దకు ఎప్పుడు వెళ్ళాలో ఎలా వెళ్ళాలో నాకు తెలుసు నీవు నోరుమూసుకొంటావా? ఆమె నాకు పరాయిదికాదు నాహృదయంలో నివశిస్తున్నది నేను ఆమెకు పరాయివాణ్ణికాదు ఆమె హృదయంలో నేను వున్నాను, కాని నేను అడవి మృగాన్ని కాదు, గంతులేస్తూ పరుగెత్తేందుకు. ఆ అమాయకురాలిని లోకపు గొడవలతో చిందరవందరపరచి, ఆమె జీవితాన్ని ఒక వుప్పెనగా చెయ్యడం నావుద్దేశ్యంకాదు, ఆమెనక్కడనుంచి పెకలించడంవల్ల ఆమె అధఃపాతాళాని పోగల ప్రమాదమున్నది. నేనందుకు కారకుణ్ణికాలేను

ఆమెను ఏటిబడ్డుకు చేర్చాలె ఉప్పెనలో యిరుక్కో-కుండా కాపాడాలె. ఆమె మనశ్శాంతి చెడకుండా, ఆ కుసుమ పత్రాలు సుడిగాలికి రాలిపోకుండా రక్షించుకో వాలె ప్రేమ అనగా గబగబాపరుగెత్తుతూ వెళ్ళి, ఆమెతో పరాచికాలాడట మనుకున్నావా? ప్రణయ మొక్కటే ప్రేమ అనిపించుకోదు ఎటువంటి త్యాగంతోనైనాసరే ఆమెను రక్షించుకోగల మార్గం అన్వేషించాలె అదే నా ధర్మము నీకు అనేక శక్తులున్నాయి నీవు నాకుచేయగలిగిం దేమిటంటే, ఆమెకు ఎటువంటి కష్టాలురాకుండా చూడ టం ఆపాటి తోడునీడగా నీవువుంటే నాకెంతో సహాయం చేసినవాడవవుతావు మా యిరువురి జీవితాలు ఏనాడో ఒకటయి పోయాయి ఉన్నతి పొందినా దిగజారిపోయినా ఇరువురిలోనూ ఆపరివర్తన ఒకే విధంగా జరుగుతుంది.

మెఫస్టాఫిలిస్

ఈగొడవంతా ఎందుకయ్యా, తత్వచింతనతో కాలం వృధాపుచ్చుతావు తూనికలువేస్తూ కూచుంటే ముందడుగు పడదు దేనికైనా ధైర్యసాహసాలు కావాలె సిద్ధాంతభాగం అయిపోయింది ఇప్పుడయినా కార్యాచరణకు పూనుకో!



# మార్గరెట్ ఇంట్లో

(మార్గరెట్ రాట్నం దగ్గిర కూర్చుని పాడుతూ వుంటుంది)

మార్గరెట్

పోయిన శాంతి నాకు వస్తుందా? ఆయన లేని జీవనం నాకెందుకు? శూన్యమైపోయిన యీ లోకంలో పిచ్చిదాన్ని అవుతానేమో! బరువెక్కిపోయిన గుండె ఏనాటికైనా శాంతిని ప్రసాదించగలదా? నా మనసు ఆయనకోసమై వెతుకుతోంది. ఈ నేత్రాల పరమార్థం, ఆ దివ్యమంగళ రూపుని దర్శన భాగ్యమే కదా! చిరునవ్వులొలికే ఆ ముఖ సౌందర్యాన్ని ఈ జన్మలో తిరిగి కాంచగలనా! ఆయన దరిజేరగలిగే అదృష్టం ఈ తనువుకున్నదా? ఈ గుక్కెడు ప్రాణాలు ఆయన గాఢపరిష్వంగంలో అంతం కాగలిగితే ఎంత హాయి

——

# మల్లి తోటలో

(మార్గరెట్ ఫౌస్ట్ ప్రవేశం)

మార్గరెట్

మీరు నాకు మాట ఇవ్వాలె

ఫౌస్ట్

చేతనయితే తప్పక యిస్తాను

మార్గరెట్

మీరు పుణ్యతులు, పుదారులు, విద్యాగంధం తెలిసినవారు. మతిమనగా మీ పుద్దేశమేమిటో తెలుసుకోవచ్చునా?

ఫౌస్ట్

నీ దృష్టికి నేను పుణ్యతునిగా, పుదారునిగా కనపడటం నా అదృష్టం ఎదుటివారిలో ఏర్పడ్డ భక్తి విశ్వాసాలను, గౌరవ ప్రపత్తులను కాపాడుకోవడమే, నా మొదటి మతము.

మార్గరెట్

నా ప్రశ్నకు సమాధానం మీరు పెడదారి పట్టిస్తున్నారు. గౌరవించే వాళ్ళను గౌరవించడానికి, భగవంతుని

పట్ల మంచి తనం, కొంతవరకూ స్పృహ విశ్వాసం అవసరం కదా!

ఫౌస్ట్

మంచితనమన్నా - భగవంతుడన్నా ఒకటే నా దృష్టిలో.

మార్గరెట్

నాకు ఆ విషయమే కొంచెం తెలుసుకోవాలని వున్నది మీకు పూజా పురస్కారాలమీద, జపతపాల మీదా సద్భావమున్నట్లు తోచదు

ఫౌస్ట్

నా వేష భాషలనుబట్టి నువ్వలా పొరబడి వుంటావు మనకంటే వున్నతులెప్పుడూ మనకు పూజనీయులేకదా!

మార్గరెట్

అయితే మీరు చర్చికెప్పుడూ వెళ్ళరేం? అక్కడి ప్రార్థనల్లో పాల్గొనరెందుచేత? దేవునిపట్ల అంత గాఢ విశ్వాసం కలవారు మత జీవన సంప్రదాయాల నెందుకు నిర్లక్ష్యం చేస్తారు?

ఫౌస్ట్

చాలా సాహసమైన ప్రశ్న వేస్తున్నావు. దేవుణ్ణి నమ్మకపోతే ఇక దేనిని నమ్ముతాడు మానవుడు? భగవత్ విశ్వాసంవేరు, మతగురువుల నిత్య జీవన పద్ధతులు వేరు. మన ప్రశ్నలకు వారు ఇచ్చే జవాబులు ఎంతో పేలవంగా, అర్థరహితంగా వుంటవి.

మార్గరెట్
అయితే మీదు మతాన్ని నమ్మరన్నమాట

ఫౌస్ట్
అయ్యో! అంత తొందరపడితే ఎలా మార్గరెట్! నీవు నన్ను బాగా అర్థం చేసుకోవాలి సర్వాంతర్యామికి, సర్వలోకాధిపతికి, సర్వమూ తానై నిలిచిన పరంజ్యోతికి, ఏదో ఒక పేరుపెట్టి, అందులో 'నా దేవుడు నిలువలేదని' అనుకోడం సాహసకృత్యం కాదూ! నిన్నూ నన్నూ సమస్త చరాచర జగత్తునూ, సృష్టించి మనుగడ కల్పిస్తున్న జగత్కారకుణ్ణి నాలుగుముక్కల్లో ఎలాచెప్పగలను! ఆకాశం క్రిందపడకుండా, నక్షత్రాలు నేల రాలకుండా, సూర్య చంద్రుల గ్రహగతులు తప్పకుండా, ఈ సమస్త సృష్టినీ నడుపుతున్న సర్వాంతర్యామిని మనం కండ్లతో చూడలేం ఈ చిన్న మెదడుతో అర్థం చేసుకోలేం కాని ఆశక్తిలోని అంశ మన హృదంతరాళంలో మిణుకు మిణుకుమంటూ ప్రేమానుభవంలో రెండు మిణుగురులు మాట్లాడుకొన్న విధంగా, సృష్టి మాధుర్యాన్ని, జగత్ సౌందర్యాన్ని, పరిచయం చేస్తూ ప్రేమ అను భావనలో వ్యక్తావ్యక్తంగా ద్యోతకమవుతున్నది. దేవుని ఎలా వర్ణించలేమో ప్రేమను కూడా అలా నిర్వచించలేము అందుకుతగ్గ పదజాలం మనకులేదు. మనోవైశాల్యమూ లేదు కాని దేవునికీ ప్రేమకూ కూడా మూలస్థానం భావం. భావజలధిలోని ముత్యాలు రెండున్నూ వేరుఅనునది ఎప్పుడూ వర్ణింపజాలగల పైపొట్టు

వంటిది. నిజకాంతిని అడ్డగించే పొగమంచు వంటిది ఈ పేరు.

మార్గరెట్

మీరు చెబుతున్నది బాగానేవుంది. మా ఫాదరీ కూడా ఇదేవిషయాన్ని మరొకరకంమాటల్లో చెప్తాడు.

ఫౌస్ట్

పరమేశ్వరానుభూతిని చవిచూడగల హృదయం ఎటువంటి మాటలతో, ఆ అనుభవాన్ని విప్పిచెప్పినా, ఆ స్వీయానుభవం అతి సహజంగా అవతలవారికి వ్యక్తమవుతుంది. ఎవరిభాషవారిది కాని భాషకాదు ముఖ్యం భావమూ, భావానుభవమూ.

మార్గరెట్

ఎవరికి నచ్చినవిధంగా వారు తమ భావాలను చెప్పకోడంవల్ల పొరబాటేమీ లేదుగాని దేవరహస్యం ఈ మాటలమధ్య కప్పివేయబడుతున్నదేమో! నిజమైన క్రైస్తవులు చర్చికి వెళ్ళకుండా ఎట్లా?

ఫౌస్ట్

అదేం ప్రశ్న మార్గరెట్?

మార్గరెట్

మీరు మతారాధకులకు దూరమైపోవడం విచారకరం. ఇంత తెలిసినవారు చర్చినికాదనటం న్యాయమా?

ఫౌస్ట్

నీవలా ఎందుకనుకొంటున్నావు?

మార్గరెట్

మీ మిత్రునిచూస్తే నాకెందుకో భయం వేస్తున్నది. ఆముఖంలోని తీక్షణత, నన్నెందుకో తరిమి కొట్టుతున్నది. వేటగాడి బాణానిక జడిసి పారిపోయే మృగం రీతిగా, నా హృదయం ఎందుకనో పరువులెత్తుతున్నది వెనుకటి ప్రశాంతతను కోలుపోయింది

ఫౌస్ట్

నీవు అమాయకురాలివి. దేనినిగురించో అకారణముగా భయపడుతున్నావు.

మార్గరెట్

మనుష్యులపట్ల నాకెంతో సద్భావమున్నది. కాని అతన్ని చూస్తే, ఎందుకనో నా రక్తం వుడుకెత్తుతున్నది మీకోరకై నిరీక్షిస్తున్నప్పుడు ఎందుకనో ఆమనిషి వికార రూపు మన యిద్దరిమధ్యా అడ్డంగా నిలుస్తుంది. అతడు మనకెటువంటి హాని తలపెడుతాడోనని భయంగా వుంది.

ఫౌస్ట్

అలాంటివారూ లోకంలో అక్కడక్కడ వుంటూంటూరు

మార్గరెట్

కాని వారిని భరించడం ఎంత కష్టం? ఎవరిపట్లా అతనికి సదభిప్రాయం వున్నట్లు కనబడదు. అసలు ఆచూపుల్లోనే ఏదో విషమున్నదా అనిపిస్తుంది ఎప్పుడూ మీ

దగ్గిరే వుండాలనీ, మీ వెంట తిరగాలనీ నా అభిమతం. కాని అతను కండ్లబడగానే ఈ గుండె రాయి అవుతుంది.

ఫౌస్ట్

నీ కలవరపాటుకు కారణం కనబడటంలేదు.

మార్గరెట్

అతడు మనకిప్పుడు కంటపడ్డాడా - నేను మిమ్మల్ని పూర్తిగా ప్రేమించడంలేదేమో అనే భావన మనసును చికాకుపరుస్తుంది. అతను కనపడ్డప్పుడు, ఆఖరికు భగవన్నామం కూడా స్మరణకు రాదు. అందువల్లనే మరీ భయంగా వుంటుంది

ఫౌస్ట్

మనకు ఇష్టంలేనివారు కనపడ్డపుడు అటువంటి భావాలు కలగడం సర్వసహజం.

మార్గరెట్

అంతేనంటారా! మీరు అనుమతిస్తే నేను యిక వెడతాను

ఫౌస్ట్

ఎందుకాతొందర? ఇంకో గంటసేపు నా దగ్గిర కూర్చోకూడదూ? నీసమక్షంలో నా హృదయం మహదానందాన్నీ గొప్ప శాంతినీ పొందుతోంది. నేను ఈరాత్రి మీయింటికి రానా? అప్పుడు స్థిమితంగా మాట్లాడుకోవచ్చు మనం.

మార్గరెట్

గడియ తెరచి వుంచుతాను రండి. అలా తోట లోకి వెళ్ళి మాట్లాడుకోవచ్చు. అమ్మ అంత ఆదమరిచి నిద్రపోయేమనిషి కాదు. అయినా చూదాం. మీరు నా ప్రక్కన వుండగా ఇక నాకు భయమెందుకు?

ఫౌస్ట్

పోనీ మీ అమ్మ రాత్రింతా లేవకుండా వుండే వుపాయం చెప్పనా? ఇదిగో ఈ సీసాలోనిది, మూడుబొట్లు పాలతో కలిపి త్రాగించు. బాగా తెల్లారేదాకా నిద్ర లేవదు. గాఢంగా నిద్రపడుతుంది.

మార్గరెట్

మీకోసం ఎటువంటి సాహసానికైనా సిద్ధంగానే వున్నాను. ఇందువల్ల ఏమీ ప్రమాదం రాదుకదా!

ఫౌస్ట్

ప్రమాదమా! పిచ్చిదానా - ప్రమాదకరమైనది నీ చేతికి యిస్తాననుకొన్నావా?

మార్గరెట్

మీ మాటకు ఎదురాడగల శక్తి నాకు లేదు. మీరు చూపిన బాటగుండా నడవడమే నా కర్తవ్యమని పిస్తోంది. నా సమస్తమూ మీ కర్పించాను. ఇక నా దగ్గర ఏమున్నది - మీకివ్వడానికి? (నిష్క్రమణ)

(మెఫిస్టోఫిలిస్ ప్రవేశిస్తాడు)

మెఫిస్టోఫిలిస్

ఆ చిన్న కోతి నిష్క్రమించిందా?

ఫౌస్ట్

ఇక్కడ పొంచి వున్నావన్న మాట.

మెఫిస్టోఫిలిస్

పొంచి ఉండటమే కాదు. మీ మాటలన్నీ శ్రద్ధగా విన్నాను పండిత శ్రేష్ఠులు భలే ఉపన్యాసమిచ్చారు. మందు బాగా పని చేసింది. కన్నె పిల్లలకు ఇలాంటి కబుర్లు వినడం మహా సరదాగా ఉంటుంది తమకు ఆచారాలపట్ల ఉన్న భక్తి శ్రద్ధలు చెపితే యీ ప్రేమారాధకులు చచ్చినట్లు తమను అనుకరించకపోతారా అని – యీ నవయువతుల ఉద్దేశ్యం మీరు మేము చెప్పిన విధంగా చెయ్యండర్రా అనరు. ఇలా మేము చేస్తున్నామని – సూచనగా ఒక బాణం వొదిలిపెడతారు, ప్రేమ పిచ్చిలో పడ్డవారు ఆ పలుకులు శిరోధార్యములుగా భావిస్తూ ''ఏమి సెలవు దేవీ'' అంటారు

ఫౌస్ట్

అబ్బబ్బా అన్నీ తెలిసినట్లే మాట్లాడుతావు నీకు మార్గరెట్‌ను గురించి ఆవగింజతయినా తెలియదు. ఆమెకు గాఢతరమగు భక్తి విశ్వాసాలున్నాయి, ఈ ఐహిక జీవితము మోక్ష సాధనకు ఉపకరణం కావలని ఆమె విశ్వాసం. త్యాగజీవిని, అమృత హృదయ ఆమె

మెఫిస్టోఫిలిస్

అర్థం శుభం తెలియని చిన్న పిల్లలను అందాలతో కట్టేసి, పెద్ద కబుర్లు చెబుతారు నీలాంటివారు

ఫౌస్ట్

నీకు ఒక నాడు ఏదయినా సక్రమంగా కనపడింది గనకనా యీనాడు యిది సరిగా కనబడలేదనుకోనేందుకు! వాగుడు నీ జన్మహక్కు నీ జాతి లక్షణం పోగొట్టు కన్నావు కాదు

మెఫిస్టోఫిలిస్

ఆ కన్నెపిల్ల విధివ్రాత అలా వుంది నీవేం చేయగలవు, నేనేం చేయగలను? అక్షర జ్ఞాన సంపన్నులందరికీ విధి లిఖితం తెలిస్తే ఇంకేమన్నా వున్నదా? ఇవ్వాళ రాత్రి ఒక తమాంషా జరుగుతుంది చూడు, ఒక మహాద్భుతం జరుగుతుంది

ఫౌస్ట్

అనగా?

మెఫిస్టోఫిలిస్

అంతా చెప్పకూడదు

ఫౌస్ట్

సగం చెప్పి ఆపివేస్తావేం, నీ దుర్బుద్ధి పోనిచ్చుకోవు కదా!

మెఫిస్టోఫిలిస్

నేను దుర్బుద్ధినో, సుబుద్ధినో నీకేం తెలుసు నా పని నేను చూచుకొంటాను నీపని నీవు చూచుకో!

———

# ఊరిబావి వద్ద

(మార్గరెట్ ఆమె స్నేహితురాలు లీస్ చెన్ కడవలతో నీళ్ళు నింపుకొంటూ — ఖబుర్లు చెప్పుకుంటూ వుంటారు)

లీస్ చెన్

బార్బరా సంగతి విన్నావా?

మార్గరెట్

ఊహు. ఈమధ్యన బయటకి రావడం లేదుగా?

లీస్ చెన్

సిబిలీ యివ్వాళ చెప్పిందావిషయం. నిష్కారణం ప్రేమ గొడవలో పడి నిండు జవితాన్ని చిచ్చు పెట్టుకొన్నది

మార్గరెట్

ఇంతకూ అసలు సంగతేమిటి?

లీస్ చెన్

అసలు సంగతేమిటి, ఒకటె సంగతి ఇప్పుడామె ఒక్క ప్రాణంకాదు, రెండు ప్రాణాలు

మార్గరెట్

అంతపని చేసిందా?

లీస్ చెన్

ఎవరు చేసిందానికి వారు అనుభవించక తప్పదు. ఇటువంటివి ఎన్నాళ్ళు దాగుతాయి? ప్రారంభంలో పికార్లూ, తరువాత నాట్యశాలలూ. ఎక్కడ చూచినా, ఎదురు బెదురు లేకుండా వాళ్ళే. ఎంత అట్టహాసం చేశాడా పెద్దమనిషి! తన డాబూ దర్పం చూపి, ఆ పిల్లను మోసగించేందుకు ఎన్ని బహుమానాలు గుప్పించాడా అమ్మాయి మీద! చివరకు ఆ అమ్మాయి జీవితాన్ని నాశనం చేశాడు. అది ఒట్టి తెలివి తక్కువది కాకపోతే ఆ ఆడంబరాలకు మోసపోతుందా?

మార్గరెట్

పాపం! ఎంత అన్యాయం జరిగింది బార్బరాకు!

లీస్ చెన్

పాపం. అని జాలికూడానా దానిపట్ల. తన వయసు వాళ్ళకది ఎంత అప్రదిష్ఠో తను ఆలోచించలేక పోయింది.

మార్గరెట్

ఆ యువకుడు బార్బరాను పెళ్ళి చేసుకుంటాడేమోలే

లీస్ చెన్

వాడో దౌర్భాగ్యుడు. పెళ్ళి చేసుకొనేవాడు అలా నడిసముద్రంలో వదిలి పారిపోతాడా? పలాయనం చిత్తగించే నీచుణ్ణి పెద్దమనిషని అనగలమా?

మార్గరెట్

అలా పారిపోవడం మంచిది కాదనుకో.

లీస్ చెన్

అసలు అతను ఎక్కడ వున్నాడో తెలుసుకోవడం ఆ అమ్మాయికి సాధ్యమవుతుందా? ఇక నేనింటికి పోవాలె బాబూ (లీస్ చెన్ వెళ్ళిపోతుంది)

మార్గరెట్,

(ఇంటికేసినడుస్తూ) నా అంతమంచివాళ్ళేవరూ లేరని ఒకప్పుడు వుబ్బితబ్బిబ్బు అయ్యేదాన్ని ఇప్పుడు నేనూ సామాన్యురాలినై పోయాను నేను చేస్తున్నది తప్పో ఒప్పోకూడా తెలియడంలేదు బార్బరా అవస్థే నాకూ పట్టదుకదా!

——

# విగ్రహం ముందు

(మరియా విగ్రహంముందు మార్గరెట్ పూల గుత్తులతో నిలబడుతుంది)

మార్గరెట్

మాతా! నువ్వు కష్టాలు అనుభవించిన మాతవు! ఇతరుల కష్టాలు నీకు తెలియనివికావు మా యింటి ముందున్న పూలతొట్టెలన్నీ, నాకన్నీటితో తడిసినవి. నా కన్నీరే నీరుగా పూచిన పువ్వులివి వీటిని నీపాద పద్మాలపైన వుంచి నామనసు తేలికపరుచుకొంటున్నాను. ఆ ప్రసన్నవదనంతో ఒక్కసారి యీ దీనురాలిని కనికరించవూ?

—

# రాత్రివేళ

(మార్గరెట్ అన్న వేలంటీన్ వాళ్ళ యింటిముందు)

వేలంటీన్

(స్వగతం) స్నేహితులతో కూచుని కమ్మని కబుర్లు చెప్పుకుంటున్నపుడు వారు నా సోదరి సౌశీల్యాన్ని వెం కటి రోజుల్లో ఎంతో మెచ్చుకొనేవారు ఈ దేశం మొత్తంమీద నా సోదరివంటి ఉత్తమురాలు ఎక్కడా లేదని కొనియాడేవారు నాకెంతో గర్వంగా వుండేది. ఒకరితో నొకరు ఆమెను గురించి ఘనంగా చెప్పుకొం వారు నేనూ, నా చెల్లెలు ఏంత గొప్పదో వారి అభిప్రాయాలకి తగ్గట్టుగా, రెండు మాటలు అంటూవుండేవాడిని. సౌశీల్యమే స్త్రీకి గల సహజ ఆభరణం. అది లేనినాడు ఆ స్త్రీకి ఏమున్నది? నా చెల్లెలు చేసిన పాడుపని తలచుకొంటే జుట్టుపీక్కోవాలనిపిస్తోంది ఈ అవమానాగ్నిలో నా మెదడు ఒక్క తడవ భగ్గునమండిపోతే బాగుండునని పిస్తోంది ఆమె పతనంతో నేనందరికీ లోకువయిపోయాను ఆమె చెడు ప్రవర్తన నా గౌరవాన్ని మట్టిపాలు చేసింది. దౌర్భాగ్యునివలె పలువురి మాటలకు గురి కావలసి వస్తున్నది. వాళ్ళని ప్రతిఘటించగల శక్తి నాకేమున్నది

మోవి అబద్ధాలని వాళ్ళతో ఎలా అనగలను? ఈ చప్పుళ్ళేమిటి? ఎవరో యిటు వస్తున్నారు కొంచెం దాక్కొని వుంటే మంచిది. ఆ యిద్దరూ యిటే వస్తున్నట్లున్నారు. అందులో ఒకడు నా చెల్లెలి పతనానికి కారకుడై వుంటాడు. ఇప్పుడే యిక్కడే వాడిని నాలుగు తన్ని బుద్ధి చెప్పితే?

(ఫాస్ట్, మెఫిస్టోఫిలిస్ ప్రవేశం)

ఫాస్ట్

పూజామందిరంలోని జ్యోతి దేదీప్యమానంగా వెలుగుతూండటం. ఆ కిటికీలోనుంచి చూడవచ్చు చీకటి ముంచుకొని వస్తే ఆరిపోయేదకాదు ఆ జ్యోతి మన నేత్రకాంతి. ఎందువల్లనో నలువైపులనుంచీ గాఢమైన చీకట్లు కమ్ముకొని వస్తున్నాయి నా హృదయాన్ని ఎవరో పిడికిలిలో పట్టి బంధించినట్లున్నది.

మెఫిస్టోఫిలిస్

మనకిప్పుడు కావలసింది చీకటేకదా! ఇండ్లన్నీ చీకటి ముసుగుకప్పుకొని పోవాలె చీకటిలోగల అందం ముఖ్యంగా యిటువంటప్పుడే తెలుస్తుంది, చీకటిలోనే ప్రియురాలి కండ్ల వెలుగులు, చీకటిని చీల్చివేస్తున్నట్లు కనిస్తుంది. అంధకారాన్ని మృత్యువుతో పోలుస్తారు అవివేకులు. కానీ యీ అంధకారంనుంచే అన్ని వెలుగులూ, అన్ని శాంతులూ ఏర్పడుతున్నాయి.

ఫాస్ట్

అవును నీవన్నమాటలో కొంచెం నిజమున్నదేమో

అనిపిస్తోంది. ఈ చీకటిలోని శూన్యతను పోగొట్టగలిగేది మరొక ప్రాణిసాన్నిధ్యమేకదా. మార్గరెట్ నా ప్రక్కన వుంటే, ఇదిచీకటెందుకు అవుతుంది? ఆమె అమాయకురాలు. యింకాచిన్నది, జీవితపువలయాలూ, వలలూ తెలియవు. తన చిన్నలోకంలోనే జీవితము సాఫీగా జరిగిపోవాలనుకొంటున్నది. ఆమెది ఎంత మృదుజీవనమో నాది అంత కఠోర పధము. శాస్త్ర పురాణాలన్నీ తిరగవేసి, దేవుని అస్తిత్వం ప్రశ్నించాను. విగ్రహాలలో దేవుడున్నాడంటే అవి వట్టి రాతి విగ్రహాలు, కర్రబొమ్మలూ సుమా అని వాటిని త్రోసి పారేశాను ఏకాకినై. అనంతపధగామినై, నా మెదడూ హృదయమే నాకు అండదండలుగా యింతదాకా ప్రయాణం చేశాను. ప్రచండమైన తుపానులతోకూడిన బృహత్ జీవితము నాది. ఆమె ఒక చిన్నపుష్పము ఆ పుష్పాన్ని నేను నలిపివేస్తున్నానా? అనిపిస్తుంది ఆ రాక్షస కృత్యానికి నీవు దగ్గరుండి నన్ను పురిగొల్పుతున్నావు. నన్ను నాశనంచేసింది చాలక, ఆమెనుకూడా నాద్వారా నాశనం చేయించాలని పట్టుబట్టావు ని మాయాజాలం ముందు నేను శక్తిహీనుణ్ణి అవుతున్నాను నీవు అనుకొన్నది నాద్వారా చేయిస్తేగానివదలవు అదేదో సెలవియ్యి. ఆ జరగవలసిందేదో తొందరగా అయిపోతే యీ వుచ్చునుంచి, ఈ నరక యాతననుంచి విముక్తి లభిస్తుంది.

మెఫిస్టోఫిలిస్

ఎందుకా వెర్రిపుద్రేకం, వెర్రిఆవేశం. నీవు కోరినది మార్గరెట్‌ను ఇంటిముందుకొచ్చి ఎందుకాధర్మప్రశ్నాలు చెబుతావు? పుణ్యముహూర్తంకోసమెదురుచూచి, ఆపుణ్య సమయం ముందుకు త్రోసుకొని వచ్చినపుడు, ఎందుకలా బెదురుగొడ్డులాగా వ్యవహరిస్తావు

ఫౌస్ట్

నేనేమి మాట్లాడుతున్నానో నాకు తెలియడంలేదు. నా బుద్ధి నా స్వాధీనంలో లేదు హృదయమేనాడో పరా ధీనమయింది ఇంతకూ ఆ నగల పెట్టెను ఏం చెయ్య మంటావు?

మెఫిస్టోఫిలిస్

అది నీకేకదా! ఆ పెట్టను అందులోగల అభరణా లతో ఎవరికి బహుకరించవలసినదీ నేనే చెప్పాలా?

ఫౌస్ట్

మళ్ళ మరొక నగలపెట్టా? అందులో వుంగరము న్నదా? ఆమె వేలికి తొడగాలనుకొన్న వుంగరం.

మెఫిస్టోఫిలిస్

వేలికి వుంగరమే తొడుగుతావో, మెడను ముత్యాల హారంతో అలంకరిస్తావో! అమూల్యమైన నగలున్నవి యీ పేటికలో నేనిప్పుడొక పాట పాడుతాను యీ సితారు సంగీతానికి నా సన్నని పాటకూ ఆమె ఆ కిటికీవద్ద ప్రత్యక్ష మవుతుంది (మెఫిస్టోఫిలిస్ సన్నగా పాడుతూంటాడు)

(వేలంటీన్ ప్రవేశం)

వేలంటీన్

ఎవర్రా మీారిక్కడ? ఎలుకలనిబట్టే వీధి దొంగల్లా వున్నారు. ఆ సితారు శబ్దం సంగీతమా? దానినీ మిమ్మల్నీ కూడా ముక్కలు ముక్కలు చేసివేస్తాను

మెఫిస్టోఫిలిస్

సితార్ విరిగిపోయింది భాయీ! చేయదలచుకుంటె ముక్కలు చెయ్యి, సిద్ధంగా వున్నాము.

వేలంటీన్

సితారు విరిగిపోయిందా, అయితే బద్దలు కొట్టవలసింది మీా బుర్రలు

(మెఫిస్టోఫిలిస్ ఫౌస్ట్‌తో)

మెఫిస్టోఫిలిస్

మంచితనం పెట్టుబడిగా మనం ముందుకు వెళ్ళాలేం ఇప్పుడు నీవు యిటుప్రక్కకురా, నేను కనుక్కుంటానా సంగతి.

వేలంటీన్

నేనూ కనుక్కుంటానోయ్ ని సంగతి

మెఫిస్టోఫిలిస్

సై అంటేసై – నేను వెనకడుగు వేస్తాననుకొన్నావా?

వేలంటీన్

నాకు శత్రువు నీవొక్కడివే కాదు, మీారిద్దరూను.

ఇద్దరూ సిద్ధంగా వుండండి. నా శక్తి సామర్థ్యాలు చవి చూడటానికి

మెఫిస్టోఫిలిస్

నేనెప్పుడూ సిద్ధంగానే వుంటాను భాయీ.

వేలంటీన్

ఇదేమి అన్యాయం ఏదో అగోచరశక్తి నన్ను చుట్టుముట్టేస్తోంది చేతులు కదలడం లేదేం కాళ్ళు నేలలో పాతుకుపోయాయేం చెప్మా!

మెఫిస్టోఫిలిస్ (ఫౌస్టుతో)

ఇదే సమయం ఒకటిచ్చుకో.

(ఫౌస్టు ఒకటిచ్చుకునేసరికి వేలంటీన్ అమ్మయ్యో అని అరుస్తూ పడిపోతాడు)

మెఫిస్టోఫెలిస్

వీడి గొడవ వదలిపోయింది కాని మనం యిక్కడ వుండకూడదు వీడి చావుకేకలు విన్న యిరుగుపొరుగు వాళ్లు బయటికి వస్తారు మీరిక్కడెందుకున్నారని పోలీసు వాళ్ళు అడుగుతారు మనకెందుకీగొడవ. హాయిగా పలాయనం జపించడం వుత్తమం

(ఇద్దరూ వెళ్ళిపోతారు. మార్తా కిటికీలోనుంచి చూచి)

మార్త

కొంప మునిగింది, రండర్రా రండి. ఏదో వుపద్రవం జరిగింది.

మార్గరెట్

(కిటికీలోనుంచే) దీపాలు పట్టుకొనిరండి.

మార్త

వాళ్ళేదో తిట్టుకొంటున్నారు, కొట్టుకొంటున్నారు అనుకొన్నాను. పెద్దగా కేకలు వినిపించాయి

జనం

ఆ మనిషి చనిపోయినట్లున్నాడు.

మార్త

(బయటకువస్తూ) హంతకులు పారిపోయినట్లున్నారే.

మార్గరెట్

(బయటకు వస్తూ) ఎవరక్కడ పడివున్నది?

జనం

దగ్గరకొచ్చి చూడమ్మా, నీకే తెలుస్తుంది

మార్గరెట్

భగవాన్ ఎంత అన్యాయం చేశావు!

వేలంటీన్

ప్రాణం పోతున్నది ఇంకెంతసేపో నిలవదు మనసులో వున్నది ఎంత తొందరగా చెప్పేస్తే అంత నిశ్చింతగా ప్రాణాలు పోతాయి మీరేమీ ఖంగారు పడకండి. నేను యింకా కొనవూపిరితో వున్నాను మార్గరెట్ నాకేసి ఒకసారి చూడు. నీవు చిన్నదానివి లోకజ్ఞానం తెలియనిదానివి. ఒక సంగతి నీకు నిర్మొహమాటంగా

చెప్పాలె. నీ జీవితమిలా బజారుకెక్కడం హేయమైన విషయం. ఏమైనా బజారుసంగతి బజారులోనే చెప్పాలి

మార్గరెట్

నీవు నా అన్నగారివి తోడబుట్టినదానిని గురించి యిలా నలుగురిలోనూ అనవచ్చా?

వేలంటీన్

ఆ సత్యా సత్యాలు విచారించేందుకు ఈశ్వరు డున్నాడు. ఆ ధర్మ నిర్ణయం భగవంతునిది జరిగినదానికి వగచి లాభంలేదు ఇంతవరకూ జరగవలసిన విధంగా జరిగిపోయింది నీవు నీచకృత్యానికి ఒడిగట్టావు ధర్మచ్యుతిని పొంది, రహస్య వ్యవహారం ప్రారంభించావు నీ పతనం యిక్కడితో ఆగదు మెట్టూ ప్రజలు నిన్ను ఎంతచులకనగా చూస్తారో నీకు తెలియదు నీవు చివరికొక వుంపుడుకత్తెగా తయారవుతావు నీ పాపాల ఫలితంగా గర్భమే కలిగిందా, అది విచ్ఛిన్నం చేసుకోటానికి శాయశక్తులా ప్రయత్నిస్తావు. కొంత కాలం లోకపు కండ్లు మూయగలవు. కొంత కాలం వారి నోళ్ళుమూయగలవు. కాని ఆ పన్నుగడ కల కాలం పనిచేయదు లోకపు చెవులు చాలా పెద్దవి లోకపు కండ్లు నీ కండ్లు కంటే తేజోవంతమైనవి. వాటి నుంచి నీ పాపపు జీవితాన్ని దాచలేవు మాన మర్యాదలు లెని జీవిక మిగిలేదేముంది? నీ నేర్పూ, ని తెలివీ, ఇక్కడ పని చెయ్యవు. ఇకముందు రాజబాటనూ, వెలుతురునూ, నీవు చూడలేవు. అంధకారమూ, సందు గొందులూ నీ జీవన

మార్గములవుతాయి. లోకులు నిన్ను ఎంత అసహ్యంగా, చులకనగా చూస్తారో, ఆనాటికానాడు నీ గుండె ఎలా శిలా రూపం దాలుస్తుందో, నేను వూహించుకోగలను నీ భవిష్యత్ నాకు తెలుసు దేవతా మందిరాల్లో నీకు ప్రవేశార్హత ఉండదు దైవ పూజకై నిర్దేశింపబడిన పుష్పాలు నీవు ముట్టుకుంటే మాడిపోతాయి కులీనులూ, కుటుంబికులూ, నిన్ను దూరంగా అట్టే పెడతారు బిచ్చగాళ్ళతో, అంగ విహీనులతో, స్థిర జీవనం లేని పతితులతో, నీవు నీ ప్రాణం నిలుపుకోడానికి నరక కూపంలోపడి కొట్టుకొని పోతావు ఆ భగవానుడు నిన్ను దయదలచి కరుణించా... నీవు అదృష్టవంతురాలివే కాని లోకపు దృష్టిలో నీకు అంటగట్టబడ్డ మాలిన్యాన్ని మటుకు కడిగి వేయలేవు.

మార్త

ఎందుకలా శాపనార్థాలు పెడతావు? ఆ పిల్ల ఉసురు నీకు తగుల్తుంది మనందరి తప్పులూ క్షమించే భగవంతుడు పైన ఉండగా నీ వెవరివీ నిర్ణయాలు చేసేందుకు?

వేలంటీన్

నీవు ఎందుకు కలుగజేసుకుంటావ్ మా ఇంటి వ్యవహారాల్లో? నీకు నీతి నియమాలు ఉన్నాయిగనుకనా? ...కే గనుక సిగ్గు ఎగ్గు ఉంటే యిలా జరిగేదా? నాకు ... తోగా గాని ఉంటే ఏంచేసి ఉండేవాడినో నీ పాపపు ...విశాం యింతటితో అంతమయి ఉండేది.

మార్గరెట్

అన్నయ్యా, ఎందుకీ మాటలు? కడపటి క్షణాలని ఎందుకు కలుషితం చేసుకుంటావు?

వేలంటీన్

ఆహా! చెప్పొచ్చావు, మహా పెద్ద మనిషివి నా గుణశీలలో చిచ్చుపెట్టి, నన్ను యీ స్థితికి తీసుకొనివచ్చి యింకా ధర్మ సన్నాలు వల్లిస్తున్నావే నేను సైనికుడిని, వీరోచిత ధర్మం నా మార్గం జరుగుతున్నది తప్పని ఎదు రించలేదు. యీ ధైర్య సాహసాలకు మెచ్చి భగవంతుడు నన్ను పిలుచుకొని పోతున్నాడు. నేను ఆయన సమ క్షంలోకి నిర్భయంగా నిశ్చితంగా వెళ్ళిపోతున్నాను.

# ఊళ్లో పెద్ద చర్చిలో

(ప్రార్థనలో పాల్గొనడానికి వచ్చి జనం మధ్య మార్గరెట్. ఆమె వెనక ఒక అదృశ్య శక్తి)

అదృశ్య శక్తి

అప్పటికీ యిప్పటికీ నీలో ఎంత మార్పు! ఎంత మారిపోయావు ఒకప్పుడు నీవు అమాయకురాలివి. ప్రార్థనా పుస్తకంతో పూజావేదిక సమీపించి, కడు లీనం యకంగా నిండు మనసుతో ధ్యానించేదానివి నీ హృదయం భగవంతునిపై కేంద్రీకృతమై వుండేది ఇప్పుడు నీకా ధ్యానముద్ర ఎక్కడ? నీ హృదయమంతా కల్మషంతో నిండిపోయింది. నీ మనసు నిండా ఎన్నో పాపపు ఆలోచనలు నీ తల్లి ఆత్మశాంతికై ప్రార్థన జరపడానికి వచ్చావా? నీవు యిచ్చిన మందు ధర్మమా అని ఆమె తిన్నగా ఆ నిద్రలోనే పరలోకానికి వెళ్ళిపోయింది ఆమె ఎంత బాధ పడిందో ఆ నిద్రలో నీవు ఊహించుకోగలవా! పశ్చాత్తాపాగ్నితో నీవింకా దగ్ధం కావడంలేదు ఎందుచేత? నీ గుండె రాయి అయిపోయింది. ... హలో నర మాంసమూ, రక్త ప్రసారమూ లేవు అది చట్టి శిల ... భవిష్యత్తు ఏమిటో నీవు తలపోశావా? ...

లోకంలోనూ, పరలోకంలోనూ ఎవరయినా వున్నారా యిక!

మార్గరెట్

నా మనసు ఎందుకని యింత చిందర వందర అవుతున్నది? ఈ బాధలనుంచి విముక్తి లేదా? (బృందగానం వెనక)

('నీకు విముక్తి నిచ్చే రోజు వస్తుంది'. వాద్య శబ్దాలు)

అదృశ్యశక్తి

శ్మశానం కంపించే విధంగా వాద్యాలు మ్రోగుతున్నాయి. ఆ భయంకరధ్వనులు నిన్ను చుట్టు ముట్టేస్తాయి. కంపించే నీహృదయం దావానలంలోకి దొర్లక తప్పదు. నీ బూడిదే నీకు శాంతి

మార్గరెట్

ప్రార్థనామందిరంలో భయమేస్తున్న దేమిటి? అన్ని భయాలనుంచీ కాపాడే చోటనే నాకు భయంకలిగితే ఇక నాకేందారి? నాగుండెలలోకి గ్రుచ్చుకుపోతున్న యీ అదృశ్యపు ఖడ్గాలు ఎటునుంచి వస్తున్నాయి? వీటినుంచి తప్పించుకోగలశక్తి నాకు లేనట్లుంది (బృందగానం 'ఎవడు చేసినపాపం వారనుభవించక తప్పుతుందా, తీర్పునిచ్చే దేవదేవునివద్దనుంచా నీతప్పులు దాచడం')

మార్గరెట్

ఎంత ఉమ్మరికం, ఉడికిపోతున్నది ఈ గోడలూ

స్తంభాలూ నామీద విరుచుకొని పడేటట్లున్నాయి. గాలి ఆడటంలేదు.

అదృశ్యశక్తి

ఎక్కడికి పారిపోవాలని? నీపాపకృత్యాలను దాచడం నీకు సాధ్యమా? ఎన్నాళ్ళు దాచగలవు? మనుష్యుల నుంచి దాచగలవుగాని, భగవంతునినుంచి దాచగలవా? నీకు గాలీ వెల్తురూ ఎందుకు? నరకకూపంలో పడివుండ వలసినదానివి

(బృందగానం)

'మానవునిలోని ధర్మం నశించిన తర్వాత ఎవరిని ఆశ్రయించాలె? ఏ వెలుతురూ కనబడనప్పుడు ఎటు చూడాలె? చెయ్యదగిన దేమిటో తెలియనపుడు ఏమి చెయ్యాలె?'

మార్గరెట్

ఊపిరి ఆడటంలేదు ఏది ఆ సీసా!

(మూర్ఛపోతుంది)

---

# వాలీపర్ గిస్ పండుగ రాత్రి

(కొండలమధ్య ప్రదేశంలో ఫాస్టూ మెఫిస్టోఫిలిస్)

మెఫిస్టోఫిలిస్

మనయాత్ర ఎలా వుంది? ఈ ప్రయాణాలప్పుడు నీకొక చీపురుకట్ట కావాలె నీవుకూడా ఎందుకు కోరుకో కూడదు? పొట్టేలు నెక్కి యిటువంటి ప్రదేశాలు చేరుకో వాలె

ఫాస్ట్

జవసత్వాలు లేనివాళ్ళకు చీపురుకట్టలూ పొట్టేళ్లూ కావాలె మనకెందుకు, ఈ చేతి కర్ర చాలు. అడ్డదారుల వెంటకాక, మామూలు మార్గాలనే ప్రయాణం చేదాం. ఎగిరేబదులు నడిచి వెడితే చుట్టూగల ప్రకృతి అందాలు చూడవచ్చు వసంత శోభలు యీ లోకానికి నూత్న యౌవనం ప్రసాదిస్తున్నాయి ఆ చెట్లు చూడు, ఎంత వుత్సాహంగా వసంతాగమనానికి స్వాగతం చెబుతు న్నాయో! మానవ హృదయంలోకూడా ఆ శోభ వున్నది.

మెఫిస్టోఫిలిస్

నీది ఒకటే ధోరణి నాకదేం నచ్చదు నాకు చలి కాలమంటే మహా సరదా. చలిమంచులో నడిచినపుడు

ప్రాణం చల్లగా వుంటుంది. దారుణమైన హిమపాతంలో, కన్ను కానని చీకటిలో, వుండే తళుకు యీ వసంతంలో ఎక్కడేడ్చింది? ఆ కొరివిదయ్యాన్ని పిలుద్దామా? మనకు దారి చూపుతుంది ఏయ్ కొరివీ యిటు రా. ఊరికే తుప్పి గంతులు వెయ్యకుండా మాకు దారిచూపు.

కొరివిదయ్యం

మీవంటి పెద్దమనుష్యులకి సాయపడటంకంటే నాక కావలసినదేమున్నది?

మెఫిస్టోఫిలిస్

నరవాసన పట్టినట్లున్నది నీకు, వెర్రిఖబుర్లు చెబుతు న్నావు నేనెవరినిలో తెలుసా? భూతాధిపతిని. నేను చెప్పిన చోటికి తీసుకొనివెళ్ళు. నా ఆజ్ఞని ఉల్లంఘించా నీ జ్వాల ఆరిపోతుంది.

కొరివిదయ్యం

తమరెవరో తెలిసింది ఆజ్ఞ, ప్రభూ? ఈ పండుగ నాడు తమరిటు విచ్చేయడం, నేను మీకు దారిచూపగల గడం, నా అదృష్టం.

(కొరివియ్యం దారి చూపుతూండగా వీరు ముందుకు వెళుతూ వుంటారు)

మెఫిస్టోఫిలిస్

మనమిప్పుడొక ఇంద్రజాలిక లోకంలోకి ప్రవే శిస్తున్నాము ఇక్కడ కనబడేవన్నీ వింత లే కొరివీ, సరిగా దారి చూపు

కొరివిదయ్యం

చూడండి ప్రభూ ఆ చెట్లు ఎలా వంగి తమకు స్వాగతం చెబుతున్నాయో!

ఫౌస్ట్

కొండలూ, సెలయేళ్ళూ దాటి, ఎక్కడికి పోతున్నామిలా? ఏవో పాటలు వినబడుతున్నవి అన్నిటికీ ఒకే రాగం ఆ పాటల నిండా ప్రేమయే ప్రేమ రాగాలతో ఎప్పుడూ మధురానుభూతులు, నూతన వస్త్రధారణతో దర్శనమిస్తాయి సృష్ట్యాది నుంచీ, సమస్త జీవులనూ నడిపేది యిది ఒక్కటేనా అనిపిస్తున్నది ప్రేమ భగవంతుని పాదాలపై కనపడే కాంతీ, ప్రియురాలి హృదయంలో వెలిగే చంద్రబింబమూ

మెఫిస్టోఫిలిస్

చూడు, చూడు. ఆ శబ్దం విను. ఎంత బాగున్నదో. దానినే గుడ్లగూబల సంగీత మంటారు. చీకట్లో అవి ఎంకుకలా పాడుతున్నాయో? చీకటంటే వాటికెంత సరదా. ఆ శాన పొట్టలతో ఉన్న పొడుగు కాళ్ళ కొంగలను చూడు. వీటికి నిద్దర లేదు ఇక ఎలుకల సంగతి చూడు. ఎన్ని రకాలు, ఎన్ని రంగులు! ఎన్ని తమాషాలు చేస్తాయో ఎలుకలు. మానవ సైనిక దళాలు వాటి ముందెందుకు పనికి వస్తాయి? ఇండ్లలో, వాకిండ్లలో, పొలాల్లో, ఒయుళ్ళలో ఎలుకలు లేని చోటంటు ఉన్నదా యీ లోకంలో. ఇక ఆ మిణుగురులు చూడు. హాయిగా నిక్షేపంగా చీకట్లని చీల్చి, చెండాడుతూ ఎలా ఎగురుతున్నాయో!

ఫౌస్ట్

ఇక్కడ ఆగుదాం. ఇక్కడ ప్రకృతి అంతా ఎంతో చక్కగా వున్నది. ఇంకా ముందుకుపోతే మాత్రం మనకు కనబడేదేమున్నది? ఆ కొండ శిలలూ, యీ వృక్షరాజాలూ ఎంతో గంభీరంగా వున్నాయి. ఇక్కడ ఎటుచూచినా దివిటీలే. మీ కొరివి దయ్యాలు నీవు చూపిన మిణుగురుల కంటె ఎక్కువ ఉన్నాయి.

మెఫిస్టోఫిలిస్

నీకు భయమేస్తే నన్ను గట్టిగా పట్టుకో మనమి ప్పుడున్నది భూతాల కనుమ వద్ద

ఫౌస్ట్

భూతాలు కూడా యింత వెలుగుని విరజిమ్మ గలవా? అది నాకు ఆశ్చర్యంగా వున్నది తీగెలవలె సాగు తున్న ఆ పొగలు ఏమిటి? ఇదంతా నాకేదో వింతగా వున్నది. ఇదంతా రాక్షస యుక్తే కావచ్చు ఇంద్రజాలమే కావచ్చు కాని యిక్కడి యిసుకంతా బంగారు కాంతితో ధగధగలాడుతోంది. పర్వత శిఖరమేదో తేజస్సుతో ప్రజ్వ రిల్లుతోంది.

మెఫిస్టోఫిలిస్

ఇది భూతాల కోట. ఇంత పెద్ద కోటను ప్రత్యక్షంగా చూడగలగటం, నీ పూర్వ పుణ్యం. రావలసిన వాళ్ళంతా యీ పాటికి వచ్చేసి వుంటారు

ఫౌస్ట్

నా అడుగు ముందుకుపడకుండా అడ్డగిస్తున్న యీ పెనుగాలి ఎక్కడనుంచి వచ్చింది?

మెఫిస్టోఫిలిస్

నీవు ఆ రాళ్ళ వెనక నిమేషకాలం తలదాచుకోవడం మంచిది ఇది పొగమంచు రాత్రినంతా తనకంబళీతో కప్పివేస్తుంది దాని ఉధృతానికి గుడ్లగూబలేఎగిరి హడలి పారిపోతున్నాయి భూతాలకోట పునాదులే చూడు, అల్లల్లాడుతున్నాయి చెట్లమొదళ్ళు యీ మంచుగాలికి గడగడ వణుకుతున్నాయి ఇది మంచుతుపాను, దీనిని ఎదుర్కొనగలశక్తి ఎవరికీలేదు. ఆ అల్లరి విను ఆ గుసగుసలూ, తోపులూ, నిప్పుకణాలు ఎలా పైకివిరజిమ్ముకొని వస్తున్నాయో చూడు ఆమంటలు యీక్షణాన నిజంగా మంటలేకాని, అవంతా గారడీ, మంత్రకత్తెల పిశాచ శక్తుల ప్రభావం నన్ను గట్టిగా పట్టుకో ఎక్కడున్నావ్? ఎక్కడున్నావు?

ఫౌస్ట్

ఇక్కడే. యిక్కడే.

మెఫిస్టోఫిలిస్

అంత దూరమెందుకు జరిగావ్. ఎవరో తోసేసి వుంటారునిన్ను. ఈ కనబడని శక్తులతో కలహం యిలాగే యుంటుంది. రా యిలా దగ్గరకురా. పోనీ నీవు అక్కడే వుండు. నేనే నీవగ్గరకు వొస్తాను. నుంచున్న చోటునుండి

కదలకు గుండె దిటవుచేసుకో. నేను నీ ప్రక్కనవుండగా యీభూతప్రేతాలు నిన్నేమీ చేయలేవు. అందుకనే ఇందాక చెప్పాను నన్ను గట్టిగా పట్టుకోమని. నీవు విన్నావా? డాక్టర్ ఫౌస్ట్, నన్ను గట్టిగా పట్టుకో ఈ గుంపులో మనం వుండటం కాదు, మరొకచోటికి వెళ్ళుదాం. వీళ్ళందరినీ నా ఆజ్ఞానువర్తులుగా చేయగలననుకో కాని అది అనవసరమిప్పుడు

ఫౌస్ట్

నీవు క్షణానికొకమాట చెబుతావ్ అన్నమాట నిలబెట్టుకోడం నీ స్వభావం కానట్టున్నది నన్ను యీవాల్పర్గిస్ పండగలో పాల్గొనడానికి, పనిగట్టుకొని తీసుకొని వచ్చావు నన్ను ప్రేతగణంతో భయపెట్టావు నీవే నన్ను కాపాడవలసినవానిగా వేషం ధరించావు సరి, యింతదాకా వచ్చి యీ పండుగ వింతలు చూడకుండా పోవడం దేనికి? ఎక్కడో పొంచి యీ భూతాల వింతలు ఒకసారి చూచిపోదాం. నీ అభీష్టమే కానియ్

మెఫిస్టాఫిలిస్

ఆ మంటలకేసి ఒకమారు చూడు ఏ చిన్న మంట వైపు చూచినా చుట్టూ ఎందరున్నారో! మనిషి భరించలేనిది ఒక్కటే - అది ఒంటరితనం

ఫౌస్ట్

నలుగురితో కలిసిపోవాలనే నాకూ ఉంది మంటలపై నుండి వచ్చే పొగలు ఎంత చక్కటి వలయా

కారాలు ఏర్పరచుకుంటున్నారో చూడు. ఆ జనమంతా తమ నాయకునికోసం ఎదురు చూస్తున్నట్లున్నారు. పాపం, వారి సమస్య లెటువంటివో

మెఫిస్టోఫిలిస్

ప్రాణమంటూ ఏర్పడ్డాక దాని వెంట సమస్యను కూ - జోడించి పంపాడు దేముడు వాళ్ళకీ కావలసినన్ని సమస్యలు కాని మనం మాత్రం సమస్యాప్రపంచానికి దూరంగా, చీకూ చింతలూ లేకుండా, యీ లోకాన్ని లోకపు బయటనుంచి వొక్కమారు చూదాం. అటు చూడు ఆ మంత్రగత్తెలు యౌవన విలాసినులు, ఎలా దిగంబరంగా నృత్యం చేస్తున్నారో వయోవృద్ధులు కూడా ఎదటా సిగ్గూ శరమూ లేకుండా వారు తమ నృత్యగానాలలో మునిగివున్నారు. నిన్ను వాళ్ళకు పరిచయం చేస్తాను, వస్తావా? మధ్యలో నిన్ను వదిలివెళ్తానని భయపడకు నేనెప్పుడూ నీ నీడవలె వుంటాను. అద్భుతాలు కానని, యీ విశాల ప్రదేశంలో ఎటు చూచినా వేల సంఖ్యలో కనిపించే యీ మంటలు, యీ నాట్యగానమూ, యీ వినోద విలాసాలూ, సామాన్యులకి లభ్యంకావు. వారు సేవించే ఆ మధుపానము అమృతాన్ని పోలినది మదిరామానినుల సమక్షంలో, విశాల ప్రకృతి నివాస మందిరంగా, ప్రేమగీతాలే గానామృతంగా, వారి కే వినోదాలు చూడు

ఫౌస్ట్

వాళ్ళందరూ మంత్రగాళ్ళు అంటున్నావు వాళ్ళందరివద్దకూ నేనొక మంత్రగాడిలా రానా? లేక నీవంటి భూతానికి స్నేహితుడినని రానా? నన్నూ ఒక భూతమై పొమ్మంటావా?

మెఫిస్టోఫిలిస్

ఏచోటునుబట్టి ఆ వేషం వేసుకోవాలి నేను చిన్నప్పటినుంచీ ఆ విద్యలో ఆరితేరినవాణ్ణి ఒకే వేషం అన్ని చోట్లా ధరిస్తే మనముఖం ఎవరూ చూడరు. వీరిమధ్య మసిలేందుకు కావలసిన దుస్తులు, మేజోళ్లూ, గుర్రంపాదం తత్సంబంధమైనవన్నీ నేను నీకు సమకూరుస్తాను అదేమంత కష్టంకాదు ఆ కిటుకు నాకు తెలుసు మాంశు అటువైపు చూడు, ఆ నత్తగుల్లను చూడు ఆమాట విను.

జనరల్

అన్నీ అవాంతరాలే! లోకులకు విశ్వాసమునేది ఏ కోశాన్నయినా వుంటేగా! వీళ్ళకు ఎంత మేలుచేసినా వ్యర్థమే స్త్రీజనచిత్తంలాగా యీ ప్రజాహృదయం కూడా వట్టి చంచలమైనది ఎప్పటికప్పుడు యువకులు, యువకులు అంటారు యువకులనే పైకి తీసుకురావాలంటారుగాని, అనుభవశాలుర మాట వినరు

మంత్రి

ఈకాలంలో ధర్మం నశించిపోయింది. నా చిన్నతనంలో యిలా వుండేదా! మా నాన్నగారికాలంలో మంత్రి

గారు వస్తున్నారంటే హడల్. నిజంగా వెనుకటి రోజులే మంచివి. అధికారంలేని మంత్రిత్వం ఎందుకు ఏడవను?

ఉపమంత్రి

మనం తెలివితక్కువవాళ్ళం కాము. అప్పుడప్పుడు మన కిష్టంలేనిపనులు చేయవలసివచ్చినా, కాలక్రమేణా మనంచేసే ప్రతిపనీ అధికారం నిలుపుకోడంలో సహాయపడేదిగా, జాగ్రత్తపడతాం అధికారం వచ్చేదాకా అది చేజిక్కించుకునేందుకూ, ఆపైన అది నిలబెట్టుకునేందుకూ, పన్నాగాలు పన్నాలి అంతకుమించి యింకేమీ లేదు. మన తెలివితేటలూ, మంచి చెడ్డలూ ఎవరికీ అక్కరలేదు.

కవి

ఈ రోజుల్లో పుస్తకాలు చదవడం, సమకాలీన సారస్వత మెలావున్నదో తెలుసుకోడం, మెదడు వుపయోగించి సమగ్రంగా పరిశీలించడం వట్టి దండగపనులు. నన్నడిగితే మెదడునూ పుస్తకాలనూ మూసిపెట్టమంటాను పెద్దలకు మనం చెప్పేది అక్కర్లేదు చిన్నవాళ్ళకి మనం చెప్పేది అర్థంకాదు. ఇక కుర్రకారు సంగతా - వాళ్ళు తాము వ్రాసినవే తప్ప మరొకటి చదవరుగా

మెఫిస్టోఫిలిస్

(వృద్ధునివలె వేషం మారుస్తూ) ఈలోకంలో పాపాలు బాగా పండుతున్నాయి. ప్రభువు తీర్పుచెప్పేరోజు దగ్గరపడుతున్నట్లుంది. ఈ కొండకు రావడం యిదే నాకు కడసారి కావచ్చు.

ఒక మంత్రకత్తె

ఎందుకర్రా ఆ తొందర. నా దగ్గర వింత వింత వస్తువులున్నాయి. ఆ అమూల్యమైన వాటిని మీరెక్కడా చూడలేదు ప్రపంచపు నాలుగు మూలలా గాలించినా మీకు లభించవు ఇదుగో యీ బాకు చూడండి ఇది రక్త వర్షాన్ని కురిపించగలదు. ఈ పాత్రలో ఏముందో చూడండి. అమృతమనుకుంటున్నారా? కాలకూట విషం ఈ బాకులు బాంధవ్యాలని త్రెంచేవి ఈ పాత్రలు ప్రేమలను కలుషితం చేసేవి లోకాలను కలుషితం చెయ్యదగ్గ సరుకు ఏది కావలసి వచ్చినా, మీరు నావద్దకే రండి అవన్నీ నావద్ద చీవిగా లభ్యమవుతాయి

మెఫిస్టోఫిలిస్

అత్తా బాగున్నావా? ఈ కాలచక్రపు యిరుసులో పడి నీవూ నలిగిపోతున్నావా? పూర్వస్మృతులతో భవిష్యత్ మర్చిపోతున్నావా? భూతకాలంలో జీవిస్తే తప్ప, ప్రాణులకు విముక్తి లేదు

ఫౌస్ట్

ఇన్నాళ్ళకు నీ నోటినుంచి ఒక మంచి మాట విన్నాను పండగరోజు కనక, అనుకోకుండా అనేసి వుంటావు

మెఫిస్టోఫిలిస్

ముందుకు నడుస్తూవున్న యీ ప్రాణులన్నీ తాము ముందుకు నడుస్తున్నామని అనుకుంటున్నాయి. అది ఒట్టి

గమనమో తిరోగమనమో కూడా వాటికి తెలియదు. భూతాల సంగతే ఏమిటి, మనుష్యులూ అంతే ననుకో

ఫౌస్ట్

ఇంతకీ యీ ముసిలిది ఎవరు?

మెఫిస్టోఫిలిస్

ఆ మనిషిని గురించి ఎందుకుగాని, అటు చూడు, ఆమెను చూడు

ఫౌస్ట్

ఎవరామె?

మెఫిస్టోఫిలిస్

అదాం మొదటి భార్య. ఆ శిరోజ సౌందర్యమూ, ఆ దేహచ్ఛాయ చూచి భ్రమపడ్డావా ప్రమాదం. ఆమె మీద మీదకి దూసుకొనివస్తుంది యువకులను ఏడిపించడం ఆమెకు సరదా.

ఫౌస్ట్

ఒకనాడి నాకొక కలవచ్చింది ఆ కలలో ఆపిల్ చెట్టు చూచాను. చెట్టున రెండు ఆపిల్ పళ్ళు నిగనిగలాడు తున్నాయి వాటిని కోసుకుందామని చెట్టెక్కాను

మెఫిస్టోఫిలిస్

ఆపిల్ మనిషిని అజ్ఞానంలో ముంచేది అదిరావడం స్వర్గలోకంలో నుంచే గాని, యీ భూలోకంలో అది మను ష్యులకు మాయహార కప్పుతుంది నా కల చెప్పనా? అంతా ఎడారి. ఆ ఎడారిలో రెండు నరికివేయబడ్డ చెట్లను

చూశాను ఆ చెట్ల పేర్లేమిటో తెలుసుకునేందుకు కూడా నేను ప్రయత్నం చెయ్యలేదు పచ్చని చెట్లు ఏవైతేనేం, రెండూ నరికివేయబడ్డాయి.

ఫౌస్ట్

ఆ కలకు అంతరార్థం నీకు బోధ పడిందా?

మెఫిస్టోఫిలిస్

అర్థాలూ, అంతరార్థాలూ ఆలోచించే పాటి వోపిక నాకెక్కడిది? నీకు ఆపిల్ కల వస్తే నాకు ఎడారికలవచ్చింది. రెండూ కలలేగా. చూడు చూడు అటు చూడు ఒంటిరిగా వున్న ఆ దివ్యసుందరి, నిస్త్రాణతో సొమ్మసిలి పడి పోతోంది చేయూత దొరుకుతుందేమో నన్నట్లు ఆమె నేత్రాలు ఆశగా దీనంగా చూస్తున్నాయి.

ఫౌస్ట్

ఆమె అక్కడినుంచి ఎందు కలా మెల్లగా నడిచి వెళ్ళిపోతోంది? ఆమె పాదాలు వెనక్కు తిరిగివున్నాయా ఏమిటి? అచ్చురాలా మార్గరెట్ వలెనే వున్నది. ఆమె యిక్కడి కెందుకొచ్చింది? ఎవరా కామిని?

మెఫిస్టోఫిలిస్

మార్గరెట్ యిక్కడి కెందుకు వస్తుంది? మనిషిని పోలిన మనుష్యులు వుండకూడదా? ఎదంతా ఒకటే ఖంగారు జ్ఞాన సంపన్నుడవేగాని మనోస్థైర్యం లేదు. ఇది మాయ, బాబూ మాయ ఇంద్రజాలం. గారడీ నీకు కనిపించినది ఒక మాయ బొమ్మ. నివు అ మాయ

బొమ్మను అనుసరించడంవల్ల ప్రయోజనం లేదు ఎంతటి వాళ్ళనూ యీ బొమ్మలు రాళ్ళుగా మార్చివెయ్యగలవు. దానివెంట పడిపోకు.

ఫౌస్ట

నన్నెందుకిలా వుక్కిరి బిక్కిరి చేస్తున్నావు? ఆ నేత్రాలలోని దీనత్వం నన్నింకా జాలిగా పిలుస్తున్నప్పుడు యీ కాళ్ళు పరుగెత్తక ఆగుతాయా? ఎంత సుందరమైన దేహం ఆ యువతిది! ఆ తనూవిలాసం చూస్తున్నకొద్దీ మార్గరెట్‌తో గడిపిన మధురక్షణాలు గుర్తుకి వస్తున్నాయి.

మెఫిస్టోఫిలిస్

ఓహో! మళ్ళ పైత్యప్రకోపమా? ప్రేమలోపడిన వారి కండ్లలో మెసిలేది ప్రియురాలుకాక మరెవరు? ప్రతి రూపంలోనూ ఆమె దర్శనమిస్తూంటుంది దానిని ప్రేమ వ్యాధి అంటారు.

ఫౌస్ట

కాని ఆ జబ్బులో ఎంత సొగసున్నదీ! ఎంత ఆనందమున్నదీ! సుఖదుఃఖాల తూగుటుయ్యాల మీద ఊగుతున్నపుడు ఎన్ని మధురానుభూతులు! ఆ కేంద్రీకృత స్థానంనుంచి మనసును మరలించుకోడం సాధ్యమా? దానిలో అమరత్వముంది కనుకనే యీ మనసు ఆ తీయ తేనీయకోసం, ఆ అలౌకికానంద స్పర్శకోసం అన్నిటికీ తెగించి ముందుకురుకుతుంది

మెఫిస్టోఫిలిస్

నీవు చెప్పేది నిజమేకాని కాల ప్రవాహంలో యీ దివ్యానుభూతికూడా గులకరాయిలా కొట్టుకుపోతుంది ఎప్పు డానిని అక్కడ బంధించాలనుకుంటావు. ని చేతికి చిక్కి నట్లే కనిపిస్తూ చేతుల మధ్యనుంచి జారిపోతుంది క్కడ చూపిస్తున్న యింద్రజాలంవంటిదే ని కక్కడ మానవ లోకంలోనూ ఉన్నది. నాట్యంలో, గానంలో, యీ బంధాలనుంచి పారిపోచూస్తారు కొందరు అక్కడ నాట్యశాల కనపడుతోంది పద, మనం కూడా పోదా మక్కడికి

నాటక నిర్మాత

మళ్ళీ ఒక క్రొత్త నాటకం ప్రారంభిస్తున్నాము. సరిక్రొత్త నాటకం ఏడు భాగాల గొలుసుకట్టు నాటకంలో యిది చరమ నాటకం. ఈ ఏడు నాటకాలూ వేటికవి విడి విడిగా ప్రదర్శించడం మా సంప్రదాయం. విటినన్నిటిని కలిపి ఒక నాటకంగా తయారు చెయ్యకూడదా అంటారు అప్పే అది కుదరదు మేమీ నాటకాన్ని మహా పండితుని చేత వ్రాయించలేదు ఎందుకంటే రసపుష్టి, పాండితీ ప్రతిభా, ప్రజలకి అక్కర్లేదని మాకు అనుభవంవల్ల తెలుసు. ఏ విషయంలోనూ స్థిరాభిప్రాయం లేక మిడిమిడి జ్ఞానంతో కొట్టుమిట్టాడే ఒక చవకబారు కవోపాసకుణ్ణి పట్టుకొని అతనిచేత యీ నాటకం తయారు చేయించాం. అనేక చోట్ల మేమిచ్చిన ప్రదర్శనలవల్ల ఇది జన సామాన్య ప్రశం

శాగా నచ్చుతుందని మాకు తెలుసు మిమ్మలను సంతోష పెట్టడమే మా ధ్యేయం ఇంకా చెప్పవలసింది చాలా ఉంది యిప్పటికే కాలతీతమయింది. అంచేత నా ఉపన్యాస మిక్కిలితో విరమించి నాటకం ప్రారంభించేందుకు తమ అనుమతిని అర్ధిస్తున్నాం మన్నించాలి ఇక శలవు (లోనికి తప్పుకుంటాడు)

(నాటక ప్రారంభం)

అధికారి

నాటక ప్రారంభానికై ఎదురుచూస్తున్న మహాజనులారా! మీకందరికీ నా ధన్యవాదాలు ఇది విశ్రాంతి దినం కనుక యీ విశ్రాంతిని ఆనందంతో జోడించాలని, యీ ఏసవర్తర ప్రదర్శన తిలకిస్తూము మీరు తనివితీరా ఆనందించి మమ్ము ధన్యులను చేయండి పర్వత ప్రాంతమే రంగస్థలంగా, మంచుకొండా తెరలుగా - ఈ పురాతనమైన కొండమీద, ఈ లోయలో మా నాటకం ప్రారంభిస్తున్నాము. ఎవరా వచ్చేది?

రాయగారి

నేను రాయగారినండి ఇది ప్రభువు స్వర్ణోత్సవం మా ప్రభువువారి వివాహమహోత్సవ స్వర్ణోత్సవం మా రాజుగారికీ రాణీగారికీ పరిణయమయి నేటికి ఏబది సంవత్సరములు నిండుతవి ఇప్పటికి వారిలోగల మనస్పర్ధలన్ని నశించి ఒకరినొకరు సహానుభూతితో అర్ధం చేసుకోగల సవకాశం ఏర్పడింది. అందుకనే దీనిని స్వర్ణోత్సవ

మన్నాము. రాజూ రాణీల మధ్య కలతలుపోయి యిద్దరూ ఒకటయ్యారంటే యిక ప్రజలు కోరుకోతగ్గదేమున్నది? నూ రాజ్యమే ఒక భూతలస్వర్గం

భూతనాథుడు

భూతప్రేతపిశాచాల్లారా, మీరు మీ ముసుగులు వదిలివేసి నిజరూపాలతో బయటకి రండి ఇవేళ రాజూరాణీల పండుగ వారి జీవితంలో కొత్త అధ్యాయం ప్రారంభమవుతుందంటున్నాడు రాయబారి వెనుకటి స్పర్థలన్నిటికీ వారు స్వస్తివాచకం చెబుతున్నారట.

(విదూషకుడు గంతులువేస్తూ ప్రవేశిస్తాడు రంగస్థలంమీదికి అతనివెంట అతనిని అనుకరిస్తూ చాలామంది రంగస్థలంమీదికి ప్రవేశించి తమ సంతోషం ప్రదర్శిస్తూ వుంటారు)

వాయువు

ఇన్నాళ్ళకు యీ శుభవార్త నా చెవినపడటం ఎంత సంతోషం! ఇది నిజంగా ప్రమోదభరితమగు ... దినం ఈనాటి గానోత్సవంలో అపస్వరాలు లేకుండా నేను చూచుకుంటాను

భూతనాథుడు (రాజు)

ఇదిగో రాణీ, యిన్నాళ్ళకు మనం మన ధర్మం తెలుసుకోగలిగాము. నిశ్చలమూ నిరంతరమూ అగు ప్రేమకు ఏభైసంవత్సరాల వియోగ మొక పునాదిరాయి

వంటిదేమో! ఇంతటి వియోగానంతరమే ప్రేమలో గాఢత్వమూ, తీవ్రతా నిరూపిత మవుతాయేమో?

రాణి

భార్యాభర్త లిద్దరూ ఒకచోట వుంటే రాజ్యచక్రం తిరగదు. నన్ను తొందరగా దక్షిణ ప్రాంతాలకి పంపండి. మనిద్దరం చెరోచోటా వుండి, కడు జాగరూకులమై మెలగుతే తప్ప యీ రాజ్యచక్రం తిరగదు.

రాజూ రాణీ వాద్య బృందనాయకుడు

గాలిలో ఎగిరేపక్షులూ, నేలమీద తిరిగే ప్రాణులూ, మీరంతా మీమీ సంసారాలతో మాకు స్వాగతం చెప్పేందుకు సిద్ధంగావుండండి రాళ్ళకింద దాగివున్న కప్పలూ, గడ్డిలో దాగే యీలకోళ్ళూ రండి బయటికి. ఈనాటి గానకచ్చేరి జరపవలసిన బాధ్యత మీదే.

సొరబుర్ర గాయకుడు

ఇప్పుడే మాకూడా సమయానికే తటస్థపడింది గాలిలో గొర్లుకుంటూ వస్తోంది నా సొరకాయబుర్ర. నేను దానిని వూదగానే తడినేలనుంచి నీటి బుడగలు పైకివస్తాయి. వానపాములు యీ వింత చూద్దామని శబ్దంవైపుగా నడుస్తూ వస్తాయి

పిల్లభూతం

నాకు కావనసింది సాలీడు పాదం, కప్పపిల్ల పొట్టా. కీటకాలని పాడలెత్తించే రెక్కలూ యీమూడు కావాలి. ఇవివుంటే చాలు నా శక్తి ఎన్నోరెట్లు పెరుగుతుంది

18

జంటకవులు

మనకు కావలసిందేమిటంటారా? చిన్న అడుగులు వేస్తూ పెద్ద గంతులు వెయ్యడం. నాలుకకు తియ్యని మధువూ, నాసికకు కమ్మనివాసనా యివిచాలు మా మనసు తృప్తిపడుతుంది. ఈ లోకంలో ఆనందాలకి మూలాధారం డబ్బు అది ఎలా వస్తుందో చెప్పారా మీకు మేము కల కాలం ఋణపడివుంటాం.

తొందరపడుతున్న ప్రయాణీకుడు

మీ కండ్లముందు కనిపిస్తున్నదంతా నిజమనుకుంటున్నారా? ఇదంతా వట్టిశూన్యం. కనికట్టు యిందులో దేనీ నమ్మకండి పోనీ యింతదాకా వచ్చినవాణ్ని ఆ మహారాజెవరో, ఆయన్ని చూచిపోతే బాగుంటుంది

సనాతనుడు

గోళ్ళూ తోకాలేని భూతాలేమిటి? పిశాచగణం నిక ఆ రెండూ విధిగా వుండాలని పుస్తకాల్లో వ్రాసివుంది. పురాతనగ్రంథాల్లో లేనిది నేను నమ్మదలచుకోలేదు. నను కటికి గ్రీకుదేశంలో దేవతలకూ దెయ్యాలకు భేదం తెలిసేది కాదుట.

కళాకారుడు

ఇదంతా ఏదో గందరగోళంగా వున్నది, ఇందులో కూడా ఒక పద్ధతి ఏడ్చినట్లున్నది. ఏమైనా వీళ్ళగోలలో పడినా ఇటలీయాత్ర సంగతి మరిచిపోకూడదు. అది ముఖ్యం యీ నాటకం కంటే.

## పాతకాలపు మనిషి

నా దురదృష్టం కాకపోతే నే నిక్కడికి వచ్చిపడుట యేమిటి? విధి నన్నిలా తరిమితే నేనేం చేయగలను? దుర్విధి నన్ను మంత్రగాళ్ళ మధ్య పడెయ్యడమా? విళ్ళ మాటలుగా, వీళ్ళవైఖరీ నాకేమీ తెలిసి చావడం లేదు.

## యౌవనవతియగు మంత్రకత్తె

ఈ రోజుల్లో రంగు వేసుకోకపోతే ఏలా? వయసు మళ్ళినవాళ్ళు వయసులో వున్నట్లు కనబడకపోతే స్త్రీ జీవితానికి విలువే లేదు. అదీకాక తమ శరీరావకరాలు దాచుకోనేందుకు పెద్ద కోట్లు ధరించినట్లే, అందంగా కనపడేందుకు రంగులు కూడా వేసుకోవచ్చు అందులో తప్పేమున్నది? ఇక నేనంటే - నాకివ్వేమీ అక్కర్లేదు నా దేహానికి సహజలావణ్యమున్నది ఉడుపులు ధరించ నవసరం లేకుండానే నా దేహకాంతులు ఎదుటివాని ఆకర్షించగలవు.

## మధ్యవయస్కురాలు

మనిషై పుట్టాక మర్యాద ముఖ్యం అందం వున్నది కదా అని నలుగురిముందూ ప్రదర్శించుకొంటే ఏం బాగుంటుంది? ఆ అందం విలువనిస్తుందా? దేనికైనా కొంచెం ముందూ వెనకా వుండాలి. శరీరకాంతి కాలగమనంతో తగ్గిపోతుంది. మనుష్యులకు గుణం ప్రధానంగాని, రూపం కాదు. ఆ సంగతి నాకు తెలుసుగనకనే అంత ఘట్టిగా ఉద్ఘాటిస్తున్నాను.

వాద్యనాయకుడు

ఎగిరే పక్షులూ, పాకే ప్రాణులూ యీ దిగంబరా కారాలను చూచి యిటువైపు రావడానికి హడలిపో తున్నాయి రాతికిందనున్న కప్పలూ, గడ్డిలో దాగ్గ యీలకోళ్ళూ తమ సంగీతపులయలను ఎన్నటికీ మరిచిపోవు.

గాలికోడి

ముఖ్యులంతా యిక్కడ సమావేశ మయ్యారు కన్నెపిల్లలూ బ్రహ్మచారులూ కూడా యీ గుంపులో వున్నారు వాళ్ళిరువురూ తమకు ఉజ్జలు వేరుగదా అవి కోరికలను మనసులో కట్టేసుకొంటూ వెర్రిగా చూచుకుంటున్నారు ఒకరివంక మరొకరు.

మరో గాలికోడి (మరో వైపునుంచి)

భూదేవి వీళ్ళందరినీ కోపం వచ్చి మింగెయ్యాగా కదా! నా కెందుకు, ఏం జరగాలో అదే జరుగుతుంది

కొంగ

స్వచ్ఛమైన నీళ్ళలో చేపలను పట్టాలంటే నాకెంతో యిష్టం నీరు స్వచ్ఛంగా లేకపోయినా నాకంత యిబ్బంది లేదు కాని భూతాలమధ్య అంత మంచి మనిషి యిరుక్కొని పోవడం ఏదో వింతగా వుంది.

ఛాందసుడు

వేదాంతులకూ సాధకులకూ అన్ని మార్గాలూ ఒకటే. అన్ని రూపాలూ ఒకటే వారికి గమ్యస్థానం ప్రధానంగాని మార్గం కాదు.

నర్తకుడు

మరొక క్రొత్త బృందం రాబోతున్నది. అది దూరాన వుండగానే ఆ వాద్యగానం స్పష్టంగా వినబడుతోంది. అది రంగస్థలంమీదకు వస్తోంది. మీరు లేచి నిలుచోనక్కరలేదు.

నాట్యాచార్య

నృత్యసాధనలో కుంటివాళ్లూ, గూనివాళ్లూ, దృఢకాయులూ, సామాన్యులూ అనే భేదంలేదు చూడండి వాళ్ళందరూ ఎలా ఎగురుతూ నృత్యం చేస్తూవస్తూన్నారో!

ఉత్తముడు

ఈ తెలివితక్కువ మనుష్యులను భరించడ మెలా? వీరు చివరకు నాశనంకాక ఏమవుతారు? రణగుణధ్వనులు సంగీత మవుతాయా? గానపారవశ్యంలో తప్ప మానవ హృదయం మేలుకోనదే ఈ భీకర నాదాలు వారిని నరక కూపంలోనికి నెట్టుతున్నాయి.

సంకుచితుడు

చెవులు దద్దరిల్లే శబ్దాలంటే నాకు మహా యిష్టం. అసలు యీ లోకమే ధ్వనితో పుట్టిందంటారు. నేను ధ్వనిని వుపాసిస్తాను. ధ్వనియే నాకు దైవం. పాపం, భూతాలకుమాత్రం వ్యక్తిత్వంలేదూ! వాటి ధర్మం అవి నెరవేరుస్తున్నాయి.

ఆదర్శవాది

నా వూహ ప్రపంచమంతా తిరగటిరాతికి కట్టేసి

నట్లయిందే ఆకాశవీధిలో ఎగరవలసిన గాలిపటాన్ని యింట్లో ఎగరేసుకోమంటే ఎలా వుంటుంది? నేను లోకుల దృష్టిలో వెర్రిబాగులవాడిలాగా కనుపిస్తాను.

వాస్తవవాది

నా మనసు దీనిని అవగాహన చేసుకోలేకుండా వున్నది. ఇక్కడికి రావడం యిదే నాకు ప్రథమం. ఇది నావంటివారికి తగిన స్థలంలాగా లేదు.

ప్రకృతి ఆరాధకుడు

ఎంతో ఆశతో వచ్చానిక్కడికి భూతాలలోకూడా కొన్ని మంచి భూతాలుంటాయని వినికిడి ఆ మంచివాటితో స్నేహం చేసుకోగలిగితే నా ప్రయత్నం విఫలం కానట్లే.

సంశయాకులచిత్తుడు

ఆ మంటలు తమ కోర్కెలు తీర్చే పెన్నిధు లనుకొంటారు. అవి కోర్కెలను ద్విగుణీకృతం చేస్తాయి. ఈ భూత లోకంలో ఏర్పడ్డ అనుభవం నా సంశయాలను మరింత పెంచుతోంది.

వాద్యకారుడు

రాళ్ళకిందనున్న కప్పలకు గడ్డిలోదాగే కీచురాళ్ళకు వున్నది మిడిమిడి జ్ఞానమే. అదికూడా జ్ఞానసంపదలో ఒక చిన్న అంశ కాని అవే సంగీతవిద్వాంసులనుకొంటే మేమంతా ఏమయిపోతాం?

సమయస్ఫూర్తి గలవాడు

చింతలతో వాపోవక ఎప్పటికెయ్యది ప్రస్తుతమో

ఆ ప్రకారం నడచుకొనే వాడే యీ లోకంలో నెగ్గుకు రాగలడు. అంచేత ప్రస్తుతం మనం కాళ్ళతో కాక తలతో నడువాలెననుకొంటున్నాము ఈ గుంపులో అదే తెలివి గల పని.

నిప్పు త్రొక్కే యోజకుడు

మనం ఏమీ చెయ్యడం లేదని అందరూ అంటారు. చేయడం చేయకపోవడం దేవునిక వొప్పజెప్పివేస్తే సుఖం కదా! మనం చేసినాకూడా దేవుడు అనుకూలించకపోతే అపని ఎలాగూ జరగదు అందుచేత భగవంతుడా నీదే భారమయ్యా - అనడం పోయి ఇక నాట్యం విషయంలో నంటారా, మా చెప్పులు అరిగిపోయేటట్లుగా నాట్యం చేశాము. అందుచేత వున్న చెప్పులు కాస్తా అరిగిపోయి చెప్పులులేని కాళ్ళతో నడుస్తున్నాము ప్రస్తుతం

కొరివి దయ్యాలు

మా పేరు మేము చెప్పకోకుండానే మీరు గుర్తు పట్టగలరు ప్రతిసారీ చివరికి మేము వూరివాళ్ళను కాపాడుతున్నాము

———

# చీకటిరాత్రి

(పొలాల్లో ఫౌస్ట్, మెఫిస్టోఫిలిస్)

ఫౌస్ట్.

అంతా చీకటి. ఈ కష్టప్రవాహాన్ని ఎలా దాటడం? మనసుకు స్థిమిత మేదీ? మార్గరెట్ ఎలా కుమిలిపోతున్నదో! అవమానాలన్నిటితో బాటు, చివరకు కారాగారానికి కూడా పోవలసి వచ్చిందా? ఆమెకు అభమూ శుభమూ తెలియదే. ఎందుకొచ్చిందీ దుర్దశ? ఈ పాపిష్టినాటకానికి కారణభూతుడవి నీవే ఇదంతా నీవల్లనే జరిగింది. దయా దాక్షిణ్యాలు నీలోకోసినా లేవు. ఎందుకలా గ్రుడ్లుమిటకరించికొని చూస్తావు? ఇన్ని కుతంత్రాలు తెలిసినవాడివి, ఇన్ని మాయోపాయాలు పన్నగలిగేవాడివి, ఆమెను రక్షించగలిగే మార్గం చెప్పి, ఈ హృదయాగ్నిని చల్లార్చకూడదూ? ఉహు, నా వెర్రిగాని నీవెందుకు వింటావు నామాటలు? నన్ను కష్టాల్లో ముంచడమే కాకుండా ఆమెను కూడా ఎందుకు దించావయ్యా రాక్షసుడా!

మెఫిస్టోఫిలిస్

నేను దించడమేమిటి? నాకేం తెలుసు.

ఫౌస్ట్

పశుపక్ష్యాదులకైనా జాలి వుంటుంది. నీలో ఏదో లోపించింది నీవు రాక్షసుడివీ కాదు – నీవు నీచుడివి. అధమ శ్రేణికి చెందిన మృగానివి. నికృష్టపు కుక్కవు. నీవు నన్ను యిప్పటికయినా వదలకూడదూ, బ్రతికి పోతాను నీవు మొదట శునకరూపంలో ప్రత్యక్షమైనప్పుడే అనుకొన్నాను, ఇదంతా ఏదో కుట్ర అని ఛీ! అధమాధముడా! నీవు నన్నూ మార్గరెట్‌ను యీ రూపంలో ఎంతకాలమని ఉంచగలుగుతావు? ప్రతి ప్రాణికీ విముక్తి నిచ్చే భగవంతుడు పైన వున్నాడు. నా హృదయ సంక్షోభమూ, నీ మాయాప్రవర్తనా ఆ సర్వాంతర్యామికి తెలియకపోవు. నీవు యీ మనుష్య రూపమెందుకు దాల్చావు? కుక్కలా తోకాడించుకొంటూ వీధులవెంట తిరిగితే పోయేది ఆత్మపథమూ, అమరగానమూ తెలియని వినాశకారివి. చీడపురుగులా దాపరించావు నాకు. అమాయకురాలైన మార్గరెట్ మృత్యుముఖం వైపు జాలిగా చూస్తూంటే అశక్తతతో నా దేహం భగభగ మండిపోతోంది నేనేమీ చేయలేను నీ పిచ్చి కూతలు వింటూ యిక్కడ కూచోవాలె.

మెఫిస్టాఫిలిస్

ఎందుకా ఎదురు సవాళ్ళు? ఎవరికైనా ఓపికకు ఒక హద్దూ పద్దూ ఉంటుంది. మానవుడికి బుర్ర ఉంది. అది వుపయోగించడం తెలిస్తే చాలా బాధలు రావు.

ఆ మెదడుకు ముసుగు కప్పి దానిని వుపయోగించే మార్గం మరిచిపోయి ఎదుటనున్నవాళ్ళమీద వీరావేశం కనబరుస్తే ఎవరేం చేయగలరు? దానినే పిచ్చికోపమంటారు నేను నీ మార్గానికెప్పుడైనా అడ్డు వచ్చానా? నీ కోరిక మీదనే కదా మీ యిద్దరికీ సంధానం ఏర్పాటు చేసింది? నాకోసం ప్రేమించావా మార్గరెట్‌ని? నన్ను దూషించేందుకైనా సబబూ సందర్భమూ వుండాలె.

ఫౌస్ట్:

నా మనఃక్లేశమంతా తెలుసుకొని నా హృదయతాప మేమిటో అర్థమవుతున్నా అర్థంకానట్లు నటించే నిన్ను చూస్తే అసహ్యం వేస్తున్నది నిమీద అసహ్యపడి నేను చేయగలిగింది లేదు. నెత్తిన పెట్టుకొన్నా నీవు నాకు వొరిగించేదేమీ లేదు నా ఆత్మపథంలో నీవు అడ్డుతగిలావు. కంటిలో నలుసుకి మల్లే, కాలిలోనిముల్లుమల్లే, ఎందుకు నన్నిలా వేధిస్తున్నావు? నన్ను ప్రశాంతంగాకూడా ఆలోచించుకోనియ్యవేం? ఎవరో వొకర్ని పట్టుకుని వారి జీవితాలలో చిచ్చుపెట్టి, వారు మార్గం తెలియక అల్లాడిపోతూంటే, కష్టసముద్రంలో మునిగిపోతూంటే, నీకు తృప్తిగా వుంటుందనుకుంటాను.

మెఫిస్టోఫిలిస్

నా కీయవలసిన దీవనలన్నీ అయిపోయినాయా? యింకా ఏమైనా మిగిలివున్నాయా?

ఫౌస్ట్

నీవు మార్గరెట్‌ని కాపాడాలి. ఆమెని కాపాడలేక పోతే, ఆమె వుసురు నీకు తగిలి నీవు వేలాది సంవత్సరాల పాటు, ఆ శాపకారణంగా నానాబాధలూ పడతావు. అమాయకురాలి శాపం మంత్రశక్తికంటె తీవ్రమయినది అది తిరుగులేని అగ్నిబాణం

మెఫిస్టోఫిలిస్

ఇంకా ఆమెకు ఎటువంటి శిక్ష విధించేదీ తీర్పుచెప్ప లేదుకదా! ఒకవేళ చెప్పారే అనుకో జైలు తలుపులు, నేను ఎలా బ్రద్దలుకొట్టగలను? వందలాది రక్షకభటుల మధ్య కారాగారంలో బందిగా వుంచిన మనిషిని బయటకి తీసుకొనిరమ్మంటే అది సామాన్యులు చేయగల పనా?

ఫౌస్ట్

నీ శక్తియుక్తులు నాకు తెలుసు నీవు నన్ను తప్పించుకోవాలని చూస్తున్నావు.

మెఫిస్టోఫిలిస్

పోనీ ప్రకృతిలో గల భూతశక్తులు మనకి విష యంలో సహాయం చేస్తాయేమో అడిగి చూస్తాను. నాకు చేతనైన పనులు వెనక చేసిపెట్టలేదా? స్నేహమంటే ప్రాణ మిస్తాను నేను. నీవు ఎంతకీ నన్ను నమ్మలేకుండావున్నావు.

ఫౌస్ట్

పోనీ నన్నా జైలు దగ్గిరకు తీసుకొనివెళ్ళు మార్గ రెట్‌ను మనం ఏదోవిధంగా రక్షించాలి.

మెఫిస్టోఫిలిస్

ఆమెను రక్షించి నిన్ను పురికంబం ఎక్కించ మంటావా? ఈ ప్రణయకావ్యానికీ, హత్యాకాండకూ కారకుడివి నీవని లోకులనుకొంటున్నారు. నగర ప్రజలు ఆవిధంగానే తీర్మానించారు. హంతకునిగా భావింపబడ్డ నీవు ప్రజల కంటబడితే వారు బ్రతకనిస్తారా! నీమీద కసి తీర్చుకోరూ, నీకారణంగా ఒక స్త్రీ బంధికానాలో పడిం దామె.

ఫౌస్ట్

ఇదంతా నా చేజేతులా చేశానంటావా? నాద్వారా నీవు చేయించావు ఇందులోని పాపభారమంతా నీదే. మార్గరెట్‌ను ఏదో విధంగా రక్షించాలి నా లక్ష్యమది వొక్కటే

మెఫిస్టోఫిలిస్

అంతగా అయితే నిన్ను తీసుకెళ్తానులే నా శక్త్యాను సారం నీకు సాయపడుతూనే వున్నాను ఎటువచ్చీ నీకు నా మీద నమ్మకంలేదు భూతప్రేత పశాచాల్లో నాకు కొంత పలుకుబడి వుండపచ్చు. కాని ఈ లోకపు అధికారం నా చేతుల్లో యేముంది? అయినా కాపలా మనిషిని బోల్తా కొట్టించి చూస్తాను. అతని దగ్గర ఉన్న తాళం చేతుల గుత్తులు తీసుకొని మాయ గుర్రాలతో మీ యిద్దరినీ ఎక్క డికైనా చేర్చగలిగే మార్గం చూస్తాను

ఫౌస్ట్

మరి ఆ మాట ముందే చెప్పకూడదూ? నా చేత యింత వాగించిగాని చెప్పకూడదనుకున్నావా? ఈ విడుదల ప్రయత్నంలోకూడా మళ్ళీ మరొక కిటుకు పెట్టకేం, బ్రతి మాలుకుంటాను

——

# చీకటిరాత్రి ఊరు వెలుపల

(అర్ధరాత్రివేళ వూరు ఆరుబయట ఫౌస్ట్, మెఫిస్టో ఫిలిస్ తమ నల్ల గుర్రాలమీద ఉరికంబం ఉండే చోటుకు వస్తారు)

ఫౌస్ట్

ఈ అర్ధరాత్రివేళ వాళ్ళక్కడ ఏం చేస్తున్నారు?

మెఫిస్టోఫిలిస్

అన్నిటికీ నేనే సంజాయిషీ చెప్పాలన్నట్లు, నీకు కలిగే సంశయాలన్నిటికీ నన్నే జవాబు చెప్పమని అడుగుతే నేనేం చెప్పగలను? బహుశా ఏమైనా వండుతున్నారేమో! ఆ మంటలు వంట పొయ్యిలా వున్నాయి.

ఫౌస్ట్

వాళ్ళు వంటలు చేసుకుంటున్నట్లు లేదు పందావుడిగా యిటూ అటూ తిరుగుతున్నారు

మెఫిస్టోఫిలిస్

నాకూ బోధపడటంలేదు యిదేదో కనికట్టు.

ఫౌస్ట్

వాళ్ళేదో పూజలు చేస్తున్నట్లున్నారు.

మెఫిస్టోఫిలిస్

పూజలా, భగవంతుని పూజలా - అయితే మన మిక్కడ వుండకూడదు, పదపద.

——

# జైల్లో

(జైలు తలుపుముందు ఒకచేతిలో తాళాల గుత్తి యింకోచేతితో లాంతరుతో ఫౌస్ట్)

ఫౌస్ట్

ఇటువంటి అంధకార మందిరాలు నాకు అలవాటైనవే మానవునిలోని దౌర్భాగ్యత అంతా యిక్కడ కళ్ళకి కట్టినట్లు కనిపిస్తోంది. ఎక్కడి మార్గరెట్ ఎక్కడికొచ్చిపడింది? తనేదో మహాపరాధం చేసినట్లు ఆమె వాపోతున్నది.

మెఫిస్టోఫిలిస్

తొందరగా అడుగు ముందుకు వెయ్యి. ఇక్కడ మళ్ళా వుపన్యాసాలూ, నీతిపాఠాలూ మొదలు పెట్టావా. మాటలే మిగిలి కార్యం చెడుతుంది.

(లోపలనుంచి సన్నగా పాట వినబడుతూంటుంది, మార్గరెట్ కంఠం)

ఫౌస్ట్

ఆ విషాదగీతిక ఎంత మధురాతిమధురంగా కరుణాతి కరుణంగా వున్నది. నేను ఎదుటికివచ్చినా ఆమె గుర్తించలేకుండా వున్నది. ఇంకా దగ్గిరకు వెళ్ళనా?

మార్గరెట్

అమ్మయ్యో - అమ్మయ్యో, అప్పుడే వచ్చేరా–నా కాలం తీరిపోయిందా!

ఫౌస్ట్

(మెల్లిగా) అలా హడలిపోతావెందుకు వురికంబానికి తీసుకెళ్ళడానికి వచ్చిన తలారిని కాదు. నిన్ను విడిపించుకుపోవడానికి వచ్చిన ఫౌస్ట్‌ని.

మార్గరెట్

మీకు నే నిక్కడున్నానని తెలిసిందా? నిజంగా నన్ను ప్రమాదం నుంచి కాపాడటానికివచ్చారా? ఈ వింతని నమ్మలేకుండా వున్నాను. భగవంతునికి నామీద ఎందుకింత కనికరం?

ఫౌస్ట్

కంగారుపడకు బిగ్గరగా మాట్లాడకు. నిద్రపోతున్న కాపలావాళ్ళు లేవగలరు.

మార్గరెట్

(ఫౌస్ట్ - ఫౌస్ట్‌లా గాక వురికంబానికి తీసుకుపోయే తలారివలె కనిపించగా) ఇంత అర్ధరాత్రివేళ నన్ను వురితియ్యడానికి మీకు ఎవరు అధికారం యిచ్చారు? ఆఖరికి వురితీసేందుకైనా వేళాపాళా వుండాలికదా! అరుణోదయ వేళ మీ విధి నిర్వర్తించుకోవచ్చు కాని – యీ అర్ధరాత్రి వేళ ఎందుకొచ్చావు? ఎంత కఠినునైనా ఆ మాత్రం జాలి లేదా నీకు?

ఫౌస్ట్

నేను తలారిని కాదు ఫౌస్ట్‌ని.

మార్గరెట్

(అమాంతం ఏదో గుర్తించినట్లుగా)

ఒకప్పుడు నేను చిన్నదాన్ని. న్యాయానికీ చావుకీ చిన్న పెద్ద అను తేడాలు లేవు. ఒకప్పుడు నేను చక్కదనాలచుక్కని ఆ చక్కదనమే నన్ను అంధకార ఏలానికి తీసుకొచ్చింది ఒకప్పుడు నా ప్రియుడు తన చేతులతో యీ కంఠసీమని అలంకరించాడు. ఆ పూలమాల యీనాడు తెగిపోయి, పూరేకులు చెల్లాచెదరై పడివున్నాయి నాకిక బలం లేదు. శక్తిలేదు త్రాణలేదు పూచెండలోని యీ చివరిపూవుతో నా హృదయకుసుమం భగవంతునిపాదాల మీద వుంచనీ.

ఫౌస్ట్

ఆమె శోకాంబుధిలో మునిగిపోయింది నా పునీత పలుకులూ ఆమెకి వూరటనియ్యలేకుండా వున్నాయి.

మార్గరెట్:

ఎవరు మీరు? మీరెందుకు వచ్చారిక్కడికి? నేను మిమ్మల్ని ఎప్పుడూ చూడలేదే! మీ రూపం నాకు గుర్తు లేదు మీదారిని మీరు వెళ్ళిపోండి. శిక్షం గానికి తొందరగా తయారు కమ్మంటారా? అర్ధరాత్రి వేళ వురితీస్తారా? విముక్తి పొందవలసిన ప్రాణం యిప్పుడై తేనేం, యింకా సెపటికై తేనేం? నా పాపకి పాలిచ్చి

వస్తాను. రాత్రంతా నన్నే హత్తుకుని పడుకుంది. ఆ పాల బుగ్గలూ, చిన్ని నోరూ, – ఆ పాపని నేను చేజేతులా చంపేశానని అంటున్నారా? అంతటి క్రౌర్యానికి నా చేతు లెలావస్తాయి? నేను కన్న ప్రాణిమీద నాకు తీపి వుండదా! పాత కథల్లో కథాంతమెప్పుడూ అలానే వుండేది. అవన్నీ కల్పిత కథలు. నా ముద్దుల పాపని జలదేవత రక్షించవలసిన అవసరం నాకేమొచ్చింది? నా పాప నాది, లోకులు ఏమనుకుంటే నేం!

ఫౌస్ట్

(అనునయంగా) నీ పాదాలపైబడి వేడుకుంటాను నిన్ను కాపాడటానికి వచ్చిన ఫౌస్ట్‌ని నేను, నన్ను గుర్తించు ఇక్కడనుంచి వెళ్ళిపోదాము

మార్గరెట్

(అతని పక్కనే కూలబడుతూ) ఈ విచార సాగరంనుంచి వొడ్డుకు జేర్చమని దేవతలని ప్రార్థిద్దాం. అటూ— అటు. ఈ ప్రక్కనే నరకలోకం వుంది ఆ రణగుణ ధ్వని అక్కడిదే నరకలోకంలోని భీకరాకారాలని మీరెప్పుడూ చూడలేదు కాబోలు

ఫౌస్ట్

(ఆమెని గట్టిగా పట్టుకు) మార్గరెట్ మార్గరెట్ (అరుస్తాడు)

మార్గరె

(ఏదో స్ఫురణకు వచ్చినదానిలా) ఆ కంఠం

ఎప్పుడో ఏనాడో విన్నదిలా వున్నది (ఆమె ముఖంలో చిరుహాస రేఖలు వెలుగుతాయి). ఎన్నాళ్ళకి విన్నాను ఆ కంఠం? మళ్ళీ పిలవండి ఆ పిలుపులోనే సప్త స్వరాలూ వున్నాయి మీరు నా ప్రక్కన వుండగా, యిక నాకు భయమేమిటి? ఊరి కంబమే కానీ ఎక్కడికైనా ధైర్యంగా వచ్చేయగలను మీ గుండెలమీద తల ఆనించుకోగలిగినప్పుడు యీ లోకం నన్నేం చెయ్యగలదు? ఈ నరకలోకపు రాక్షసులు దరిదాపులకు రాగలరా! నాకిక విముక్తి లభిస్తోంది ఏదీ మరొకసారి పిలవండి నన్ను.

ఫౌస్ట్

మార్గరెట్.

మార్గరెట్

మీరు ప్రక్కన ఉంటే యీ కారాగారం కమనీయ మందిరమవుతుంది ఈ సంకెళ్ళు పూలదండలవుతాయి. ఈ జన్మ తరించి పోతుంది. నన్నిక వదలి పోకండి ఇంతవరకూ శూన్యంవలె కనపడిన యీ అంధకారానికి, ఆ నిగనిగలెక్కడ నుంచి వచ్చాయి? ఆ తళుకులెక్కడ నుంచి వచ్చాయి? ఆ తళుకులెక్కడ నుంచి తెచ్చుకుంది అంధకారం!

ఫౌస్ట్

నిన్ను యీ జైలు గోడలమధ్యకు పంపిన పాంతకుడే నిన్నీనాడు విడుదల చేసేందుకు వచ్చాడు. ఇక రా.

తొందరగా వెళ్ళిపోదాం కాలయాపన వద్దు. ఆలస్యమయితే అనుకోని అవాంతరాలు ఎదురవవచ్చు

మార్గరెట్

(ఫాస్ట్ చెయ్యి పట్టుకుంటూ) ఏమిటి? మీ చేతులింత చల్లగా వున్నాయి? మీ దేహంలోని రక్త ప్రసారం నిలిచిపోయిందా? మంచు గడ్డలా వున్నారేమిటి మీరు?

ఫాస్ట్

ఈ మాటలు తరువాత మాట్లాడుకుందాం పద, తొందరగా పద, వెళ్ళిపోదాం

మార్గరెట్

మీరు నిజంగా ఫాస్టేనా? ఏక మాయావేషం వేసుకొచ్చిన మరొక వ్యక్తా అని నాకు అనుమానంగా ఉన్నది మీ చేతులూ పెదవులూ ఇంత శీతలంగా వుండటం నేనెప్పుడూ చూడలేదు. మీరు మీరేనా?

ఫాస్ట్

నా కంఠధ్వని విన్నాక కూడా మీ సంశయమెందుకు వచ్చింది?

మెఫిస్టోఫిలిస్

మీరు ఎటువంటి పనికిరాలిని కారాగారం నుంచి తప్పిస్తున్నారో తెలుసా?

ఫాస్ట్

మార్గరెట్, ఇలాంటివి [illegible] చెప్పటం లాభమేమిటి?

మార్గరెట్

తల్లిని చంపిన క్రూరురాలిని. కన్నపాపని నీళ్ళలో వొదిలిన కఠినాత్మురాలిని లోకమందరిచేతా 'ఛీ' అని పించుకున్న అవివేకురాలిని. నన్ను కాపాడటం వల్ల జరిగే దేమిటి? పోనీ మీ హృదయంలో వెచ్చదనమూ, ప్రేమా వున్నాయేమో అనుకుంటే, వొర్రి మంచుగడ్డలాంటి మను ష్యులైపోయారు నామీద ప్రేమవల్ల మీరు కాపాడు తున్నారా? లేక యీ దీనురాలిమీద దయవల్లనా? గోడకు పట్టిన చెమ్మఅంతా రక్తపుబొట్లవలె కనిపిస్తున్నది నాకు ఈ మలినహస్తాలతో నేను లోకంలోకి ఎలా వచ్చేది?

ఫౌస్ట్

మీ అమ్మగారికీ, అన్నకూ సమాధు లేర్పరించ వద్దూ? వారి ఆత్మశాంతికి పూజలు జరుపదగ్గవారు నీవుతప్ప యింకెవ్వరు? నీవు బయటికిరావాలి ఈ లోకంలో మంచి తనము యింకా మిగిలివున్నదనీ, సాధుజీవనాన్ని కుటిలత్వం జయించలేదనీ నువ్వు లోకానికి చెప్పాలి.

మార్గరెట్

ఎక్కడికి రమ్మంటారు?

ఫౌస్ట్

జైలుగోడల వెలుపలకి

మార్గరెట్

అక్కడ నాకు శాంతి లభిస్తుందని నమ్మకమేమిటి? నా జీవన ప్రథమాంకమే యిన్ని వొడుదుడుకులతో

ప్రారంభమయింది. మీ సమక్షానవుంటే అన్నీ మరిచిపో గలననిపిస్తుంది. కాని అది సాధ్యమా? మీ ప్రేమ నన్ను నిరంతరమూ కాపాడగలదా?

ఫౌస్ట్

నీకా సందేహం రావడం ఆశ్చర్యంగా వుంది. ఆత్మ విచారానికి సమయ మిదికాదు తలుపులు తెరిచివున్నాయి. త్వరగా పద.

మార్గరెట్

నేను అటువంటి ఆశలు పెట్టుకోకూడదు. ఈపారి పోడంవల్ల వారికేదేమిటి, నా నేరమింకా బలవత్తరమవు తుంది. నేరస్తురాలు పారిపోయిందని లోకమంతా వాకలై నన్ను వెంబడిస్తుంది.

ఫౌస్ట్

నేను వెంటనుండగా నీకు భయమేమిటి?

మార్గరెట్.

మీరు నా వెంట వుండవద్దు అది మీకు మంచిది కాదు. మీ రిక్కడినుంచి తొందరగా వెళ్ళిపొండి కలుషి తాలపాలైన నన్ను రక్షించేబదులు నోరెరుగని మన పాపని కాపాడండి. నా ప్రాణంకంటే మన పాప ప్రాణం ముఖ్యం. రక్షించేవారెవరూ లేరని దానిని వొక పెట్టెలో పెట్టి, నీటిమీద వొదిలిపెట్టాను ఆ పెట్టె వంకెన దిగు వన కనబడుతుంది ఆ పెట్టెలోని పాప మన పాప.

ఫౌస్ట్

ముందు నీ విక్కడినుంచి బయటపడ్డాక.

మార్గరెట్

నా తల్లి యిప్పుడు భూమిలో నిద్రపోతోంది నా తనయ నీటిమీద తేలిపోతున్నది. ఒకరు కొండమీద, మరొకరు నీటిలోనూ వున్నారు ఈ యిద్దరినీ వొదిలిపెట్టి నేను బయటికి ఎక్కడికి వచ్చేది? అదృష్టం నన్ను మోస గించింది మంచిరోజులు మళ్ళిపోయాయి

ఫౌస్ట్

(మార్గరెట్‌ని గట్టిగా పట్టుకుని బయటకి లేసు కొచ్చేందుకు ప్రయత్నిస్తాడు) నీ అంతట నీవు రాకపోతే, నిన్ను చేతుల్లో ఎత్తుకు బయటకు తీసుకెళ్తాను మరొక గత్యంతరం కనపడటంలేదు

మార్గరెట్

నా కిష్టంలేని చోటుకు నన్నెందుకు తీసుకెళ్తారు? మిమ్మ ప్రేమించినందుకు నాకు ప్రతిఫల మిదేనా? నేను ఏం తప్పు చేశానని యీ దండన?

ఫౌస్ట్

తెల్లవారబోతున్నది నామాట విను నీకు మం. ః స్థిమితంగా వున్నట్లు లేదు

మార్గరెట్

ఏమంటున్నారు? తెల్లవారనున్నదనేగా! తెల్లవా రడం కాలసహజం ఏ బ్రతుకైనా ఒకనాడు తెల్లవారి

తప్పదు. ఈ పరుగంతా ఆ చివరిరోజు వైపుకే. అదే నా శుభదినం. అదే నా ముహూర్త వేళ. అంతకు మించిన పుణ్యదినం నా కెప్పుడు వస్తుంది? మనం యిక్కడ కలుసుకోకపోయినా, తిరిగి వేరొక లోకంలో కలుసుకుంటాం. జనం వేలంవెర్రిగా మూగే నృత్యశాలవద్ద కాకపోవచ్చు. కాని అది అమరగానం వినబడే చోటు అది సువిశాల మగు స్థలము. అక్కడి మనుష్యుల విషపు నాలికలు మన సును గాయపరిచవు నన్ను ఆ లోకం పిలుస్తోంది ఆ లోకానికి దారి యీ ఉరికంబం. దీనిద్వారాతప్ప, మరొక విధంగా అక్కడికి చేరుకోలేను చనిపోతున్నాననే భయం నాకు లేదు. ఎంగాచ్చి ఆ మరణానుభవం నామీదనుంచి ఎంత తొందరగా వెళ్ళిపోతుందా అని చూస్తున్నాను.

ఫౌస్టు

అబ్బా! ఎలాంటి మాటలు వింటున్నాను నేను ఏ దుష్ట నక్షత్రాన పుట్టానో? అసలు పుట్టకుండా ఉంటే బాగుండేది.

(మెఫిస్టోఫిలిస్ ప్రవేశం)

మెఫిస్టోఫిలిస్

మిత్రమా తొందరగా బయటపడాలి. తొందరగా బయటపడకపోయావా నీవూ, ఆ పిచ్చి మనిషితో ఉరికంబం ఎక్కవలసి వస్తుంది. ఎందుకీ గాలికబుర్లు? ఇదంతా వ్యర్థ ప్రలాపన అరుణోదయ రాగచ్ఛాయలు తెలుపుతూ,

బయటనున్న అశ్వాలు సౌజ్ఞలు చేస్తున్నాయి. వాటి సకి లింపుకి అదే అర్థం

మార్గరెట్

ఎవరా వస్తున్నది? ఆ భీకరమూర్తి ఎవరు? ఆ వికృతాకారుడు ఎవరు? ఆ భయంకర స్వరూపు డెవరు? ఎవరతను? ఈ పవిత్ర స్థలంలో అతని కేం పని? ఆ ఘాతనాయకుడు యీ చాయల కెలా రాగలిగాడు.

ఫాస్టు

నిన్ను కాపాడేందుకు, నిన్ను రక్షించేందుకు. అతను నాకు మిత్రుడై వచ్చాడు.

మార్గరెట్

దేవుని విరోధి మీకు మిత్రుడా. అతను ... కారుడని మీకు యిన్నాళ్ళ బట్టీ తెలియనే లేదా? ... ను భగవంతుని బాట నుంచి బయటకు రాను ఈ ... నన్నేం కాపాడగలరు? నన్ను కాపాడేదీ, కరుణించేదీ దేవుడొక్కడే

మెఫిస్టోఫిలిస్

(ఫాస్ట్‌తో) ఓ పిచ్చి పండితుడా, తొందరగా ... మహానుభావా! ఆలస్యం చేశావా నేను వెళ్ళిపోతాను. నీవూ ఆవిడా నిశ్చింతగా అగాధం వైపు ప్రయాణం చెయ్యవచ్చు ఇక నా బాధ వుండదు నీకు ... నన్ను ... పడవేసిన వాడవవుతావు.

మార్గరెట్

పరమేశ్వరా! నన్ను రక్షించే భారం నీ ఒక్కనిదే. దేవదూతలారా - యీ ప్రాణాలు పోయినా కైనా నన్ను మీరు చీకటినుంచి కాపాడి, ఆ నిర్మల కాంతి పుంజంలోనికి, ఆ భగవత్ సాన్నిధ్యానికి, ఆ మహాదేవుని పాద పద్మాల వైపుగా నన్ను తీసుకు వెళ్ళండి. అదొక్కటే నా కోరిక

మెఫెస్టోఫిలిస్

ఆవిడ దేవుడి దగ్గరకు వెళ్తుందిట నువ్వుకూడా వెళ్ళదలచుకొన్నావా, నాతో వస్తావా, నీ యిష్టం నీ యిష్టమేమిటి? నీ మనసు నీ స్వాధీనంలో వుంటేగదా? (జబ్బపట్టుకు బయటకు లాగుతాడు జైలు తలుపులు మూసుకుపోతుంటాయి)

మెఫెస్టోఫిలిస్

ఎందుకా వెర్రి చూపులు? వూరుకే వేదనా? ఆమెని బయటకు తీసుకొద్దామనుకొన్నాము. మన చేతనయిన ప్రయత్నం చేశాము. నీవే స్వయంగా బ్రతిమాలావు కదూ! ఆమె రాను పొమ్మంటే మనమేం చెయ్యగలం? నావెంట రా. నేను నీకు సాయంగా వున్నానుగా! నిన్ను చివరిదాకా అంటిపెట్టుకొని వుండేది నేనొక్కడినే.

(జైలు లోపలినుంచి దివ్యగీతం వినిపిస్తూంటుంది)

మార్గరెట్

**పరమపురుషా - దేవదేవా - నన్ను కాపాడు. నీ దరికి జేర్చుకో - ప్రియా ప్రాణేశ్వరా -**

మెఫిస్టోఫిలిస్

తీర్పు అయిపోయింది

పైనుంచి అదృశ్యవాణి

మార్గరెట్ తన కష్టాలనుంచి రక్షింపబడింది

మెఫిస్టోఫిలిస్ (ఫౌస్టుతో)

పద - పద - మనంపోదాం (ఫౌస్టుని జబ్బ పుచ్చుక తీసుకెళ్ళిపోతాడు)

జైలులో నుంచి మార్గరెట్ (సన్నగా) ఫౌస్ట్ - ఫౌస్టు! ప్రాణేశ్వరా - ప్రాణేశ్వరా!!

సమాప్తం